యప్ప సహోదరుఁ డ్రిపుహిమాంబుజమిత్రుని గీర్తి పాత్రుఁ బెం
పుప్పతిలంగ నాశ్రితుల కబ్బుచు వాంఛ లొసంగునట్టి రా
జప్పను సన్నుతింతు నెఱజాణ యతం డిది కల్ల గాదిలన్. 67

ఉ॥ తిన్నని ముద్దునెమ్మొగము దియ్యని పల్కులు దీర్ఘబాహువుల్
వెన్నెల నొంచు నవ్వ కడుఁ బెద్దగు తొమ్ము దరంబుకంటె మే
లన్నగళంబు సారసములన్నిరి మించి వెలుంగు కన్నులౌ
రన్న యటంచు నెంతురు మరన్నకుమారుని రాజధీమణిన్. 68

ఉ॥ రాజస మెంతొ హెచ్చఁ గవిరాజులు మేల్బళి యంచు మెచ్చ బ
బ్రాజులు పద్యము ల్చదువ రాయపరెడ్డి ప్రమోదచిత్తుఁడై
తేజము నొందఁ దల్లియు వతిప్రియభామల నాదరింపఁగా
రాజపరెడ్డి సద్గుణ విరాజితుఁడై వెలుఁగొందె నందనా. 69

తే॥ ధరణి రాయప్ప మూడవ తమ్ముఁడైన । శౌరి విదితోపకారి భాస్వద్విచారి
హారి హితమోదకారి యోగ్యానుసారి । విబుధ శత్రువిదారి నా వెలయు నెపుడు 70

సీ॥ మహి మించు పాపమాంబయు మరన్నయుఁ బ్రేమ । ముద్దుఁగొడుకని మురియుచుండఁ
గృప నీడులేని రాయపరెడ్డిచంద్రుండు । చిన్ని తమ్ముఁ డటంచుఁ జెలఁగుచుండ
సద్గుణంబుల నెన్న సగనుఁడౌ రాజప్ప । యొద్ద బాయక నెప్పు దిద్దుచుండఁ
దనతోడి బాలకు ల్వినయ సమేతులై । ప్రాజ్ఞుఁడితఁ డటంచుఁ బలుకుచుండ

తే॥ నలరి పెంపొందె గోపువంశాంబుజాత । సవితృఁడని రూపజితపంచశరుఁడటంచు
వైభవసురేంద్రుఁ డంచు దైవజ్ఞులెల్లఁ । దెలిసి కొనియాడ విద్యలఁ దేరి శౌరి. 71

క॥ గోపుమరన్న సుసంతతి । యీ పగిదిన్ వృద్ధినొందె నిఁక నీవప్పన్
భూపాలక మోదకర । వ్యాపారుని నభినుతింతుఁ బ్రజ్ఞాలీలన్ 72

సీ॥ అద్వైతమతమునం దారూఢమైనట్టి । సర్వేశ్వర స్తోత్రసరణి గవియె

67. రిపుహిమాంబుజ మిత్రుని=విరోధులు అనెడు తామరలకు సూర్యునివంటివానిని। కీర్తి పాత్రుని=కీర్తింప తగినవాని। ఆశ్రితులకు అబ్బుచు=ఆశ్రయించినవారలకు సంతోషించుచు కోరికలను ఇచ్చెడు। నెఱజాణ=మిక్కిలి నేర్పుగలవాడు.

68. ముద్దునెమ్మొగము=ముద్దులు గులుకు మొగము। వెన్నెలను నొంచు=జయించెడు। దరంబు=శంఖము। గళము=కంఠము। సారసములన్ నిరి=పద్మముల మిక్కిలి మించి। రాజధీమణిన్=రాజప్ప అను శ్రేష్ఠుని.

69. రాజసము=ప్రభుత్వము। విరాజితుఁడు=ప్రకాశించువాడు.

70. విదితోపకారి=ప్రసిద్ధమైన యుపకారము చేయువాడు। భాస్వద్విచారి=ప్రకాశించు యాలోచనలు గలవాడు। హారి=సుందరమైనవాడు। హిత మోదకారి=స్నేహితులకు సంతోషము కలిగించువాడు। యోగ్య అను సారి=మంచివారి ననుసరించి నడచువాడు। విబుధశత్రు విదారి నాన్=రాక్షస నాశనము చేయు విష్ణుమూర్తి యనునట్లు.

71. కృపన్ ఈడు లేని=దయచేత సమానము లేని। సగనుఁడౌ=గెలిసినవాడైన। యొద్ద బాయక=సమీపము విడిచిపెట్టక। సమేతులై=కూడినవారలై। ప్రాజ్ఞుఁడు=పండితుడు। గోపువంశ అంబుజాత సవితృడు=గోపు వంశమనెడు పద్మములకు సూర్యుడు। రూపజిత పంచశరుఁడ=మన్మథునికంటె సుందరమైనవాడు। వైభవ సురేంద్రుడు=దేవేంద్రునికన్న వైభవము గలవాడు। దైవజ్ఞులు=జోతిశ్శాస్త్రము తెలిసినవారు

72. భూపాలక మోదకర వ్యాపారుని=రాజులు సంతోషించునట్టి పనులు చేయువాని.

73. అద్వైత మతమున=దేవుడొక్కడే యనువారి మతమునందు (శ్రీమ్మవుల వేదము) ఆరూఢమైన=ప్రసిద్ధమైన। స్తోత్ర సరణి=స్తుతించు మార్గము। భాసుర అఖండ పూజ విశేష అప్రతిభావము=ప్రకాశమైన పూర్ణ

ఏసునాథ స్లీవ భాసురాఖండ పూ।జా విశేషా ప్రతిభావ మెఱఁగ
సంజీవనాథాంఘ్రి సంస్మరణమున న।గ్లానంద బోధా విధానుఁడగుచు
వర్ణింపఁ దగు సత్యవాక్య నైపుణ్యుఁడై।శ్రమ మొప్ప సకల ధర్మములు సల్పి
తే॥ హార హీర పటీర మందారశారద।దాభ సత్కీర్తిఁ గాంచె నీ ధరణియందు 73
నతఁడు సామాన్యుఁడని యెన్న నర్హమగునె।యహితహాననుఁడు గోపు స్లీవప్పఘనుఁడు
ఉ॥ ఒప్పుల కుప్ప ధైర్యవిదితోజ్జ్వల కాంచన భూధరుండు తాఁ
గొప్పఁగఁ జేసె గ్రామముల గుత్తలు ధర్మపథంబు నెయ్యెడం
దప్పక యంచు ధీరులు ముదంబున నెంచెద రుర్వి గోపు స్లీ
వప్పను విశ్రుతుండగు మరన్న సహోదరు సజ్జనాదరున్. 74
శా॥ భావజ్ఞుండు కవీంద్ర భట్టముఖ సప్తాంగమ్ముల న్నేర్పునం
బ్రోవం జాలిన పుణ్యమూర్తి సుగుణాంభోరాశి నిర్గర్వుఁడౌ
రా విత్తేశ సదృగ్ధనాఢ్యుఁడని నిత్యంబెంతు రీధారుణిన్
స్లీవప్పన్ ఘనగోపు వంశతిలకున్ లీలాజితాంగోద్భవున్. 75
సీ॥ సిరులఁ బెంపు వహించు సిరిపురంబున నిజ।భవనంబు నిల్పి వైభవము లలర్పఁ
దుమ్మవంశోదధితుహినాంశుఁడైన ము।ద్దారెడ్డి తనుజాత నీరజాత
నేత్రయౌ నమృతమ్మ ధాత్రిసదృక్శాంతి।గుణఁ బెండ్లియాడి యాకొమ్మవలనఁ
గనియెఁ బుత్రులఁ బుత్రికల వారిలోపలఁ।గొండయ్య యనఁ బెద్దకొడుకు వెలయుఁ
తే॥ జిన్నమాంబ యనంగ భాసిల్లెఁ దనయ।దాని మహిఁ దుమ్మకొండప్ప సూనుఁడగుచుఁ
బరఁగు పాపయ్య కొసఁగిరి భార్యగాఁగ।మఱియుఁ గొండయ్య నెంచెద మహిమ మిఱ. 76
ఉ॥ తియ్యని వింటివాఁడు జిగిదేఱిన సుందరరూపరీతి వె
న్కయ్య సహోదరుండగు రణావని నద్భుత వైభవంబునన్
వెయ్యిగను ల్వహించి తగు వేలుపుఱేఁడన మించె గోపుకొం
డయ్య ఘనుండటంచు జనులందఱు సందముగా నుతింపఁగన్. 77

---

మైన పూజయందలి విశేషముయొక్క సాటిలేని యభిప్రాయము। సంజీవనాథాంఘ్రి సంస్మరణమున=సంజీవనాథ స్వామి వారి పాదములను తలంచుకొనుటచేత। అగ్లానంద బోధా విధానుడు=అగ్లానందస్వామి బోధ అనుసరించువాడు। హార హీర పటీర మందార శారద ఆభ=ముత్యముల హారము, వజ్రము గంధము మందారము సరస్వతి వీనితో సమానమైన కీర్తి। అహిత హాననుడు=విరోధులను నశింప చేయువాడు.

74. ఒప్పులకుప్ప=సుగుణ రాశి। ధైర్యవిదితోజ్జ్వల కాంచన భూధరుడు=ప్రకటమైన మేరుపర్వతమువంటివాడు। గుత్తలు=గ్రామములను జమీనుగా తీసికొనెను। ధీరులు=పండితులు। విశ్రుతుడు=అందరికి తెలిసినవాడు। సజ్జనాదరున్=మంచివారిని ఆదరించువానిని.

75. భావజ్ఞుండు=ఎదుటివారి యభిప్రాయము నెరిగినవాడు। కవీంద్రులు భట్టులు మొదలైన సప్త అంగములన్ను అనగా సభకు కావలసిన యేడు విధములైన అంగములనెడు స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము। సుగుణ అంభోరాశి=మంచి గుణముల నెడు సముద్రమువంటివాడు। విత్తేశ సదృగ్ ధనాఢ్యుడు=కుబేరునితో సమాన ధనముగలవాడు। లీలాజితాంగోద్భవున్=సౌందర్యముచే మన్మథుని వంటివానిని.

76. ఉదధితుహినాంశుడు=తుమ్మవంశము అనెడు సముద్రమునకు చంద్రునివంటివాడు। నీరజాత నేత్ర=పద్మములవంటి కన్నుల గలది। ధాత్రి సదృక్ శాంత=భూమివలె శాంతగుణము గలది.

77. జిగిదేరిన సుందరరూపరీతిన్ తియ్యని వింటివాడు=కాంతి మించిన చక్కని రూపముచేత మన్మథునివంటివాడు (తియ్యని విల్లు=చెరకుగడ విల్లు) రణావనిన్ వెన్కయ్య సహోదరుడు=యుద్ధరంగములో వినాయకుని తమ్ముడు అనగా కుమారస్వామివంటివాడు। వైభవముచేత వెయ్యిగనుల్ వహించి తగు వేలుపుఱేడు=వేయి

క॥ కొండయ్య ధృతిని బంగరు । కొండయ్యె న్నిగుల నర్థికోటిఁ గరుణఁ జే
కొండయ్య యనుచుఁ గవ్వపుఁ । గొండయ్యె న్వితరణమునఁ గుంభినిమీఁదన్. 78

ఉ॥ కొండెము చెప్పిన న్వినఁడు కోరిన యర్థము లిచ్చు సత్కవీ
ణ్మండలి కప్రియాహితుల మాఱ్కొని త్రోలఁ బయోధి దాఁట వే
దండ విరోధి విక్రమవిధమ్మున సత్కరుణా విచారుఁ డీ
కొండపరెడ్డి నెన్నఁగల కోవిదు లెవ్వరు భూతలంబునన్. 79

సీ॥ అతఁడు తమ్మాన్వయా పతియైన చిన్నప్ప । పత్ని యంభోరుహపత్రనేత్రి
అనుపమ విరిబోణి యరుణ పల్లవపాణి । మధుకరనిభ వేణి మధుర వాణి
చంపక సుమ నాస చంద్రికాదరహాస । సత్కళాపూర్ణ శ్రీ సామ్యకర్ణ
గజనిభయానఁ జక్కఁదనంబుగల జాన । వినయవిచారి మారుని కటారి
తే॥ యై దగిన జ్ఞానమాంబను మోద మెసఁగఁ । బరిణయంబయి కనెఁ దనూభవుల సుతల
ధరణి స్త్రీపుంసంతతి కరణి వెలసెఁ । బెంపు నొందుచుఁ దామరతంపముగను. 80

సీ॥ ధీరుఁడౌ గొప్ప లింగారెడ్డి రెండవ । తనయుండనఁగఁ గేరు వినయశౌరి
గురు కాంచన క్షమాధర సదృక్ ధైర్యుఁడు । శౌర్యనిర్జిత ఘోర శాత్రవుండు
సర్వతోముఖనాథ సామ్య గంభీరుండు । బిసరుహాప్తజ తుల్య వితరణుండు
సర్వంసహాసదృశ క్షమాభరణుండు । సరిలేక తగు సింహసంహననుఁడు
తే॥ ఫలిత సర్వేశ్వరాఖండ భక్తిరస మ । రంద తుందిల హృదయారవిందుఁ డన్న
రెడ్డి పుంగవుఁడు పుడమి తేజము మీఱ । లెల్ల భళిరా యనంగ వర్ధిల్లె మిగుల. 81

నేత్రములుం గలిగిన ఇంద్రునివంటివాఁడు.

78. కొండయ్య అను నతడు ధైర్యమున మేరుపర్వతమువలె (=బంగరుకొండ) అయ్యెను, యాచించువారికి (=అర్థికోటి) దయతో తీసుకొండు పోగు అని (=చేకొండయ్య అనుచు) దానము చేయుటలో ఈ భూమిలో మంధర పర్వతము అయ్యెను (=వితరణమున కవ్వపుకొండ కుంభినిమీద అయ్యెను.)

79. కోరిన కోరికలను (=అర్థము) ఇచ్చి కవుల సమూహమునకు । ప్రియము లేని విరోధులను (=అప్రియ అహితులన్) సముద్రముయొక్క అవలి యొడ్డునకు తరిమి వేయుచు (=పయోధిదాట మాఱ్కొని త్రోలను) పరాక్రమముచేత ఏనుగులకు వైరియైన సింహమువంటివాఁడే! (=విక్రమ విధమున వేదండ విరోధి) దయతో గూడిన యాలోచనగలవాడు (=సత్కరుణా విచారుడు.) అనుపమ విరిబోణి=సాటిలేని పుష్పములవంటి శరీరముగలది।

80. అంభోరుహ పత్రనేత్రి=పద్మములవంటి నేత్రములుగలది। ... ... ... ...అరుణ పల్లవ పాణి=ఎఱ్ఱని చిగురులవంటి చేతులుగలది। మధుకరనిభ వేణి=తుమ్మెదలవంటి జడగలది। చంపక సుమనాస=సంపెంగ పువ్వువంటి ముక్కుగలది। చంద్రికాదరహాస=వెన్నెలవంటి చిరునవ్వుగలది। సత్కళాపూర్ణ=మంచి నిండు కళగలది। శ్రీ సామ్యకర్ణ=శ్రీ అను నక్షరమువంటి చెవులుగలది। గజనిభయాన=ఏనుగనడకలుగలది। జాన=అడది। వినయ విచారి=వినయముతో గూడిన ఆలోచన గలది। మారుని కటారి=మన్మథునికత్తి। తామర తంపముగా=పద్మములుగల కొలను విధముగా.

81. కేరు వినయ శౌరి=విజృంభించు వినయమును శౌర్యమునుగలవాడు। గురు కాంచన క్షమాధర సదృక్ ధైర్యుడు=గొప్ప బంగారు కొండతో సరియైన ధీరత్వముగలవాడు। శౌర్య నిర్జిత ఘోర శాత్రవుడు=పరాక్రమముచే దుష్టశత్రువులను గెల్చినవాడు। సర్వతోముఖనాథ స్వామి గంభీరుడు=సముద్రునివంటి గంభీర్యముగలవాడు। బిసరుహ ఆప్తజ తుల్య వితరణుడు=పద్మములకు మిత్రుడగు సూర్యుని కొడుకగు కర్ణునివలె దానము చేయువాడు। సర్వంసహా సదృశ క్షమాభరణుండు=భూమితో సరియైన ఓర్పుగలవాడు। సింహసంహననుడు=ఏయవయవ మెట్లుండవలెనో యట్లుండి చక్కనైనవాడు। ఫలిత సర్వేశ్వర అఖండ భక్తిరస మరందతుందిల హృదయారవిందుడు=ప్రయోజనకరమైన దేవునియొక్క పూర్ణమైన భక్తిరసమను తేనె త్రాపుటచేత పుష్టినొందిన మనస్సు అను పద్మముగలవాడు.

తే॥ కనియు వినియు నెఱుంగని కదనశౌర్య । మలర శాత్రవకోటి పెంపడఁచినట్టి
గోపువంశసుధావార్ధి కుముదమిత్రు । ననిమిరెడ్డిని వర్ణింప నలవియగునె. 82

సీ॥ దానవైఖరి సూర్య సూనుని మానసం । గతి ధార్తరాష్ట్రుని వితత శౌర్య
మున స్వర్నదీకుమారుని బలోన్నతి రేవ । తీమనోహరుని నతిప్రశస్త
విజ్ఞానలీలచే విదురుని ఘనతర । వైభవలీల గీర్వాణవిభుని
ధైర్యంబున సువర్ణధరణీ ధరేంద్రుని । సత్కళారూఢిచే సరసనుతుని

తే॥ మించి దీపించె నౌర యటంచు ధీరు । లెంచ దీనుల నెపుడుఁ బాలించు ధృతిని
వసుధ సామాన్యుఁడే గోపువంశ తిలకుఁ । డనిమిరెడ్డి మహాత్ముఁడౌ ననుట యరుదె. 83

క॥ ఆ రమణుఁడు ఘనుఁడగు కొ । మ్మారెడ్డి నృసింహారెడ్డి మార్తాండుని పె
న్గారాపుబిడ్డ యనఁగా । నారూఢిన్వెలయు వేగమాంబను బ్రేమన్, 84

ఉ॥ మెప్పుగఁ బెండ్లియాడి యల మీనవిలోచనయందు సత్యముం
దప్పనివాని సద్గుణవితానము నొందినవాని దీనులం
దెప్పుడు మిన్నయైన కృప నెంతయు నింపఁ దలంచువాని రా
యప్పనుగాంచె నెంచఁ గలశాంబుధి శీతమయూఖు వైఖరిన్. 85

శా॥ ఆ రాయప్ప విలాస మొప్పఁగను మేలౌరా యన న్మించు కొ
మ్మారెడ్డన్వయుఁ బుట్టిరెడ్డిమణి శుంభత్కీర్తిధౌరేయుఁ బు
త్రీరత్నమ్మగు నామనిమ్మయెడఁ బుత్రీపుత్రులన్ సద్గుణా
ధారుండై కరుణారసాంబునిధియై తాఁ గాంచె ధర్మాత్ముఁడై. 86

తే॥ అతఁడు పామూరనెడు పురి నతిశయముగఁ । గాఁపురము సేయుచును నలకాపురీశు
నటుల న్యాయార్జితంబైన యర్థగరిమ । గలిగి విబుధులఁ బోషించెఁ గరుణ వెలయ. 87

ఉ॥ భూరి యశోవిరాజితుఁడు పుణ్యచరిత్రుఁడు సత్యశాలి వం
దారు జనప్రియుండు నయధాముఁడు సద్గుణశోభితుండు దు

---

82. కదన శౌర్యము=యుద్ధమునందు శౌర్యము ప్రకాశించగా । శాత్రవకోటి పెంపు=శత్రువుల సమూహముయొక్క గర్వము । సుధావార్ధి కుముదమిత్రుడు=పాల సముద్రముయొక్క చంద్రుడు ।

83. దాన వైఖరి సూర్య సూనుని=దానము చేయుటలో సూర్య సుతుడనెడు కర్ణుని । మానసంగతి ధార్తరాష్ట్రుని=అభిమాన విషయములో ధృతరాష్ట్రుని కుమారుడగు దుర్యోధనుని । వితత శౌర్యమున స్వర్నదీ కుమారుని=ఎక్కువైన శూరత్వమున గంగా కుమారుడగు భీష్ముని । బలోన్నతి రేవతీ మనోహరుని=అధిక బలిమిచేత రేవతియొక్క భర్త యగు బలభద్రుని । అతి ప్రశస్త విజ్ఞానలీలచే విదురుని=మిక్కిలి వినికిడిని పొందిన జ్ఞానమునందు విదురుని । గీర్వాణ విభుని=ఇంద్రుని । సువర్ణధరణీ=మేరు పర్వతమును । సత్ కళ ఆరూఢిచే ఆ సరసనుతుని=మంచి ప్రకాశముయొక్క సంపదచే చంద్రుని ।

84. రమణుడు=సంతోషము కలుగ జేయువాడు । మార్తాండుని=సూర్యుని । పెన్ గారాపు=గొప్ప ప్రియమైన । ఆరూఢిన్=ప్రకాశముగా వెలయునట్టి ।

85. వితానము=సమూహము । మిన్నయైన=ఎక్కువైన । కలశాంబుధి శీతమయూఖు వైఖరిన్=పాల సముద్రముయొక్క చంద్రుని విధమున

86. అన్వయున్=వంశస్థుని । శుంభత్కీర్తి ధౌరేయు=ప్రకాశించుచున్న కీర్తిగలవాని ।

87. అలకాపురీశుడు=కుబేరుడు । న్యాయార్జితము=న్యాయముగా సంపాదించిన । అర్థగరిమ=విశేషమైన ధనముచేత

88. యశోవిరాజితుడు=కీర్తిచే ప్రకాశించువాడు । వందారు=నమస్కరించు జనుల । నయధాముడు=న్యాయమునకు స్థానమైనవాడు । దుర్వారతర అహిత అద్రి భిదుర ప్రతిమాన పరాక్రముడు=వారింపరాని శత్రువులం

ర్వారత రాహితాద్రిభిధుర ప్రతిమాన పరాక్రముండు దా
శౌరిని చిన్నపాప్పాయుని శాంతుల నిర్వుర గాంచె సూనులన్. 88

క॥ ఆ శౌరి చిన్నపాప్పాయు । లాశాంత ప్రధిత కీర్తులై దగి రంభో
రాశి గభీరులనంగ స । దాశల పూర్ణముగఁ జేయు చానందమునన్. 89

క॥ ధారుణి నీకరణి సదా । చారస్థితి ననిమిరెడ్డి సంతతి దగ లిం
గారెడ్డి తృతీయాత్మజు । నారపరెడ్డీంద్రు నెంతు నయవాక్యములన్. 90

శా॥ ఘోరతరాహితాంబునిధి కుంభభవుండు ప్రసత్కళానల
ధీరవద ప్రవర్ధనుఁడు దిక్పరిపూర్ణయశుండు సుందరా
కార పరాజితాంగజుఁడు క్ష్మాస్థలి గోపు కులాధ్యుఁడైన యా
నారపరెడ్డి పుంగవు డనారతమున్ వెలసిల్లు ధన్యుఁడై. 91

సీ॥ అనిశంబు సర్వేశ్వరాఖండ భక్తి నె । మ్మది పాటు జేసి తన్మందిరమున
నేనునాథాచార్య శాశితాద్వైతశా । స్త్రప్రసంగముల నప్రమత్తుఁ
డై పఠింపుచు స్లీవయును తదాకృతికిఁ బ్ర । త్యర్క వారమ్మును గోర్కె లలర
భేరీ మృదంగాది భూరి వాద్యమ్ముల । భోరు గొల్పుచు నంత భూతి వెలయ

తే॥ భూపదీపాదికము లిచ్చి దురిత మోక్ష । ణంబు తన వారలకుఁ దక్షణంబె సేయు
గోపు వంశాంబునిధి రోహిణీపతి యనఁ । దగిన నారపరెడ్డిని బొగడ వశమె. 92

సీ॥ అట్టి నారపరెడ్డి యవని తుమ్మాన్వయు । కాంతుడై నట్టి యనంతరెడ్డి
పుత్రి నర్లమ్మను భూజనుల్ మెచ్చఁగ । ళ్యాణమై యా ముద్దులలనవలన
సుతుల నిర్వురఁ గాంచె సురుచిర మహిమ నం । దగ్రజుండగుచుఁ జిన్నప్ప దనరె
నతని సోదరుడు రాయప్ప పెంపు వహించె । చిన్నపరెడ్డీంద్రుఁడెన్న సముద

తే॥ శత్రు భయకర వరమూర్తి చారుకీర్తి । నిస్తులానంద హృదయుండు నిర్వికారి
దీనజన రక్షణాధ్యుండు భానుతనయ । సదృశవితరణ సత్యవాక్సముదయుండు. 93

సీ॥ అట్టి చిన్నపరెడ్డి యలరు తుమ్మాన్వయు । ప్రియుఁడైన రామన్న బిడ్డయైన
చిన్నమాంబను జగులెన్నంగఁ బెండ్లియై । కొడుకుల నిర్వురఁ గూర్మిఁ గనియె

---

అనెడు పర్వతమునకు వజ్రముతో సమానమైన పరాక్రమము గలవాడు। అప్పాయుని=పేరుగలవానిని।

89. ఆశ అంత=దిక్కు చివరగల। ప్రధిత=ప్రశస్తమైన। అంభోరాశి గభీరులు=సముద్రమువంటి ధైర్యము గల వారలు । సత్ ఆశలు=మంచి కోరికలను చేయుచు । తగి=ఒప్పి।

91. ఘోరతర అహిత అంబునిధి కుంభభవుడు=ఘోరమైన శత్రువు అనెడు సముద్రమునకు అగస్త్యుడు। ప్రసత్ కళ వలతి ధీరవద ప్రవర్ధనుడు=మంచి విద్యలచే చుట్టబడిన పండిత బిరుదుచే వృద్ధిపొందినవాడు। దిక్ పరిపూర్ణ యశుడు= అన్ని దిక్కులలో గొప్ప పేరుగలవాడును। సుందర ఆకార పరాజిత అంగజుడు=సొగసైన రూపముచేత ఓడింపబడిన మన్మథుడు గలవాడు। క్ష్మాస్థలి=భూమియందు। అనారతము=ఎల్లప్పుడును।

92. శాశిత=ఆజ్ఞాపింపబడిన। అద్వైత=ఒక దేవుడుగాక ఇంకొకడు లేడనెడు బోధ । అప్రమత్తుడు=జాగ్రతగలవాడు। తత్ ఆకృతికి=వారి స్వరూపమునకు। ప్రతిఅర్క వారము=ఆదివారము। భేరి, మృదంగము=ఢంకా మద్దెలలు। భూతి=మహిమ। దురిత మోక్షణంబు=పాపముల విమోచనము। రోహిణీపతి=చంద్రుడు।

93. సురుచిర మహిమ=ప్రకాశమైన ప్రభావముతో। సముద శత్రు భయకర వరమూర్తి=మదించిన శత్రువులకు భయము కలిగించు మంచి రూపము గలవాడు। చారుకీర్తి=ప్రశస్తమైన కీర్తి గలవాడు। నిస్తుల=సాటిలేని। నిర్వికారి=వికారము లేనివాడు। భానుతనయ సదృశవితరణ=సూర్యుని కుమారునికి (కర్ణుడు) సమానమైన ధర్మము చేయు గుణము గలవాడు। సత్యవాక్ సముదయుడు=సత్యము పలుకువాడు।

నందగ్రజుండు కొండవరెడ్డి యుడుముల । శాంతప్ప తనుజాత సత్యసహిత
నమృతమ్మను వరించి యాత్మజు పాపయ్య । నానందమాంబికె యనెడు సుతను
ఆ॥ గనియె జేసునాథ కరుణాకటాక్ష సం । ప్రాప్త సత్యవేద ఫలిత నిష్ఠ
గలిగి యర్చ్యశిష్టగణము లాత్మల మెచ్చ । శౌర్యధైర్యయుక్తి చర్యుఁడగుచు. 94
క॥ భండన భీముఁడు చిన్నపు । రెండవ తనయుండు విజితరిపుభీకరసై
న్యుండన రాయపరెడ్డి ఘ । నుం డిల క్రీస్తువు సారె నుతి సేయంగన్, 95
సీ॥ తుమ్మాన్వయాబ్ధీంద్ర తుహినకరుండగు । పాపిరెడ్డికి ముద్దుపట్టియైన
చిన్నమ్మను వరించి యెన్నఁగా సరిలేక । వెలసిన యామేటిలలనవలనఁ
దనయుల నిర్వురఁ దనయ నొక్కనిగాంచె । నందగ్రనుతు మర్యమాంబ ప్రేమ
నలరిన తుమ్మ పెద్దన్నాత్మజుండైన । శౌరికి భార్యయై గేరుచుండె.
ఆ॥ నట్టి మర్యమాంబ యనుజాత శౌరమ్మ । యును దదనుజుఁడగుచు నొనరు శౌరి
సద్గుణములచేత జను లెన్నఁ గోమునఁ । బెరుఁగుచుండి రతుల సరసమతులు. 96
క॥ ఘనుఁడగు నారపరెడ్డిం । ద్రుని రెండవ తనయుఁ డనఁగ రూఢంబగు కీ
ర్తిని దగు రాయప్ప తనూ । జుని గాంచెన్ శౌరి యనెడు శూరవరేణ్యున్. 97
ఉ॥ శౌరి యుదారధైర్యఘనశౌర్యకళావిభవమ్ము లెన్నఁగా
నేరివశంబు సత్యము నహీనమనీషయు శాంతభావమా
ధీరునియందె పెంపు గనె దిక్పరిపూర్ణ యశోవిలాసుఁడై
ధారుణియందు నద్వయిత ధర్మము సల్పుచునుండె నిందుగన్. 98
క॥ క్షితి నారపరెడ్డి సుసం । తతి యీగతి వృద్ధినొందె ధరణిస్థలి న
ప్రతిమాన సంప దుపశో । భితమై బుధవర్యు లెన్నఁ బ్రియమును వొందన్. 99

మరువపల్లె పుర వర్ణనము.

సీ॥ బంధుర సైంధవ గంధర్వ సంఘాత । మందిర సందోహ మానితంబు
సంతాన సముదాయ సంగతాఖిల బహిః । ప్రాంత ధాత్రీస్థలి రాజితంబు

---

94. సత్య సహిత=సత్యముతో కూడుకొనిన । సంప్రాప్త=ప్రాప్తముచే । ఫలితనిష్ఠ=ఫలితమైన నియమము కలిగి । ఆత్మల మెచ్చ=అర్చ్యశిష్టవారల సమూహము ఆయన గుణములను మెచ్చగా ।

95. భండన భీముడు=యుద్ధములో భీమునివంటివాడు । విజిత రిపు భీకర సైన్యుండ=జయించిన శత్రువుల భయంకరమైన సేనగలవాడు।

96. తుమ్మ అన్వయ అబ్ధి ఇంద్ర తుహినకరుండు=తుమ్మవంశమనెడు పాల సముద్రమునకు రాజైన చంద్రుడు । మేటిలలన=శ్రేష్ఠమైన స్త్రీ । తత్ అనుజాడు=ఆమెతో పుట్టినవాడు । అతుల సరసమతుల=సాటిలేని మంచి గుణములతో.

97. రూఢంబగు=ప్రసిద్ధమైన । శూరవరేణ్యున్=పౌరుషవంతుని

98. శౌరి ఉదార=శౌరిరెడ్డియొక్క దానగుణమును । కళ=విద్యలు । అహీన మనీష=తక్కువ కాని బుద్ధి । దిక్ పరిపూర్ణ యశోవిలాసుడై=దిక్కులంతటను నిండించిన కీర్తివిలాసముగలవాడై । అద్వయిత=సాటిలేని

99. సుసంతతి=మంచి వంశము । అప్రతిమాన=సాటిలేని । సంపత్ ఉపశోభితము=సంపత్తితో కూడిన

100. విస్తారమైన సింధుదేశపు గుఱ్ఱములయొక్క సమూహముల సాలలయొక్క గుంపుచేత ఒప్పుచున్నటువంటియు (=బంధుర సైంధవ గంధర్వ సంఘాత మందిరా సందోహ మానితంబు) కల్పవృక్ష సమూహముతో కూడుకొనిన సమస్త పట్టణము వెలుపలి సమీపమునందలి భూభాగములచే ప్రకాశించుచున్నటువంటియు (=సంతాన సముదాయ సంగత అఖిల బహిః ప్రాంత ధాత్రీస్థలి రాజితంబు) ఎల్లప్పుడును లెక్కకు మించిన గొప్ప పండితులయొక్క సుందరమైన ఇండ్లయొక్క కూడికచేత చక్కనైనటువంటియు (=సతత సంఖ్యాతీత సద్వి బుధ

సతత సంఖ్యాతీత సద్విబుధాంచితా । గార సమావేశ చారుతరము
వర్ణనీయాగణ్య వజ్రకదంబక । సంవాస విఖ్యాత సముచితంబు
తే॥ నగుచు దేవతాపురి వలనగుచుఁ దనరు । గగన మధ్య స్థితాబ్జసఖ ప్రభా వి
శాల దీప్తి ప్రదానేక జలజరాగ । గోపురం బగు మరువపల్లి పురంబు. 100

క॥ గురుతర మణిభర్మాంచిత । పురసాలోదార గరిమ పొలుపుగఁ దనరెన్
సురుచిరతర తత్పట్టన । శరజాతగృహావలగ్న సప్తకి యనఁగన్. 101

శా॥ భూరి స్వోదర పూరితాంబు వనిశంబుం ద్రావి తుండమ్ములన్
నీరేజమ్ముల నొంచుఁ ద్విన్నగర దంతివ్రాత మంచున్ దొరిం
జేర న్వచ్చి ప్రదక్షిణం బిడుచు నక్షీణధ్వనిం బల్కు నా
సౌరప్రోదిని నా మరాళరవ రాజచ్ఛ్రేయ మొప్పెం బురిన్. 102

ఉ॥ నీలసమూహ దీపిత వనేరుహరాగ శిలైక సౌధముల్
చాలఁగ నొప్పెఁ దత్ప్రకర సంగత వారిజలోచనామణీ
పాళిక మేఘరంజి నుడువం జనుదెంచి చలింపకున్న యా
లాలిత నిశ్చలాత్మ చపలాయుత వారిదసంచయంబనన్. 103

తే॥ ఉరుతరౌన్నత్యమైన తత్పురవినూత్న । పద్మరాగ స్థగిత సౌధ పంక్తిమీఁదఁ
జనుటచే నభ్రమధ్యస్థ సలిలసంభ । వాప్తునకు నిస్తులాస్తోక దీప్తియొదవె. 104

అంచిత అగార సమావేశ చారుతరము) వర్ణింపతగిన లెక్కపెట్టరాని రత్నరాసులతో గూడిన గృహములయొక్క ప్రసిద్ధితో కూడినటువంటిదియు (=వర్ణనీయ అగణ్య వజ్రకదంబక సంవాస విఖ్యాతి సముచితము) అగుచు స్వర్గ పట్టణమువలె (=దేవతాపురి) అగుచు ఆకాశ నడుమనున్న సూర్యునియొక్క కాంతివలె (=గగన మధ్య స్థిత అబ్జ సఖ ప్రభా) ఎక్కువకాంతి నిచ్చెడి అనేకమైన పద్మరాగ మణులతో కూడిన (=విశాలదీప్తి ప్రద అనేక జలజరాగ) గోపురములుగల మరువపల్లి అనెడు పురము తనరెను.

101. మిక్కిలి గొప్ప మణులచేతను బంగారుచేతను ఒప్పిన (=గురుతర మణి భర్మ అంచిత) పట్టణప్రాకారముయొక్క సొగసు చక్కగా తనరెను (=పుర సాల ఉదార గరిమ పొలుపుగా) అది యెట్లనగా: ఆ ప్రాకారము మిక్కిలి సుందరమైన ఆ పురము అనెడు లక్ష్మీదేవియొక్క (=సురు చిర తర తత్ పట్టణ శరజాత గృహ) నడుమునను్న మొలనూలువలె నున్నది (=అవలగ్న సప్తకి.)

102. విస్తారముగా తనయందు నిండుగా నున్న నీటిని (=భూరి స్వోదర పూరిత అంబు) దినదినమును త్రాగి తొండములతో పద్మములను (=అనిశంబున్ త్రావి తుండమ్ములన్ నీరేజమ్ములన్) ఈ పట్టణములోని ఏనుగులమంద బాధించును అని (=త్విట్ నగర దంతి వ్రాతము అంచును అని) ప్రభువైన మగ్రన్నయొద్దకు వచ్చి (=దొరం చేరవచ్చి) పట్టణముచుట్టు తిరిగి పెద్ద గొంతుగుని మొఱ్ఱపెట్టుచున్నెడు (=ప్రదక్షిణంబిడుచు నక్షీణ ధ్వనిం పల్కు) హంసల కూటములతో గంగానదివలె ఒప్పుచున్న అగడ్తచే పట్టణము ప్రకాశించెను (=ఆ సౌర ప్రోదిని నాన్ మరాళరవ రాజత్ శ్రేయము పురిన్ ఒప్పెను )

103. ఇంద్రనీల మణుల సమూహముయొక్క (=నీల సమూహ) ప్రకాశించెడు పద్మరాగ మణులయొక్క (=వనేరుహ రాగ) రాళ్లతో కూడి ముఖ్యమైన మేడలు విస్తారముగా ప్రకాశించును (=శిల ఏక సౌధముల్ చాలగ ఒప్పెను) అది యెట్లనగా: ఆ మేడల గుంపుపై కూర్చొనిన పద్మములవంటి నేత్రములుగల స్త్రీ సమూహము (=తత్ ప్రకర సంగత వారిజలోచనామణి పాళిక) మేఘరంజి అను పేరుగల సంగీతరాగమును పాడగా (=మేఘరంజి నుడువ) వచ్చి కదలక నిల్చిన (=చనుదెంచి చలింపక ఉన్న) ఆనందించుచున్న (=ఆలాలిత) చలనములేని (=నిశ్చలాత్మ) మెరపులతో కూడిన మేఘముల సమూహమో యనునట్లుండెను (=చపలాయుత వారిద సంచయంబు అనన్.)

104. మిక్కిలి ఎత్తయిన ఆ పట్టణములోని క్రొత్తయిన పద్మరాగమణులు కూర్చిన మేడల సమూహముపైన నడుచుటచేత (=ఉరుతర ఔన్నత్యమైన తత్ పుర వినూత్న పద్మరాగ స్థగిత సౌధ పంక్తిమీద చనుటచే) ఆకాశము నడుమనున్న సూర్యునకు సాటిలేని అధికమైన కాంతి కలిగెను (=అభ్ర మధ్యస్థ సలిలసంభవాప్తునకు

చ॥ సురుచిర భర్మ రత్న తతి శోభిత దండ సమీరధూత పాం
డర రుచి వర్ణనీయ వసన ధ్వజముల్ దగె నభ్రమధ్య భా
స్వరసిరుహాప్తమండల నిశాంత రమాహృదయేశుఁ గాంచి త
త్పుర వరలక్ష్మి పై విసరఁ బొల్పుగ నిల్పిన చామర స్థితిన్. 105

చ॥ పురి వరగోపురాగ్రతల భూరి వినూత్నహరిన్మణీసము
త్కరఖచితైక సైంధవ వితానము గన్పడె నందు దుష్టసం
హారులగు బాహుజుల్ కువలయాహితుఁ డంచు రవిన్ జయించి తా
మరుదుగ నిల్పు నా దినకరాశ్వవిలాసము పొల్పు దెల్పుచున్. 106

క॥ అగణిత వజ్రస్థాపిత । యగు తత్పుర వీధి యొప్పె నాత్మాత్మజయా
నగర శ్రీఁ గనవచ్చిన । నగహారనగరమునఁ దనరు నదియో యనఁగన్ 107

చ॥ పరఁగఁగ సత్కదంబక విభాహరుఁ డౌచు నభీష్టమా వసూ
త్కరము బుధవ్రజంబునకుఁగా నిడి కైకొనుఁ గ్రమ్మఱ న్నిశా
చరుఁడతఁ డాత్మయందుఁ దలఁపన్ ద్విజరాజన రాదటంచు న
ప్పురమున నొప్పుచుందు రల భూసురు లిద్ధకళావిభాసురుల్. 108

నిస్తుల అస్తోక దీప్తి ఒదవెను.)

**105.** సుందరమైన బంగారు మణుల సమూహముచేత (=సురుచిర భర్మ రత్నతతి) ప్రకాశించెడు స్తంభములమీద (=శోభిత దండ) గాలికి కదలుచున్న తెల్లని కాంతిగల బాగదదగిన వస్త్రములుగల జెండాలు ఒప్పెను (=సమీర ధూత పాండర రుచి వర్ణనీయ వసన ధ్వజముల్ తగెను) అది ఎట్లనగా: ఆకాశమధ్యమందున్న సూర్యమండలమే (=అభ్రమధ్య భాస్ సరసిరుహాప్తమండల) ఇల్లుగా కలిగిన విష్ణువును చూచి (=నిశాంత రమాహృదయేశు కాంచి) ఆ పట్టణమనెడు లక్ష్మీదేవి అతనిపై విసరుటకు చక్కగా ఉంచిన చామరములవలె ఆ జెండాలు ఉన్నవి (=తత్ పుర వరలక్ష్మి పై విసర పొల్పుగా నిల్పిన చామరస్థితిన్) సూర్యబింబములో ఉదయమున బ్రహ్మయును, మధ్యాహ్నము శివుడును, సాయంకాలమున విష్ణువును ఉండురని శాస్త్రము గలదు. ఇక్కడ మధ్యాహ్నమందే విష్ణువున్నట్టు చెప్పినాడు.

**106.** పట్టణములోని శ్రేష్ఠమైన గోపురములయొక్క చివర భాగమునందుగల ఎక్కువ శ్రేష్ఠమైనట్టి పచ్చలనెడు రత్నములచేత (=పురి వర గోపుర అగ్రతల భూరి వినూత్న హరిన్మణీ సముత్కర) చెక్కబడిన ప్రశస్తమైన గుఱ్ఱముల సమూహము కనబడెను (=ఖచిత ఏక సైంధవ వితానము) అందు దుష్టజనులను సంహరించిన రాజులు కలువలకు శత్రువని సూర్యుని గెల్చి (=అందు దుష్టసంహారులగు బాహుజుల్ కువలయ అహితుడు అంచు రవిన్ జయించి) తాము వింతగ కట్టిపెట్టిన సూర్యుని గుఱ్ఱముల చక్కదనమును ఆ గోపురము తెల్పుచున్నది (=అరుదుగ నిల్పు దినకరాశ్వవిలాసము పొల్పు తెల్పుచు) తా॥ సూర్యుని జయించి సూర్యుని గుఱ్ఱములను తెచ్చి గోపురములమీద కట్టి పెట్టినట్లున్నది. గోపురములమీది పచ్చరాతి గుఱ్ఱములు, సూర్యుని గుఱ్ఱములును పచ్చని రంగు గలవి.

**107.** లెక్కలేని వజ్రములు తాపటము చేసిన ఆ నగరముయొక్క వీధి ఒప్పెను (=అగణిత వజ్రస్థాపిత యగు తత్ పుర వీధి) అది యెట్లనగా: తన కూతురగు పట్టణమనెడు లక్ష్మిని చూడవచ్చిన (=ఆత్మాత్మజయా నగరశ్రీన్) స్వర్గములో ఉండెడు గంగానదివలె ఆ వీధి యున్నది (=నగహారనగరమునన్ తనరు నదియో అనగ) గంగకు లక్ష్మి కూతురగును.

**108.** ప్రకటముగా నక్షత్రసమూహముయొక్క కాంతిని కైకొనుచున్నవాడై (=పరగగ సత్ + కదంబక + విభా + హరుడు ఔచు) ఇచ్చవచ్చిన కిరణముల సమూహము (=అభీష్టమా వసువు ఉత్కరము) దేవతల సమూహమునకు (=బుధవ్రజంబునకు) ఇడి మరల చంద్రుడు (=క్రమ్మర నిశాచరుడు) కైకొనును. అతడు (అనగా చంద్రుడు) నక్షత్రములయొక్క రాజు (=ద్విజరాజు) అనరాదు అని ఆ బ్రాహ్మణులు (=అల భూసురులు) ప్రసిద్ధమైన విద్యలచేత ప్రకాశించువారలుగా (=ఇద్ధ కళా విభాసురులు) ఒప్పుచుందురు. తా॥ చంద్రుడు నక్షత్రములయొక్క తేజమును తాను కైకొని ప్రకాశించుననియు దేవతలు చంద్రకిరణములలోని అమృతమును తినుచుందు

సీ॥ అతను విభూతిచే నత్యంతముఁ దనర్చి । యార్యాభిమతలీల నమరఁ గూర్చి
సంతతాచల ధర్మ సంరూఢి విలసిల్లి । సర్వజ్ఞ గరిమచే సంతసిల్లి
యంచన్మహావారణానుహృత్ప్రభ గూర్చి । సదనంత గుణ విలాసంబు దాల్చి
పరభీమనామసంవాహత నుప్పొంగి । హరిశరోజ్జ్వల సమాఖ్యాప్తి నెసఁగి
తే॥ రాజశేఖర విఖ్యాతి రమణ నొంద । ధరణి నెన్నంగ నలరుఁ దత్పురమునందుఁ
దనరి రసమాన విక్రమ ధైర్య విజిత । సామజారాతి గిరులు రాజన్యవరులు. 109

మ॥ ధనదుండౌనన నర్థి పుణ్యజనులం దానేలి ప్రత్యర్థులౌ
జనులం బీడ యొనర్పఁ బంపునది యైశ్వర్యంబె యౌఁ చుం బురం
బునఁ బ్రత్యర్థి చయుంబుఁ బుణ్యజన రాడ్భూతిం బ్రవర్తిల్లఁ బ్రా
చిన సామర్థ్య వదాన్యతా మహిమచేఁ జెన్నొంది రావైశ్యులున్. 110

క॥ నిరతము బుధలోకస్తుత । సరసత సొంపొంద భూరిసారస కీర్తిం

---

టచే చంద్రుడు కృష్ణపక్షమున క్షీణించి మరల కైకొనుటచే శుక్లపక్షమున అభివృద్ధి పొందుననియు నూహించునది.

ఈ పద్యముయొక్క అర్థాంతరము: మంచి పురుషులయొక్కయు కవీశ్వరులయొక్కయు తేజము నశింప చేయువాడై (=సత్ + కదంబ + కవి + భాహరుడు) ధనసమూహము (=సువు ఉత్కరము) పండిత సమూహ మునకు (=బుధవ్రజంబునకుగా) ఇచ్చి గాత్రమూడు (=నిశాచరుడు) మరల కైకొనును. అతడు (అనగా రాక్షసు డు) బ్రాహ్మణుల రాజు (=ద్విజరాజు) అనగాడు అని మొదలుగా

109. విస్తారమైన ఐశ్వర్యముతో మిక్కిలి ఒప్పి (=అతను విభూతిచే అత్యంతము తనర్చి) పెద్దలకు ఇష్ట మైన రీతిని ఒప్పునట్లుగా కలుగచేసి (=ఆర్య అభిమతలీల అమర కూర్చి) ఎల్లపుడును చలనములేని ధర్మకార్య ములయందలి నిశ్చయముతో ఒప్పి (=సంతత అచల ధర్మ సంరూఢి విలసిల్లి) అన్ని విషయములను తెలిసినవా రు అను గౌరవముచే సంతసిల్లి (=సర్వజ్ఞ గరిమచే) ఒప్పుచున్న గొప్ప అడ్డులేని విరోధులయొక్క అతిశయము నశింపచేసి (=అంచత్ మహా అవారణ అనుహృత్ ప్రభగా కూర్చి) యోగ్యమైన విస్తార సద్గుణముల విలాస మును ధరించి (=సత్ అనంత గుణ విలాసంబుగా దాల్చి) విరోధులకు భయము కలుగ చేయువారను పేరును వహించి ఆనందించి (=పర భీమ నామ సంవాహతగా ఉప్పొంగి) సింహమువలె రెల్లువలె తెల్లనైన కీర్తి పొం దుటచేత సంతోషించి (=హరి శర ఉజ్జ్వల సమాఖ్యా అప్తి ఎసగి) రాజులలో శ్రేష్ఠులనెడు ప్రసిద్ధి ప్రకటము కాగా (=రాజశేఖర విఖ్యాతిరమణము ఒంద) ఆ పట్టణమునందు క్షత్రియులు (=రాజన్యవరులు) సాటిలేని పరా క్రమము ధైర్యము (=అసమాన విక్రమ ధైర్య) వీనిచే జయింపబడిన (ఏనుగునకు విరోధియైన) సింహము అనెడు పర్వతములుగలవారై తనరిరి. (=విజిత సామజ అరాతిగిరులు) తా॥ ఆ క్షత్రియులు సింహ బలముగలవారు.

ఈ పద్యముయొక్క అర్థాంతరము: మన్మథుని కాల్చిన బూడిదతో (=అతను విభూతిచే) మిక్కిలి ఒప్పి। పార్వతికి ఇష్టమైన వేడుకలను (=ఆర్య అభిమతలీల) కలుగచేసి। కొండ పర్వతమును ఇల్లుగా పట్టుకొను (=అచల ధర్మ) నిశ్చయముతో విలసిల్లి। సర్వజ్ఞుడు అను పేరుగల గౌరవముచే (=సర్వజ్ఞ గరిమచే) సంతసిల్లి। ప్రసిద్ధమైన గొప్ప ఏనుగు రూపుదాల్చిన గజాసురునియొక్క ప్రాణములను హరించిన పరాక్రమమును (=అంచ త్ మహా వారణ అను హృత్ ప్రభగా) నశింపచేసి। యోగ్యమైన ఆదిశేషునను సర్పరాజును తన వింటి నారినిగా చేసికొనిన (=సత్ అనంత గుణ) విలాసమును ధరించి। శ్రేష్ఠమైన భీముడు అను పేరును పొందియుండుటచేత (=పర భీమ నామ సంవాహతగా) ఉప్పొంగి। విష్ణుదేవుని బాణముగా చేసికొన్నాడను కీర్తి (=హరి శర సమా ఖ్య) పొందుటచేత ఎసగి। చంద్రుని శిరస్సునందు దాల్చికొన్నాడనెడు ప్రసిద్ధి (=రాజశేఖర విఖ్యాతి) ప్రకట ము కాగా.

110 యాచకులైన పుణ్యాత్ములను మాత్రము తాను పాలించి (=అర్థిపుణ్యజనులగా తాను ఏలి) యాచక సామాన్యులైన వారలను (అనగా శత్రువులను) బాధించుటకు ఆజ్ఞాపించుట సంపదయా (=ప్రత్యర్థులౌ జనులగా బీడ ఒనర్ప పంపుట అది ఐశ్వర్యంబె) అనుచు ఆ పట్టణమందు కుబేరుడు మెచ్చుకొనునటులు (=ధనదుండు ఔ ను అనగా) ప్రతి యాచకుల గుంపు (అనగా శత్రువులు) కుబేరుని ఐశ్వర్యముతో వర్తించునట్లుగా (=పుణ్యజన రాట్ భూతి ప్రవర్తిల్ల) ప్రాచీన శక్తియొక్క ధనగౌరవముచేత కోమటివారలు (=సామర్థ్య వదాన్యత మహిమ చే ఆ వైశ్యులు) చెన్నొందిరి.

బరఁగిరి తత్పురి శూద్రులు । హరిపదజారూఢి దిశల సార్థక మొందన్. 111

క॥ పర బల పరాజయ దభా । స్వరగమనావాప్తి జిష్ణువాహాతిఁ గని త
త్పురమున గంధర్వమ్ములు । పరఁగెన్ సైంధవసమాఖ్య ప్రస్ఫుట మొందన్. 112

సీ॥ తతకపోల ప్రవద్దాన సంపాతంబు । సముదగ్ర నిర్ఝర సరణిగాఁగ
గురుతర ప్రోన్నత కుంభస్థలంబులు । నీలగండోపలపాళిగాఁగఁ
దనుసమలంకృత ధాతుపరాగంబు । సస్ఫురద్గైరిక ప్రతిభగాఁగ
గంభీర జృంభిత కర్ణరంధ్రంబులు । ధ్వాంత బంధుర గుహాపటలిగాఁగఁ

తే॥ ప్రబలు మేఘ విభ్రాజిత పాదగరిమ । ఘన సముత్తుంగ దంతసంగతి వెసంగ
భూధరవ్రాతములరీతిఁ బొల్పుమీఱెఁ । దత్పురీ వర మత్తమాతంగతతులు. 113

తే॥ దివ్యతపనీయ నవనీయ నవ్యరత్న । సంఘగతి ఘన కాండ నిషంగరూఢి
వెలయుచుండెను దత్పురి వీథులందు । స్యందనచయంబు హేమాద్రి సరణిఁదోఁప. 114

క॥ రణరంగోద్యత్సాహస । చణ నాదార్భటులు చటుల శంబరభిద్వే
షణహరుజిచ్ఛౌర్య విచ । క్షణతోద్భటులైన భటులు గలరన్నగరిన్. 115

---

**111.** ఎల్లపుడును దేవలోకములోని వారిచే కొనియాడబడిన మంచినీరు కలుగుటచేత ఒప్పి (=నిరంతరము బుధలోకస్తుత సరసత సొంపొంది) విస్తారమైన పద్మములచేతను బురదచేత (=భూరి సారస + కీర్తులం) ఆ పురము యొక్క శూద్రులు ఆకాశమునందు పుట్టిన ప్రసిద్ధిని (=హరిపద జారూఢిన్) ఎల్లదిక్కులయందు ఫలముతో కూడినట్లు ఉండిరి) (=దిశల సార్థక మొందన్ పరగిరి)

అర్థాంతరము: పండితులు పొగడుచుండు సరసగుణముచేతను ఒప్పి (=బుధలోకస్తుతి సరసతన్ సొంపొంది) విస్తార శ్రేష్ఠమైన యశస్సుతో గూడి (=భూరి సార + సత్కీర్తిన్) శూద్రులు విష్ణుని పాదమందు జన్మించిరనెడు ప్రసిద్ధిని (=హరి పదజ ఆరూఢిన్) పొందలుగా

**112.** ఆ పట్టణమునందు గుఱ్ఱములు విరోధుల సేనలను (=తత్పురమునన్ గంధర్వములు పర బలం) ఓడించుటయందు ప్రకాశమైన నడకను పొందుటచేతను (=పరాజయద భాస్వర గమన అవాప్తిన్) జయించు వారెక్కుచుండుటచేతను (=జిష్ణువాహాతన్) సైంధవములనెడు పేరు ప్రసిద్ధి యగునట్టుగా (=సైంధవ సమాఖ్యన్ ప్రస్ఫుట మొందన్) పరగెను.

**113.** వెడల్పయిన చెక్కిళ్లనుండి కారుచున్న (=తత కపోల ప్రవత్) మదముయొక్క ధారలు గొప్పవి యగు సెలయేరులయొక్క రీతిగ నుండగా (=దాన సంపాతంబు సముదగ్ర నిర్ఝర సరణి గాఁగ); పెద్ద ఎత్తుగల నెత్తిమీది కుంభములు (=గురుతర ప్రోన్నత కుంభస్థలంబులు) నల్లని పెద్దఱాళ్లయొక్క సమూహముగా నుండగా (=నీల గండోపల పాళి గాఁగ) శరీరమునందు అలంకారము చేయబడిన సిందూరముయొక్క గీతలు (=తను సమలంకృత-ధాతుపరాగంబు) ప్రకాశించుచున్న జేగురురాశియొక్క కాంతి కాగ (=సస్ఫురత్ గైరిక ప్రతిభగాఁగన్) గాంభీర్యముచేత చివరయైన చెవుల రంధ్రములు (=గంభీర జృంభిత కర్ణరంధ్రములు) చీకటితో కూడిన గుహలవలె నుండగా (=ధ్వాంత బంధుర గుహాపటలిగాఁగ) మిక్కిలి పొడవైన దంతములయొక్క కూడికతో (=ఘన సముత్తుంగ దంతసంగతి) వ్యాపించినట్టి మేఘములచే ప్రకాశించు నితంబప్రదేశములయొక్క సొగసు ఎసగ (=ప్రబలు మేఘ విభ్రాజిత పాదగరిమ) ఆ పట్టణములోని మదించిన శ్రేష్ఠమైన ఏనుగులయొక్క సమూహములు (=మత్తమాతంగతతులు) కొండల గుంపులవలె ప్రకాశించెను (=భూధరవ్రాతముల రీతిన్ పొల్పుమీఱెను.)

**114.** శ్రేష్ఠమైన బంగారు కొనియాడతగిన నూతన రత్నముల కూడికచేత (=దివ్య తపనీయ నవనీయ నవ్యరత్న సంఘగతిన్) గొప్ప బాణములుగల అంబుల పొదులయొక్క కాంతులచే (=ఘన కాండ నిషంగ రూఢి) రథముల సమూహము (=స్యందన చయంబు) మేరు పర్వతమువలె (=హేమాద్రి సరణి) ప్రకాశించెను.

**115.** యుద్ధరంగమునందు బయలుదేరిన తెంపుయొక్క నేర్పుతో కూడిన (=రణరంగ ఉద్యత్ సాహస చణ) సింహనాదముల గడిబిడలతోను (=నాదార్భటులు) భీకరులైన (శంబరుని ఖండించిన) మన్మథునియొక్క విరోధియైన శివునిగూడ (=చటుల శంబర భిత్ ద్వేషణ హరు) జయించు శూరత్వముయొక్క పాండిత్యమునుతో కూడిన (=జిత్ శౌర్య విచక్షణత) అధికులైన యుద్ధవీరులు (=ఉద్భటులైన భటులు) ఆ నగరిలో గలరు.

వ॥ మఱియు సముదగ్ర క్షుద్బాధా చలిత పరభృతకీరసంఘాత సమాగమన హేతు
భూత సంతత పల్లవిత ఫలిత మహీరుహ విభ్రమభ్రమద వనజరాగ గారుత్మతోపల
ఖచిత సౌధవారమ్ములును, ఘనతరస్తనిత చంచలాయుత ధారాధరభ్రాంతి కృన్మృ
దంగస్వానానుగుణ నటద్గజగామినీబృంద సంగత వసుమతీ ధరభిదుపల బాహుళ్య
విభ్రాజితాగారంబులును, జాతరూప నవరత్న దీవ్యమానగోపురాకారంబులును గ
లిగి యొప్పు నప్పురంబున కధీశ్వరుండు. 116

క॥ శ్రీరుచిర మందిరుండు భుజ। సారజితానేక సమద శాత్రవుండు సదా
ధారుండన వెలయు నిల లిం। గారెడ్డీంద్రుండు వినుత కవిచంద్రుండై. 117

సీ॥ వేపాలగోత్ర పవిత్రుండే రాచదు। ర్గపు సీమలోఁ గీర్తి గాంచు ఘనుఁడు
గోపువంశ సుధాబ్ధిశీతలయు మిత్రుండే। యొనగు కృష్ణప్పనాయుని సఖుండు
వరముఖ్య వినుత చెన్నారెడ్డి పుత్రుండే। బంధుసారసలోక బాంధవుండు
సర్వేశ్వరాంఘ్రి సంస్మరణైక పాత్రుండే। సనయా కొండారెడ్డి జనకుఁ డవని
గీ॥ తలఁప నా ధీరుఁ డలరు సత్యవ్రతుండు। కతుకముగఁ దత్పురంబు నేలు పతనుగాఁగ
సమద శత్రుద్విపోగ్ర కేసరి ప్రపోషి। తాశ్రితార్థివ్రజుండు లింగాహ్వయుండు. 118

వ॥ అతండొక దినంబున ఘనంబగు ముదంబునఁ గాంచనమణి నిర్మితోదంచత్సభాభ
వన మధ్యంబున నవనీయ విచిత్ర చిత్రపటంబున సాదర సహోదర పుత్ర మిత్ర
సహితుండై కొలువుండి తన మనంబున. 119

116. అధికమైన ఆకలి బాధచేత తిరుగుచున్న (=సముదగ్ర క్షుద్బాధా చలిత) కోకిలయొక్కయు చిలుక
యొక్కయు గుంపులను (=పరభృత కీర సంఘాత) చేరుటకు కారణమైన ఎల్లప్పుడు చిగుర్చినట్టియు (=సమా
గమన హేతుభూత సంతత పల్లవిత) పండినట్టియు (=ఫలిత) చెట్లయొక్క విలాసము అనెడి భ్రమను కలుగచేయు
(=మహీరుహ విభ్రమ భ్రమద) పద్మరాగ మాణిక్యములచేతను గరుడపచ్చలచేతను తాపడము చేయబడిన
(=వనజరాగ గారుత్మతోపల ఖచిత) మేడలయొక్క గుంపులును, మిక్కిలి గొప్ప ఉరుములతోడను మెఱుపుల
తోడను కూడిన మేఘములను భ్రాంతిని కలుగచేయునట్టి (=సౌధవారమ్ములును ఘనతర స్తనిత చంచలాయుత ధా
రాధర భ్రాంతి కృత్) మద్దెల చప్పుళ్లకు అనుగుణముగా నాట్యము చేయుచున్న (=మృదంగస్వాన అనుగుణ న
టత్) స్త్రీలగుంపులతో (=గజగామినీ బృంద) కూడిన వజ్రములయొక్క అతిశయముచే (=సంగత వసుమతీ
ధరభిదుపల బాహుళ్య) ప్రకాశించునట్టి భవనములును (=విభ్రాజిత అగారంబులును) బంగారుచేతను నవరత్న
ములచేతను మెఱయునట్టి గోపురములును (=జాతరూప నవరత్న దీప్యమాన గోపురాకారంబులును) కలిగి ఒప్పు
పురములోని ప్రభువు (=అధీశ్వరుడు)

117. సంపదచే ప్రకాశించుచున్న ఇల్లు కలిగినయట్టియు (=శ్రీరుచిర మందిరుడు) భుజబలముచే గెలువ
బడిన చాలమంది పొగరుతో కూడిన శత్రువులు కలిగినట్టియు (=భుజసార జిత అనేక సమద శాత్రవుడు) సత్పు
రుషుల కాధారమైనవాడు (=సదాధారుడు) అనునట్లు భూమియందు శ్రేష్ఠమైన లింగారెడ్డి పొగడబడిన కవి
శ్రేష్ఠులు గలవాడై (=వినుత కవిచంద్రుండై) ఒప్పును

118. సుధాబ్ధిశీతలయు మిత్రుడు=గోపువంశమనెడు పాలసముద్రములోని కలువల మిత్రుడు అనగా చం
ద్రుడు। వరముఖ్య వినుత=పండిత శ్రేష్ఠులచేత కొనియాడబడుచున్న। బంధుసారసలోక బాంధవుండు=చుట్టములు
అనెడు పద్మములయొక్క సమూహమునకు సూర్యునివంటివాడు। సర్వేశ్వర అంఘ్రి సంస్మరణ ఏక పాత్రుడు=దే
వుని పాదములయొక్క భక్తి ముఖ్యముగా కలిగిన యోగ్యతకలవాడు। పతనుగాగ=వంశక్రమముగా। సమద
శత్రు ద్విప ఉగ్ర కేసరి=మదించిన వైరులనెడు ఏనుగులకు భయంకరమైన సింహమువంటివాడును। ఆశ్రిత అర్థి
వ్రజ ప్రపోషిత్ గుండును=ఆశ్రయించిన యాచక సమూహమును పోషించుచున్నవాడు లింగారెడ్డి యుండెను.

119. కాంచన మణి నిర్మిత ఉదంచత్ సభాభవన మధ్యంబున=బంగారుచేతను మణులచేతను నిర్మింప
బడి ఎక్కువగా ప్రకాశించుచున్న ఇంటి మధ్యమున। నవనీయ విచిత్ర చిత్ర పటంబున=కొనియాడతగిన ఆశ్చ

ఉ॥ ఇంపు దలిర్ప రాజుల ననేకులఁ జూచితి శౌర్యలీలమైఁ
బెంపు వహించితిన్ సిరులఁ బెద్దయు నొందితిఁ బుత్రవర్గమున్
సొంపునఁ గాంచితిన్ మిగులఁ జోద్యములం బరికించితిన్ మనః
కంపము దీఱ దింక నొక కార్యము గల్గునొకో తలంపఁగన్, 120

క॥ నిర్వాణ భర్తయై తగు । సర్వేశ్వరు లీలఁ దెలుపఁ జాలిన ఘనుఁ డీ
యుర్వీస్థలిఁ గల్గినఁ ద । ద్గుర్వాదేశమున వెలయుఁ గోరిక లెల్లన్. 121

క॥ సత్యపథంబున నిత్యా । నిత్యము లివి యనుచుఁ దెల్పి నిత్య విభూతిం
గత్యంతరరహితమ్మ్ నిల । నత్యద్భుత మహిమ గూర్చు నతఁ డెవ్వఁడొకో. 122

వ॥ అని విచారించు సమయంబున, 123

శా॥ జ్ఞానానందమయుండు సత్యవర భాషాశాలి సర్వేశబో
ధానూనప్రతిభాసమంచితుఁ డభేదప్రోల్లసన్మానసుం
డానార్యాకృతి నిర్జితారినికరుం డాచార్యపాదాంబుజ
ధ్యానాభిద్రుణయుండు బెత్త మొక చేతం బట్టి యుచ్చోటికిన్ 124

శా॥ చేరన్ రాఁ బరికించి వేచి యపు డక్షీణానుమోదాప్తి లిం
గారెడ్డీంద్రుఁడు సాప్తవర్గుఁడయి మోక్షభ్రాంతి చిత్తంబునం
దూరం దా నెదురేగి మ్రొక్కెడి దయాళ్లో రమ్ము రమ్మంచు నా
ధీరుం దోడుక వచ్చి సంస్తవము భక్తిం జల్పుచు న్వేడుకన్ 125

వ॥ సంజీవ నామధేయంబునం బ్రకాశించు సద్గురు పుంగవుని 126

తే॥ అంబురుహరాగమణి ఖచితంబు నగుచు । డంబు గల్గిన హేమపీఠంబునందు 127
వెలయఁ గూర్చుండఁబెట్టి సవినయుఁ డగుచు । బలికె నిట్లని మదిని సంబరము పెరుఁగ.

తే॥ ధీరవర్య భవచ్చరణార వింద । యుగరజస్స్పర్శనంబున నొగి మదీయ
మందిరంబు పవిత్రతా మహిమ గనియె । సరులులేక చెలంగెడు సిరులు గలిగ. 128

ర్యమైన శివాపీమీద । సాదర=ఆదరముతో ।

120. మనః కంపము=మనస్సుయొక్క సందేహము.

121. నిర్వాణ భర్తయగు=మోక్షముయొక్క కర్త । ఘనుడు ఈ ఉర్వీస్థలి కలిగిన తత్ గురువు ఆదేశమున=ఇట్టి గొప్పవాడు ఈ భూమిలో కలుగు నెడల ఆ గురువుయొక్క బోధచేత ।

122. సత్యమార్గములో నిత్యమును అనిత్యమును తెల్పి నిత్య ఆనందమును (=విభూతి) భూమిలో వేరు జన్మములేమిని (=ఇల గత్యంతర రహితము) మిక్కిలి అద్భుత మహిమతో నేర్పించువాడు ఎవడు.

124. జ్ఞాన ఆనందమయుండు=జ్ఞానసంతోషము పొందినవాడు । సత్యవర భాషాశాలి=సత్యమైన శ్రేష్ఠమాటలను పలుకువాడు । సర్వేశ బోధ అనూన ప్రతిభా సమ్ అంచితుడు=దేవుని బోధయందు సాటిలేని కీర్తితో కూడినవాడు । అభేద ప్రోత్ లసత్ మానసుడు=చోరరానట్టి వస్త్రిముతో కప్పబడిన మనస్సు గలవాడు అనగా ఇతరులకు కనబడని మనస్సు గలవాడు । ఆర్య ఆకృతి నిర్జిత అరినికరుండు=మంచి ఆకారముచే జయించిన శత్రువుల సమూహము గలవాడు । ఆచార్య పాద అంబుజ ధ్యాన అభిద్ రుణయుడు=తేనునాథుని పాదపద్మముల ధ్యానములో ఒప్పుచున్న మనస్సు గలవాడు॥

125. అక్షీణ అనుమోద ఆప్తి=తక్కువకాని సంతోషము పొంది । స ఆప్త వర్గుడు=బంధువులతో కూడినవాడై । దయాళో=కనికరము గలవాడా । సంస్తవము=స్తోత్రము ।

127. అంబురుహరాగమణి ఖచితము=పద్మరాగమణులతో నిర్మింపబడినదైన । డంబు=ప్రకాశము । హేమ=బంగారము ।

128. ధీరవర్య=శ్రేష్ఠమైన జ్ఞానుడా । భవత్ చరణార వింద యుగ రజస్స్పర్శనంబున=మీ రెండు శుభ

చ॥ ఘన విపినంబునం బథము గానని వానికిఁ ద్రోవఁ జూపు స
జ్జను గతి దుర్వ్యథాప్రథరుజం గను వానికి ముఖ్యుఁడైన వై
ద్యుని పగిదిన్ క్షుధాతురున కుబ్బుచు నన్నము వెట్టు మర్త్యు రీ
తిని దగ నబ్రమై తనరె దేవరవా రిపు డేగుదెంచుటల్. 129

చ॥ అన విని యమ్మహాత్ముఁడు దయారస ముప్పతిలంగఁ బొంగి యి
ట్లని పలుకున్ భవాదృశ గృహస్థులు గల్గఁగఁగాదె మాదృశా
ర్యనివహముల్ ముదంబలర రాకలుఁ బోకలుఁ గల్గి యుండుటల్
సనయవిచార నీ సుగుణ సంపద నేఁ దెలియంగ వచ్చితిన్. 130

వ॥ అను పలుకు లాకర్ణించి లేచి పునః పునః ప్రణామమ్ము లాచరించి నిటలతట ఘటిత కరారవిందయుగళుండై డెందంబున, నమందానంద కందళమ్ము లభివృద్ధి నొంద నిట్లను: మహాత్మా! మదీయ మందిరస్థలంబునకు మీరలు విజయంబు చేయుట పిచ్చుకకుంటుపైఁ బ్రవహించు బృందారకనది చందంబుగాదె; ధనదారాపుత్ర మత్స్య కచ్ఛపమకర సంగత సంసారపారావార నిమగ్నుండ నగు నన్ను దరిఁ జేర్పం దెప్ప విధంబున నేతెంచిన మీరు శిష్యుండనై యొక్క రహస్యంబు నడిగెదఁ బెంచిన చిల్కపల్కులు ముద్దుసేయు మహాయోగి వడువున సాదరస్వాంతుండవై వినుము. 131

క॥ గురువర సర్వేశ్వరుఁ డే। సరణిం దెలియంగఁబడును సత్యమనఁగ ను
ర్వర నెటువంటిది సద్గతి। కరుగు విధం బెఱుఁగు గల్గు నానతి యీవే. 132

క॥ అన సంజీవగురుండా। ఘన గుణమణి పేటిఁ జూచి కారుణ్యరసం
బున వెలయు మానసంబున। ననఘా విను మనుచు నిట్టులని యానతిడెన్. 133

సీ॥ ఆర్యాఢి నీవు నన్నడిగిన వృత్తాంత। మంతయుఁ దేటగా వింతు నిపుడు

---

మైన పాదముల ధూళి తగులుటచేత నా ఇల్లు పరిశుద్ధమైన మహిమ పొందెను। సరులంలేక=సాటిలేని।

129. అడవిలో మార్గము (=విపినంబున పథము) తెలియని వానికి త్రోవ చూపెడు మంచి జనునివలెను, ...ండు బాధతో కూడుకొనిన రోగము పొందినవానికి (=దుర్వ్యథ ప్రథరుజంగనువానికి) ముఖ్యుడైన వైద్యు వలెను, ఆకలిగొన్నవానికి సంతోషముతో (=క్షుధాతురునకు నుబ్బుచు) అన్నము పెట్టెడు మనుష్యునివలెను, ...ా రాకడ ఇప్పుడు అద్భుతముగా (=అబ్రమై) తనరెను.

130. నీవంటి సంసారులు ఉండుటచేతగదా (=భవాదృశగృహస్థులు గల్గగాగాదె) నావంటి సాధువు సమూహము (=మాదృశార్య నివహము) వచ్చుటకు పోవుటకు కలుగును, మంచినయము ఆలోచనగలవాడా =సనయవిచార.)

131. ప్రణామము=నమస్కారము। నిటలతట ఘటితకర అరవింద యుగళుండై=నొసటితో కూర్చిన ...తులు అనెడు రెండు పద్మముల గలవాడై। డెందంబున అమంద ఆనంద కందళములు=మనస్సులో పెద్ద సం ...షము అనెడు మొలకలు పెంపు పొందగా। నిం గారెడ్డి చెప్పినదేమనగా: కాళ్లులేనివాని దగ్గరకు (=పిచ్చుక ...ంటుపై) ప్రవహించెడు గంగానది (=బృందారకనది) చందమున మీ రాకడ ఉన్నది. తాత్పర్యమేమనగా: ...ంగానదిని చూడవలెనని అందరికి కోరికయే, అయినను కాళ్లులేనివాడు అక్కడికి పోజాలడు; నేను మిమ్ములను ...ాడ పోవలసియున్నది, గాని మీరలు నా మందిరమునకు విజయము చేసితిరి గనుక గంగానది కుంటివాని దగ్గ ...ు పోయినట్లుగా నున్నది। ధన దార పుత్ర మత్స్య కచ్ఛప మకర సంగత=ధనము భార్య బిడ్డలు అనెడు చేప ... తాబేళ్లు మొసళ్లు వీనితో కూడిన। సంసార పారావార నిమగ్నుడను=సంసారమనెడు సముద్రములో మునిగిన నన్ను। దరిచేర్చ తెప్పవిధమున=దరికి చేర్చుటకు నావ విధముగా వచ్చిన మీరు। పెంచిన చిలుక పల్కులు ముద్దు సేయు మహా యోగివడువున=పెంచిన చిలుకయొక్క పలుకులను ప్రీతితో వినెడు యోగివలె। సాదర=ఆ ...దముగల హృదయము గలవాడవై। యోగులు చిలుకలను పెంచుకొనుట వాడుకయే।

133. ఘన గుణమణి పేటి=మంచి గుణములు అనెడు మణుల పెట్టెయయినవాని.

వినుము సర్వేశ్వర విభవంబు సత్యశ। బ్దార్థంబు సద్గతి కరుగు విధము
మున్ను మద్గురుస్వామి మొదలైన పెద్దలు। శాసించి తెనుఁగు ముచ్చటలుగాఁగ
వ్రాసిన పుస్తక వ్రాతంబులోపల। జ్ఞానచింతామణి నా నుతింపఁ
తే॥ దగుచు మేలైన దొక ప్రబంధంబు గలదు। దాన నద్వైతశాస్త్రవిధానవిధులు 134
వరస మొనరింతు రెవుడు శ్రావ్యంబటంచుఁ। బ్రేమ మీరంగఁ బ్రజ్ఞాధురీణులగుచు.
సీ॥ సకల చరాచరాత్మకమైన విశ్వప్ర। పంచంబు గల్పింప మించుకగుణ
రక్షింప నడపఁ దా రాజన వెలయు హ। స్తాంఘ్రి నాసాక్షి కర్ణాద్యవయవ
రహితంబు నిర్గుణంబహరహఃప్రోజ్జ్వలం। బాకాశవత్స్థిరం బమలమాది
మధ్యాంతశూన్యంబు మకుటాంగదాది భూ। షణ వియుక్తంబు నిస్సంశయంబు
ఆ॥ నప్రమేయ మద్వయం బవాఙ్మానస। గోచరంబటంచు గురువరేణ్యు
లెన్నఁదగిన తేజమెవ్వడు సర్వేశ్వరుం। డనఁగ నొప్పుచుండు నధిక మగుచు 135
సీ॥ సకల లోక ప్రశస్తంబైన సత్యశ। బ్దార్థంబు దెల్పెద నవఘ నీకు
విను మరుణోదయంబున లేచి మానవుం। డెవనితో మాటాడ నిచ్ఛయించు
వానితో నొకటి తప్పని పల్కుఁ బల్కిన। దాన సంపదలు నిత్యముగ నిలుచు
నార్యబృందమ్ము సదానందమును గాంచు। విశ్వనాయకుఁడు సర్వేశ్వరుండు
తే॥ సొంపు దీపింప నపుడె రక్షింపఁ దలఁచు। నవని సత్యంబుకంటె మేలైన తపము
గలుగ దే ధర్మములయందు నెలమి దీని। మదిని బాదుగ నిల్పుము వదలనీక. 136
తే॥ ఘనులు మహానానృతాత్పాతకం పరంబ। టంచుఁ బల్కుట నిజ మసత్యానురక్తుఁ
డైన పురుషుండు పాపాత్ముఁ డగుచు నిహప। రమ్ములను జేటుగను వివేకమ్ము లేక 137
వ॥ దానంజేసి సత్యవ్రతనిష్ఠాగరిష్ఠుండగు పురుషశ్రేష్ఠుండు నిహపరమ్ములయందు

134 సత్య శబ్ద అర్థము=సత్యమనెడు మాటయొక్క అర్థము। అద్వైత శాస్త్ర విధాన విధులు=దేవుడు ఒక్కడై యున్నాడను శాస్త్రము అనగా క్రీస్తువు వేదముయొక్క విధానములను=ఆజ్ఞలను। శ్రావ్యము=చెవులకు ఇంపైనది। ప్రజ్ఞాధురీణులగు=తెలివియొక్క బరువు మోయువారలు।

135. చర అచర ఆత్మకమైన=కదలువానిని కదలనివానిని కలిగిన। రాజా అన వెలయు=గాజావలె వెలసెడు। హస్త అంఘ్రి నాస అక్షి కర్ణ ఆది అవయవ రహితము=చేయి పాదము ముక్కు కన్ను చెవి మొదలైన అంగములు లేని। నిర్గుణంబు=గుణములు లేని। అహరహః ప్రోజ్జ్వలంబు=రాత్రింబగలు మిక్కిలి ప్రకాశించునది। ఆకాశ వత్ స్థిరంబు=ఆకాశమువలె స్థిరమైనది। అమలము=పరిశుద్ధమైనది। ఆది మధ్య అంత శూన్యంబు=ఆరంభము మధ్యము ముగింపులేనిది। మకుట అంగద ఆది భూషణ వియుక్తంబు=కిరీటము కేయూరము మొదలైన అలంకారములు లేనిది (=దేవుడు రాజై యున్నాడని ముందు చెప్పినను ఇట్టి అలంకారములు వానికి లేవు) నిస్సంశయంబు=సందేహము లేనిది। అప్రమేయము=మనుష్యుల బుద్ధికి అందనిది। అద్వయము=ఇంకొకడు లేనిది। అవాక్ మానస గోచరము=వాక్కుచేతను మనస్సుచేతను వివరింపబడనిది। అని శ్రేష్ఠమైన గురువులు చెప్పతగిన తేజము.

136. ప్రొద్దున లేచినప్పటినుండి (=అరుణోదయమున) ఎవనితోనైన మాటలాడ నిచ్ఛబడునప్పుడు సత్యము పలుకునేడల సంపదలు కలుగును జ్ఞానుల సమూహము (=ఆర్యబృందము) సంతోషము పొందును. దేవుడు ఇట్టివాని కాపాడ తలచును.

137. మహానానృతాత్పాతకం పరము=ఇది సంస్కృత సామెత, అర్థమేమనగా: లోకములో అబద్ధముచే అనేక పాపములు కలుగును.

138. సత్యవ్రత నిష్ఠగరిష్ఠుడు=సత్యమనెడు వ్రతములో ఇష్టము గలవాడు। అర్గళము లై=అపారమై

కైవల్యలాభమ్ము లనర్గళమ్ములై యుండు నట్లగుట నీవు సత్యవచశ్శీలుండవుఁ బరమ దయాళుండవుఁ గావున నీయర్థంబు నీ వడుగుటం జేసి నేఁడుపన్యసింపఁ గలిగె నింక జ్ఞానచింతామణి ప్రబంధ ప్రకారంబు వినుము. 138

॥ ఇట్లు రాయవరగేడ్డమాళి యనుమతింగైకొని యేతత్కృతినాయకు నభివర్ణించెద. 139

॥ శ్రీమదఖండ తేజో మందిరాకారు । భక్తజనౌఘ హృద్భయవిదారు
సచరాచర స్థిత సర్వలోకాధారు । సన్మనస్కార్చిత సద్విచారు
వేదవేదాంతార్థ విదిత సదాచారు । వరగుణాశ్రయ కార్య వలదుదారు
నాశ్రిత భృత్యనివహ దుఃఖసంహారు । దిక్పరిపూర్ణ సద్భృగ్గభీరు

॥ నమిత భుజసార గోపురన్నధీర । పోషణ సహిత నైపుణ్య భూశరణ్య
శాశ్వతైక సమాఖ్య సర్వేశ్వరాఖ్యుఁ । బెంపు దీపింప మిగుల వర్ణింపవశమె. 140

షష్ఠ్యంతములు.

॥ ఏతాదృశ వరమహిమ । ఖ్యాతునకు దయారస ప్రకాశితునకు ని
ర్ధూతాఖిలకల్మషునకుఁ । బూతచరిత్రున కతుల శుభోదంచితునకున్. 141

॥ సౌరద్రుమప్రతిమానో । దారున కసమాన శౌర్య ధారునకుఁ గళా
ధారునకు భక్తజనమం । దారున కుగ్రారి నీరదసమీరునకున్. 142

॥ నిత్యునకు నిగమగణసం । స్తుత్యున కఖిలాపవర్గ శుభవైభవసాం
గత్యునకుఁ బరాత్పరునకు । నత్యంత కృపానియుక్తి హారాత్మునకున్. 143

139. కృతినాయకున్=గ్రంథము నర్పించినవానిని అనగా సర్వేశ్వరుని.

140. శ్రీమత్ అఖండ తేజః మందిర ఆకారున్=సంపద్యుక్తమైన సమగ్రమైన ప్రకాశమునకు మందిరమంటివానిని । భక్తజన ఓఘ హృత్ భయ విదారున్=తనకు భక్తులగు జనుల సమూహముయొక్క మనస్సులోనుండు భయము పోగొట్టువానిని । సచర అచర స్థిత సర్వలోక ఆధారుని=చరములతో అచరములతో కూడిన లోకము ఆదరించువానిని । సన్మనస్క అర్చిత సద్విచారు=సన్మనస్కులచేత పూజింపబడిన మంచి విచారము గలవాని । వేద వేదాంత అర్థవిదిత సదాచారున్=వేదముయొక్క అర్థములచేత ఎఱుకపడు మంచి యాచారము కలవాని । వరజనపోషక వలత్ ఉదారున్=మంచి జనులను కాపాడుటయందు కూడుకొనిన ఔదార్యము గలవానిని । శ్రితభృత్యనివహ దుఃఖసంహారున్=ఆశ్రయించిన భక్తుల సమూహముయొక్క దుఃఖము తీసివేయువానిని । దిక్పరిపూర్ణ సదృక్ గభీరున్=దిక్కుల నిండగ సరియైన గంభీరత గలవానిని । అమిత భుజసార=విస్తారమైన బాహుబలముగల గోపురగన్న అను । ధీరపోషణ సహిత నైపుణ్య=పండితుని రక్షించుటయందు ధరించిన నేర్పు గలవానిని । భూశరణ్య=లోకమునకు ఆధారుడైనవానిని । శాశ్వత ఏక సమాఖ్య=ఎన్నటికిని చెడని కీర్తిగలవానిని । సర్వేశ్వర ఆఖ్య=సర్వేశ్వరుడు అను పేరుగలవానిని । పెంపుదీపింప వర్ణింప వశమే=అతిశయము ప్రకటమగునట్లు స్తుతి చేయుటకు వీలు కలుగునా.

141. ఏతాదృశవర మహిమ ఖ్యాతునకు=ఇటువంటి శ్రేష్ఠమైన ప్రభావముచేత ప్రసిద్ధి నొందినవానికి । దయారస ప్రకాశితునకు=కరుణారసమును చూపువానికి । నిర్ధూత అఖిల కల్మషునకు=పోగొట్టబడిన సకల పాపములు గలవానికి । పూతచరిత్రునకు=పవిత్రమైన నడవడికల గలవానికి । అతుల శుభ ఉదంచితునకు=సాటిలేని శుభములతో ప్రకాశించువానికి.

142. సౌరద్రు ప్రతిమాన ఉదారునకు=కల్పవృక్షముతో సాటియగు దానము చేయువానికి । అసమాన శౌర్య ధారునకు=సమానములేని బలము ధరించినవానికి । కళాధారునకు=అన్ని వస్తువులకు ఆధారమైనవానికి । భక్తజన మందారునకు=భక్తులయినవారికి కల్పవృక్షమువంటివానికి । ఉగ్ర అరి నీరద సమీరునకు=కఠినులయిన విరోధుల నెడు మేఘములకు గాలివంటివానికి.

143 నిత్యునకు=నాశములేనివానికి । నిగమగణ సంస్తుత్యునకు=వేదములలో పొగడబడినవానికి । అఖిల అపవర్గ శుభవైభవ సాంగత్యునకు=సమస్తమైన మోక్షము మహిమ వీనితో కూడియున్నవానికి । అత్యంత కృపాయుక్తి హార్ద ఆత్మునకు=విస్తారమైన దయతో కూడిన సంతోషముగల స్వభావము గలవానికి అద్వయునకు=

క॥ అద్వయునకు నభవునకు । విద్వదభేద్యునకు వేదవేద్యున కురుభా
స్వద్విక్రమునకు నుతపా । త్రద్వయ పాదకమలునకుఁ దను రహితునకున్. 144
క॥ ఘనగోపువంశకలశా । బ్ధినీరజాహిత మరన్న దీనావన పా
వనకార్య నివేశునకున్ । సనయఘృణా వేశునకును సర్వేశునకున్. 145
వ॥ సమర్పితంబుగా నేనొనర్పఁబూనిన జ్ఞానచింతామణి ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 146

# ప్రథమాశ్వాసము.

క॥ ప్రతిరహిత గోపువంశాం । చిత మట్టన్నాఖ్య భక్త చిత్ప్రద కలుష
క్షితిధర సమూహ కులిశా । శ్రిత సన్ముని హృన్నివేశ శ్రీసర్వేశా. 1
ఆ॥ వినుము మర్వపల్లె వనఘుఁడై విజ్ఞాన । లీల వెలయుచుండు లింగ విభున
కానతిచ్చెఁ బ్రేమ నవ్వాలి కథను సం । జీవనాథ గురుఁడు భావమలర. 2
సీ॥ యోగ్యులై జ్ఞానవైరాగ్య ప్రసిద్ధులై । విలసిల్లు పెద్దలు దెలిపినట్టి
బుద్ధులు వ్రాసిన పుస్తకమ్ములుఁగూర్చి । యన్నిటి యర్థమేకత్వముగను
బఠియింపఁ దగునదే వగిది యుంచనఁ గ్రియా । నిపుణులు విశ్వాసనియతి కర్హ
మగు ధర్మవర్తన దగియుండుటయును స । ర్వేశు మాహాత్మ్యంబు నెలమి నాత్మ 3
తే॥ విమలముగ నమ్మి తచ్ఛాసనమున నొదవు । పనులఁ గొదలేక నడుచుచుఁ బాపమునకు
మిగుల భయపడుటయు ముఖ్యముగఁ దలంప । వలయు నెంతయు మోక్షేచ్ఛ గలిగనేని
మ॥ అవనీభాగమునందు దుష్క్రియ సుఖంబై తోఁచుటన్ దుష్కృత
వ్యవహారంబును బాసియుండు టరుదా నాత్మం గ్రియాశాలు లీ
నవరభ్రాంతిని డించి ధర్మపథవిన్యాసంబు సేయం దగున్
భవమన్ క్రూరపిశాచము న్విడువ ముగ్భాగ్యంబు సంధిల్లెడున్. 4

---

ఏకరూపమైనవానికి । అభవునకు=పుట్టుక లేనివానికి ।

**144.** విద్వత్ అభేద్యునకు=పండితులచే సైతము పూర్తిగా తెలియబడనివానికి । వేదవేద్యునకు=వేదమార్గమున తెలిసికొన తగినవానికి । ఉరు భాస్వత్ విక్రమునకు=గొప్ప ప్రకాశించెడు పరాక్రమము గలవానికి । నుతిపాత్ర ద్వయ పాదకమలునకు=స్తోత్రము చేయతగిన రెండు పాదములనెడు పద్మములు గలవానికి । తను రహితునకు=శరీరము లేనివానికి ।

**145.** ఘన గోపువంశ కలశ అబ్ధి నీరజాహిత=గొప్ప గోపువారల కులమనెడు పాలసముద్రమునకు చంద్రునివంటి మరన్న యను! దీన అవన పావన కార్య నివేశునకు=దీనుని కాపాడుట యనెడు పనిలో ప్రవేశించినవానికి । సనయ ఘృణ ఆవేశునకు=వినయముతో కూడిన వారియందు దయ పొందినవానికి.

**1.** సాటిలేని (=ప్రతిరహిత) గోపువారివంశములో ప్రసిద్ధుడైన (=అంచిత) మట్టెన అను పేరుగల భక్తునకు జ్ఞానము నిచ్చువాడా (=భక్త చిత్ప్రద) పాపము అనెడు పర్వతముల (=క్షితిధర) సమూహమునకు వజ్రాయుధమువంటివాడా (=కులిశా) ఆశ్రయించిన గొప్ప తపసులయొక్క మనస్సులలో నుండువాడా (=ఆశ్రిత సత్ ముని హృత్ నివేశ) **2.** అవ్వాలి కథ=ఈ క్రింద వచ్చు కథ

**3.** నేర్పరులు (=క్రియా నిపుణులు) విశ్వాసనియమమునకు దగిన ధర్మవర్తనచేత ఒప్పుటయు దేవుని కల్పనలందు (=తత్ శాసనమున) ప్రకాశించు పనులను కొరతలేక చేయుచు పాపమునకు భయపడుటయు తలంపవలెను.

**4.** భూమిలో పాపము సుఖముగా తోచుటచేత చెడుక్రియల వాడుక విడిచిపెట్టుట అరుదుగా నున్నది. అయినను నేర్పరి ఆ పాపభ్రాంతి విడిచి ధర్మమార్గము అనుసరింప (=విన్యాసము చేయుట) తగును. పాపము అను (=భవమను) పిశాచము విడిచిపోవుటచేత ముక్తిభాగ్యము పొందును.

తే॥ కలుషము నడంప ధర్మమార్గమున నడువ । నొక యుపాయంబు గలదు పాయక మనంబు
నందు సూనృతమున నుదారాతిశయ స । మంచితుండై దయాపరుండైనవాని, 5

క॥ శ్రీసర్వేశ్వరు సంస్తుతి । భాసురముగఁ జేయవలయు భక్తిఁ ఘన వి
శ్వాసమున దీనికంటె న । హాసుగుణోదధి యుపాయ ముర్విని గలదే. 6

చ॥ కృపయును సజ్జనావనము కేవల సత్యవచఃక్రమంబు ని
ష్కపటమునుం గ్రియాస్థుఁ డనుచందము మర్త్యున కిచ్చు హెచ్చుగా
నపకృతి దుర్మనీషయు దురాలపనంబుఁ బిశాచ తంత్రమునుం
గృపణత కిల్బిషంబు నివి పృథ్విని నక్రియ దెచ్చు నెంతయున్. 7

క॥ పాపవిమోచనమునకుఁ గృ । పాపర విలసిల్లు నొక యుపాయము పశ్చా
త్తాపము నొందుట సకల । వ్యాపకు సర్వేశు సంస్తవము సేయుటయున్. 8

క॥ దీనన సర్వేశ్వరుఁడు కృ । పానీరధి యగుచుఁ బ్రోచు భవము నడంచున్
దానేర మెంచకుండును । బూనుట యిది మేలు సుమ్ము పూతచరిత్రా. 9

సీ॥ సముచితంబైనట్టి సర్వేశ్వరాఖండ । కారుణ్యమునకును గలుషమునకు
బహుదూరమటుగానఁ బాపవిముక్తికి । నతఁడు బ్రార్థించిన హర్ష మెసఁగ
మన్నించు నతఁడు నిర్మాత్సర్యమున నిది । ధరణినాయకునకుఁ బ్రధానమైన
దయ యెల్లనిన పరంధాముని ననిశంబు । పుణ్యాత్ములను బ్రేమఁ బ్రోచుకంటె

తే॥ దురిత మొనరించువాని నిర్దోషిగాఁగఁ । దలఁచి రక్షించుటయు దొడ్డతనము సుమ్మ
పరుని యనుకంపకును మోక్షభాగ్యమునకుఁ । జేరువయెకాని కల్గదు దూరమధిప. 10

తే॥ పరుని సువరప్రసాదంబు గురుతరైక । మోక్షమున కెడ యగుచుండు నీ క్షమాస్థ
లంబునఁ దలంపఁగను దుష్కృతంబు నరక । వేదన ఘటింప సిద్ధమై పెరుఁగుచుండు. 11

క॥ ఇల నటుగావున సద్బు । ద్ధులు పెంపగు సచ్ఛిష్ట తోమానులు నే
ర్పలరంగ నిశ్చయించిన । పలుకులు దృఢముగఁ దలంపవలయు నెటన్నన్. 12

వ॥ జగత్కర్త యగు సర్వేశ్వరుండు స్వప్రజ్ఞావైభవంబున భువన నిర్మాణంబు నొనర్చు

5. సూనృతమునన్ ఉదార అతిశయ సమంచితుండై=సత్యమునందు గొప్ప అతిశయములతో కూడుకొనినవాడై.

6. అహో సుగుణ ఉదధి=సుగుణముల సముద్రుడా అనగా లింగారెడ్డి

7. కృపయు మనుష్యులను సహాయము చేయుటయు (=సత్ జనన అవనము) పరిశుద్ధ సత్యవాక్యము యొక్క నియమమును కపటము లేనిదియు మర్త్యునకు పూర్ణముగా నేర్పి అను కీర్తి (=చందము) ఇచ్చును; అపకారమును చెడ్డ మనస్సును చెడ్డ సంభాషణమును పిశాచ క్రియలు లోభము (=కృపణత) పాపమును ఇవి భూమిలో (=పృథ్విం) నెంతయో అపకీర్తి (=అక్రియ) తెచ్చును.

8. కృపాపర=దయగలవాడా అనగా లింగారెడ్డి.

9. కృపానీరధి=కృపకు సముద్రమువంటివాడైన దేవుడు । భవము=పాపము । ఇది అనుసరించుట మంచిది.

10. ఒప్పిన దేవునియొక్క గొప్ప (=అఖండ) దయకును పాపమునకును బహు దూరము గనుక పాపవిమోచనము అడుగునెడల అతడు మాత్సర్యము లేక మన్నించును, ఇది లోకేశ్వరునికి ముఖ్యమైన దయ, ఎల్లప్పుడును (=అనిశంబు) పుణ్యాత్ములను ప్రేమతో ప్రోచుటకంటె పాపము చేసినవాని పాపము లేనివానిగా చేయుట దేవునికి (=పరంధామునకు) గొప్పతనము, దయకును మోక్షమునకును దగ్గర (=చేరువ) గాని దూరము లేదు,

11. దేవుని వరప్రసాదము ఈ భూమిలోను (=క్షమాస్థలమున) గొప్ప శ్రేష్ఠమైన (=గురుతర ఏక) మోక్షమునకుమూలము (=ఎడ) అగును.

13. సర్వేశ్వరుడు తన తెలివియొక్క మహిమచే (=స్వప్రజ్ఞావైభవంబున) లోకసృష్టి చేయుటకంటె

టకంటె నజ్ఞానతిమిరంబునం బాపకూపంబునం బడి వెడలఁ దెరు వెఱుంగక యున్న యన్నరుం గరావలంబనం బొసంగి కడఁజేర్చుట పరమ ధర్మంబని తలంచునటు గావున నీషణత్రయానుసారంబగు సంసారంబు సారవంతంబని నమ్మిన దిన్ననగు బూరుగు ఫలంబు నమ్మి కేరెడు కీరంబు రీతి విగతఫలంబగు ననంతధాముని దర్శనస్పర్శనమ్ముల కిమ్మైన మోక్షంబు నిత్యంబై యుండు, నిందుఁ సందేహంబు లేదు గావునఁ గ్రియార్హుండనందగినట్టి సజ్జనుండు జ్ఞానాజ్ఞానసమాగత విశేషావిశేష ఫలమ్ముల విచారించి లోకజనకుండగు సర్వేశ్వరుని సంస్మరించి గురుసన్నిధానంబున స్వయంకృతవృజననికరంబును బ్రకటంబు గావించుకొని దోషవిమోచనకారణంబగు పశ్చాత్తాపంబు నొంది పరిశుద్ధుండు గావలయు ననియును. 13

ఆ॥ జగతిఁ బొత్తు పాపసంకీర్తనంబున । నిరయ భీతి వదలు నిత్యమైన 14
మోక్షసుఖముగలుగు మునుమున్నెయీయర్థ । మును నెఱుంగు నతఁడు ముఖ్యుఁడనఘ.

చ॥ గురుపదపంకజార్చనము గోరక సత్యవచఃక్రమంబునం
దిరుగక ధర్మపద్ధతిని దేలక దుష్క్రియ సేయు మానక
దురితసమూహము న్వదలఁ ద్రోలక మూర్ఖత నుండు నెవ్వఁడా
నరుఁడు ప్రవేశమై పొరలు నారక ఘోరపదంబులోపలన్. 15

వ॥ మనస్తాప లక్షణంబు వినుము. 16

సీ॥ జగతీస్థలంబున జన్మింప నొక నాతి । కడుపులోపలఁ జొచ్చి తడవు నిలిచి
మలమూత్రములయందు మగ్నుఁడనైతి నీ । వఱకైన సత్కృపాభరణుఁడైన
సర్వేశ్వరుని గనఁజాలక యొక సత్య । వాక్యమైనను బల్క వశము లేని
బాల్య కౌమార యౌవన విభ్రమభ్రాంతి । దగిలి చేసితి దుష్కృతముల మిగుల

ఆ॥ నిట్టి నను దయామహిమఁ బ్రోచు భారంబు । మీది సుమి యటంచు వేదమయుని
బరుని నెఱుఁగునట్టి గురువరేణ్యునిదండ । విదితముగను విన్నవింపవలయు. 17

---

అజ్ఞానంధకారముచే పాపకూపములో పడి తప్పించుకొనుటకు దారి (=తెరువు) ఎరుగని నరుని చేయి పట్టుకొని (=కర అవలంబనంబు ఒసగి) రక్షించుట గొప్ప ధర్మమే అని (అర్చ్యశ్రీ. తోమాసు) తలంచును. కావున దారప్రేమ విత్తప్రేమ పుత్రప్రేమ (=ఈషణత్రయము) అనుసరించెడు సంసారము గొప్పదని (=సారవంతంబని) నమ్మినెడల, చక్కనిదైన (=తిన్ననగు) బూరుగుకాయ నమ్మి సంతోషించెడు చిలుకవలె నిష్ఫలమగును, దేవుని (=అనంతధాముని) చూచుటకు పొందుటకును స్థలమైన (=దర్శన స్పర్శనమ్ములను ఇమ్మైన) మోక్షము నిత్యంబుగా నున్నది. నేర్పరి అనతగిన మంచివాడు జ్ఞానముచేతను అజ్ఞానముచేతను కలిగెడు (=జ్ఞాన అజ్ఞాన సమాగత) గొప్ప ఫలములను తక్కువ ఫలములను (=విశేష అవిశేష ఫలములను) విచారించి లోకముయొక్క తండ్రియగు సర్వేశ్వరుని తలంచి గురువు దగ్గర తాను చేసిన పాపసమూహము (=స్వయంకృత వృజన నికరంబును) ఒప్పుకొని పాపఓర్పు పొంది.

14. నిరయ=నరకమునకు । ఈ సత్యము (=అర్థము) మొట్టమొదట (=మునుమును) ఎరిగినవాడు గొప్పవాడగును. ఓ పాపము లేనివాడ (=అనఘ, అనగ లింగారెడ్డి)

15. గురువుల పాదపద్మముల (=పదపంకజ) అర్చనము కోరక, నిజ వచనముల చెప్పక, ధర్మమార్గమున నడవక, పాపసమూహము విడిచిపెట్టక మూర్ఖతనమునందు ఎవ్వడు ఉన్నాడో అతడు నరకమను ఘోరకూపములో ప్రవేశించి పొరలును.

17. ఇప్పటికైన=ఈవఱకైన । కృపతో నిండిన దేవుని=సత్కృపాభరణుడైన । బాల్యమునందును కౌమారములోను యౌవనములోను భ్రమించు భ్రాంతిలో చిక్కితిని । వేదముతో కూడుకొనిన దేవుని (=వేదమయుని బరుని) నెరిగెడు గురుశ్రేష్ఠుని దగ్గర (=దండ) విన్నవింపవలయును.

॥ ఇదిగాక వేఱొక విశేషంబు గలదు వినుము. 18

॥ దురిత మొనర్చిన మానవుఁ । డరుదుగ నొకవేళ పరమమగు పదమును దా
నరయఁగఁ దలఁచిన నొండొక । తెఱువున సాధింపవలయు దృఢతరబుద్ధిన్ 19

॥ తాఁ జేసినట్టి పాతకమునఁ గలిగిన । పరమపదేశు కోపమును దీర్ప
నిర్దోషుఁడై ధర్మనిష్ఠఁ బూనుట నన । దైయుండు నిఁక నెట్టులనిన మున్ను
చర్చసేయఁగఁ దగు సర్వశిష్టాగుప్తి । నీనను ఘనుఁడు మఱిం జేసినట్టి
మర్యాద వినుము నేమమున సత్యము గల్గి । యోర్పున నొక్కప్రొద్దుండుటయును

॥ జప మొనర్చుట ధర్మంబు సల్పుటయును । గరుణ మనమున నిల్పుట పరులవలన 20
నెసఁగు నేరమ్ములను క్షమియించుటయును । నొరులసొమ్ము గ్రహింపఁగ నోడుటయును,

॥ తనవలన నన్యులకు నొద । వెన యపకీర్తులను దానె విదలించుటయున్
దనుదానె మెచ్చుకొనమియు । ననఁగా నివి సేయవలయు ననఘచరిత్రా. 21

॥ దానంజేసి ఘోర దుష్కృతవారంబు దూరంబగు నదిమొదలు మానసంబు దురిత కర్మాణంబుగాక యుండు నందున జ్యోతిర్మయుండగు సర్వేశ్వరుండు కోపంబు విడిచి సదయుండగు నిత్యపరం బొక యుపాయంబు గలుగనేర దీయర్థంబున బ్రవర్తింపక యర్థాంతరాసక్తిం దిరుగు నరుండు నిరయంబున కర్హుండనియె నది కావున మనస్తాపసదృశంబగు కార్యంబు లేదు వినుము. 22

॥ వనిగాని దీనికి గుఱుతే । మని యడిగిన లెక్కలేని యఘములఁ దాఁ జే
సినవాఁడననుచుఁ జింతం । గనుటయు నదిమొదలు విగతకలుషుఁ డగుటయున్, 23

॥ నరుఁడు క్రియార్హుఁ డీకరణి న్యాయము దప్పక సన్మనీషచేఁ
బరఁగిన నాత్మశుద్ధమగు భాసురమోక్షపదంబుఁ జేరఁగాఁ
దెరు వెఱుఁగం బరాత్పరుఁడు దీర్ఘదయారసమొప్ప వాని యు
ద్ధురకలుషాగతార్తి విడఁద్రోసి సుఖింపఁగఁ జేయు నెంతయున్. 24

॥ ఇపుడు చెప్పిన రీతి నిపుణాత్మ సెల్వక । ఋణముపైఁ దీసిన ఋణముపగిది
మొదలఁ జేసిన పాపము లనార్యగతి నుండఁ । దిరుగఁ జల్పఁగనేల దురితములను

19. తాను అరయుగా తలఁచిన=తాను పొంద తలంచునెడల ఒక ఉపాయముచేత మిక్కిలి గట్టి బుద్ధి సాధింపవలయును.

20. పరమపదేశు=మోక్షమునకు యజమానునియొక్క । ధర్మనిష్ఠ=ధర్మవ్రతము । అసద=తేలికగ ...ండును । చర్చచేయఁగ తగు=విచారింప తగును । మర్యాద=నియమము । ఓడుట=విడిచిపెట్టుట ।

21. ఒదవిన=కలిగిన । విదలించుటయు=తీసి వేయుట ।

22 అట్లు చేయు నెడల (=దానంజేసి) పాపసమూహము దూరము అగును. మరియు మనస్సు పాపము ...చేయునది కాక (=దురితకర్మాణంబు) ఉండును. అందుచే ప్రకాశించుచు దేవుడు దయగలవాడగును. దీని ...టె (=నిత్యపరంబు) ఇంకొక ఉపాయము కలుగనేరదు, ఈ విధముగా ప్రవర్తింపని నరియొక్క విధమగు అర్థ... (=అర్థాంతర ఆసక్తిన్) తిరుగు నరుడు నరకమునకు ప్రాప్తుడే అని (అర్చ్య. అగస్తీసుడు) చెప్పెను కనుక ...నస్తాపమునకు సమానమైన కార్యము లేదు.

23. విగతకలుషుడు=పాపము లేనివాడు అగుట.

24. నేర్పరియైన (=క్రియార్హుడు) నరుడు మంచి బుద్ధితో ఒప్పిన (=సన్మనీషచే పరగిన) శుద్ధాత్ముడు ...గును. మోక్షము పొందుటకు మార్గము తెలియుటకు • దేవుడు గొప్ప దయ ఒప్పగా పెద్ద పాపములచే వచ్చిన ...ంత (=ఉద్ధుర కలుష ఆగత ఆర్తి) త్రోసి వాడు సంతోషించునట్టుగా చేయును.

25. నేర్పుతో సెల్వక బాకిమీద బాకీ తీసికొన్నట్టుగా, ముందు చేసిన పాపములు వారింపరాని విధము

శత్రుత్రయంబును సంతోషపెట్టంగ । నేల దానను ఫలంబేమి గలుగుఁ
దుదకు విచారింతు దోషంబనుచు నెంచ । వలవ దెవ్వటి పాపములను నపుడె
తే॥ నిరసనం బొనరించుట నీతి దలఁప । వసుధ నాయుస్సమాప్తి యేవఱకొ పాప 25
ముల నణంచుటకును బుణ్యముల నొనర్పఁ । గాలమున్నదొ లేదొ యీ మూలమెఱిఁగి.

తే॥ అఖిలలోకమ్ములకుఁ దండ్రియైన పరమ । పదవిలాసుని మది నమ్మి పాపభీతి 26
వదలి పుణ్యమ్ముల నొనర్పవలయుఁ జుమ్ము । మోక్షమున కానపడు నరముఖ్యఁ డెపుడు.

సీ॥ నిర్వాణభర్త యా సర్వేశ్వరుఁడు తండ్రి । యని మది నమ్మి నాయఁకుమున వెలయు
తిరుసభ తల్లియై దీపించునని తత్స । భాసముద్భవధర్మవచనదుగ్ధ
పానంబు గావించి పాతకక్షుధ దీఱఁ । బరుని దయారసప్రవిమలాన్న
భోజనంబునఁ దృప్తిఁబొంది సంతోషింప । వలెనని పెద్దలు పలుకుచుండ
తే॥ నెఱుఁగఁజాలక గురుఁ డానతిచ్చినట్టి । కడమలేనట్టి । దశవిధ కల్పనలను
గలుగు విధి గని యొక్కొక్క కల్పనను వి । వేకహీనత మీఱుట వెఱ్ఱిగాదె. 27

క॥ వినుము మనోవాక్కాయము । లను జేసిన కిల్బిషమ్ములను బోఁద్రోలం
గ నుపాయ మొకటి గలదే । తనరు మనస్తాపరీతి దక్కఁగఁ బుడమిన్. 28

తరల॥ పరుఁడనంతుఁ డకల్మషుం డరిభంజనుండు నిజాశ్రితో
త్కరము నెంతయుఁ బ్రోతునంచని కంకణంబు శయంబునన్
బిరుదుగాఁగ ధరించి యుండఁగఁ బృథ్వి దుష్క్రియచే నరుల్
నరకపద్ధతి నేగ నేటికి న్యాయసంగతిఁ జెందకన్. 29

ఉత్సాహ॥ వెఱచు మానవుని మనంబు వెన్నయై కరంగ భూ
వరవిశుద్ధగురునిబోధ వహ్నియై వెలుంగఁగా
వెర వెఱుఁగలేక మిగుల వెఱ్ఱిపట్టి ఘోరమా
నరకమునకుఁ బోవనేల నారమా రయంబునన్. 30

---

గా (=అవార్యగతి) నుండగా యెందుకు తిరిగి పాపములను చేయుట? లోకము పిశాచము శరీరములు సంతోషింప చేయగా దానివలన నేమి లాభము వచ్చును, చనిపోవు కాలములో (=దుదకు) పాపము నిమిత్తము దుఃఖపడుదునని చెప్పవలదు. ఏ కాలములోని పాపములను ఆ కాలములోనే విడిచిపెట్టుట (=నిరసనము ఒనరించుట) నీతిగా నున్నది. మరణము (=ఆయుస్సమాప్తి) ఎప్పుడో (=ఏ వఱకో.)

26. పరమపద విలాసుని=మోక్షనివాసియైన దేవుడు.

27. మోక్షముయొక్క నాయకుడైన సర్వేశ్వరుడు తండ్రిగా నున్నాడనియు తిరుసభ తల్లిగా నున్నదనియు ఆ తిరుసభలో కలిగిన ధర్మవచనము అనెడు పాలు త్రాగి (=తత్ సభ సముద్భవ ధర్మవచన దుగ్ధపానము కావించి) పాపము అనెడు ఆకలి (=పాతకక్షుధ) తీరగా దేవుని దయారసము కలిగిన పరిశుద్ధ అన్నభోజనము చేత (అనగా దివ్యసత్ప్రసాదము) తృప్తి పొందవలెనని పెద్దలు చెప్పుచుండ జేసువు ఆనతిచ్చిన సంపూర్ణమైన (=కడమలేని) పది కల్పనలవలన కలిగిన ఆజ్ఞ చూచినను ఒక్కొక్క కల్పన అవివేకము చేత మీరుట వెఱ్ఱితనముగదా.

28. మనోవాక్కాయములను=మనస్సుచేత వాక్కుచేత శరీరముచేత.

29. దేవుడు ముగింపులేనివాడు (=అనంతుడు) పాపములేనివాడు, శత్రువులను భంగపరచువాడు (=అరిభంజనుడు) తన ఆశ్రితుల సమూహమును (=నిజాశ్రితోత్కరము) బ్రోతునని కంకణము చేతియందు (=శయంబునన్) బిరుదుగా కట్టియుండగా, మనుష్యులు న్యాయమార్గము పొందక నరకమునకు పోనేల?

30. భయపడు మనుష్యునియొక్క మనస్సు నేయిరీతిగా (=వెన్నయై) కరగగా గొప్ప పరిశుద్ధ గురుని (=జేసునాథుని) బోధ నిప్పు అయి (=వహ్నియై) వెలుగగా మనుష్య సమూహమా (=నారమా) మార్గము తెలియక నరకమునకు మిక్కిలి త్వరగ (=రయంబున) బోవనేల?

వ॥ ఆదియునుం గాక నిర్వికారుం డగు సర్వేశ్వరుని యనంతం బగు ప్రభావంబును లక్ష్యంబు సేయక క్షణభంగురంబగు స్వప్రతీక సౌఖ్యం బభిలషించి లోకబహుమానంబు ఘనంబుగా నంగీకరించి వ్యయంబుగాని ద్రవ్యంబుతు నగు పరమపదలాభంబును విచారింపక వర్తించు మనుష్యులకు నందుల ఫలంబెయ్యది గావునఁ గ్రియాశాలియగు నతండు పావవిమోచనకరంబగు మనస్స్వాపంబున సర్వేశ్వరానుగుణంబైన ధర్మకార్యంబు ననివార్యంబుగా మనంబున నను సంధింపవలయు నట్లు చేసినఁ బ్రత్యక్షంబగు మోక్షంబు సిద్ధించు. సద్గురు బోధాశీర్వాదంబ దోమ నిద్రాభారంబున నిద్రించు మానవునిఁ బెద్దయెలుంగున మేల్కొలుప సిద్ధంబై యుండు నట్లగుట కైవల్యపథనిరోధంబగు నజ్ఞానంబును వదలి జ్ఞానపథప్రవిష్టుండు గావలయును. 31

చ॥ అసదృశసార మొప్పు వయసంపదయుఁ బోయిన వెన్క నిష్ఠమై
ముసలితనంబున న్వెలయు మోక్షసుఖంబు ఘటించురీతి దా
నెసఁగఁ బఠింతునంచు మదినెంచఁగరాదు వయస్సు బుద్ధికిం
బునికియగు వార్ధకంబు కడు మాంద్యము నిచ్చుచునుండు నిచ్చలుఁన్. 32

సీ॥ జనుఁడు వయఃకాలమున సుఖింపఁ దలంచి । వార్ధకంబున మోక్షవైభవమును
సాధింతుననుచు విచారింపవలదు త । ద్గన్న వా రరిగిన క్రమ మెఱింగి
యాయువ్యయం బింద్రియపటుత్వహీనంబు । నిర్గతధిషణయు నిర్ధృతియును
దినదినం బాయాసమున కోర్వమియు మాన । సమునఁ దలఁచి వయస్సమయమునను
తే॥ సద్గురు ప్రాప్త విజ్ఞాన సరణివలన । గురుతరాజ్ఞాన కాననోత్కరము గడవ
నూహ గావించుటది యుత్తమోత్తమంబు । క్షోణినాథుఁడెపో క్రియస్థుఁడు దలంప. 33

ఉ॥ ధార్మిక యౌవనస్థగళ ధర్మవిచారమునందు నిర్వ దు

---

31. వికారములేని (=నిర్వికారుడగు) సర్వేశ్వరునియొక్క అంతములేని ప్రభావము గమనింపక క్షణములో నశించిపోవు (=క్షణభంగురంబగు) తన అవయవముల (=స్వప్రతీక) సుఖము కోరి నాశనముకాని (=వ్యయముగాని) మోక్షము విచారింపక పోవు మనుష్యునకు ఫలము ఏది, గనుక నేర్పరి (=క్రియాశాలి) మనస్స్వాపముచేత సర్వేశ్వరునికి తగిన (=అనుగుణంబైన) ధర్మకార్యములను నిరాటంకముగా (=అనివార్యముగా) మనస్సులో ఉంచవలయును సద్గురువుయొక్క (=సద్గురు) బోధయొక్క గొప్పతనము దోషములు అనెడు నిద్ర భారముచే నిద్రించు మనుష్యుని పెద్ద శబ్దముచే లేపుటకు (=మేల్కొలుప) సిద్ధముగా నున్నది. అట్లు అగుటచేత మోక్షమార్గమునకు ఆటంకము (=కైవల్య పథనిరోధమును) అగు అజ్ఞానము వదలి జ్ఞానమార్గములో ప్రవేశించువాడై యుండవలెను.

32. సాటిలేని బలముచే (=అసదృశసారము) ఒప్పెడు ప్రాయము పోయినవెనుక ప్రకాశించు మోక్షభాగ్యము కలుగునటుల నేరుపుతో (=నిష్ఠమై) ముసలితనంబున నేను బాగుగ (=ఎసగ) జ్ఞానము చదువుదును (=పఠింతును) అంచు మనస్సులో తలంపగాదు. చిన్న ప్రాయము (=వయస్సు) బుద్ధికి స్థానమగును. ముసలితనము (=వార్ధకము) మిక్కిలి బలహీనము (=కడు మాంద్యము) ఎప్పుడును (=నిచ్చలుఁ) ఇచ్చును.

33. మనుష్యుడు చిన్న ప్రాయములో సుఖింప తలచి ముసలితనములో మోక్షము పొందుదునని తలంపకూడదు. తన తల్లిదండ్రులుం వెళ్లిపోయిన మార్గము (=కన్నవారు అరిగిన క్రమము) ఎరిగి, ప్రాయముయొక్క నాశనము (=ఆయు వ్యయము) ఇంద్రియముల బలహీనమును (=పటుత్వహీనంబు) వదలిపోయిన బుద్ధి (=నిర్గత ధిషణ) అధైర్యమును (=నిర్ధృతి) అయాసమున ఓర్వజాలక పోవుటయు మదిలో తలచి, చిన్నప్రాయమునందే (=వయస్సమయమున) సద్గురువుచే కలిగిన (=ప్రాప్త) జ్ఞానమార్గమువలన గొప్ప అజ్ఞానము అనెడు అరణ్యసమూహము (=కానన ఉత్కరము) దాటిపోవుటకు ఆలోచన (=ఊహ) చేయుట ఉత్తమమైనది. తలంపగా అతడు భూమిలో (క్షోణిజ) నేర్పరి సమ్యక్ (=పో)

ష్కర్మమునందుఁ బాదుకొనఁ జాల బలంబు గలుంగఁ జేయు నీ
మర్మ మెఱింగి వృద్ధనియమంబుఁ దలంపక నిష్ఠమై వయో
ధర్మమునందె ముక్తపదము దార్కొను చింత యొనర్పఁగాఁ దగున్. 34

క॥ ధరణి వయస్సమయంబున । దురితము లొనరించి నడవఁ దోఁపక బలముం
దరిగిన వార్ధకమున మో । క్షరమన్ సాధించినట్టి జనుఁడుం గలఁడే. 35

గీ॥ యౌవనంబున నడచు కార్యంబులకును । వార్ధకంబునఁ గావించు పనికి ధరణిఁ
దారతమ్యంబు లెట్టి చందమునఁ గలవొ । వినియుఁ గనియు విచారింప విదితమగును.

ఉ॥ ఇవ్వసుధాస్థలంబున నహీనలసత్ప్రతిభావిలాసమే 36
యౌవన మట్టి కాలము ననర్ఘ్యతరాఘనిదానలీలచే
నవ్వుచు నుత్తరించి బలనాశకరంబగు వార్ధకంబునం
దెవ్వఁడు పారమార్థికము నెంచు నతం డవివేకియౌఁ గదా. 37

వ॥ వయఃకాలంబునఁ బంకసంకలితకార్యాలోచనపరుండై దుష్టేంద్రియసౌఖ్యంబు ముఖ్యంబుగా ననుభవించి, వార్ధకంబున దేహశోషణ మొనర్చుటయుఁ ధర్మకార్యంబు లొనర్ప నారంభించుటయు సదాచార్య కైంకర్యంబుఁ బూనుటయు శ్రమమై యుండు నది గావున "నాలస్య మమృతం విషం" బను న్యాయంబు నెఱింగి యౌవనసమయంబున తమోగుణరహితంబుగా మనంబు దృఢంబు గావించి మనస్తాపంబను తపంబునఁ బాపవిమోచనంబుఁ జేసికొని ధర్మకార్యకరణంబునఁ బుణ్యంబు ననుసంధించుకొనవలయు నిదిగాక నీ వయస్సమయంబున నిష్టోపభోగంబు లనుభవింపఁ దలంచెదేని స్వయంకృతామేయ దురితంబు బాధింపక తొలంగునే, దానం జేసి యాయుర్వ్యయంబు కాకుండునే, "నిత్య సన్నిహితో మృత్యు" రను శపథంబు దప్పునే, మాతృగర్భంబు వెడలినది మొదలు పురుషునకు దైనందినగండంబై పరఁగు. నందును బరమపదమార్గనిరోధంబగు దేహేంద్రియసుఖంబు స్వప్నంబునం దైనం గోరక బహు జాగరూకుండై

34. ఓ ధర్మము చేయువాడా (=ధార్మిక అనగ లింగ రెడ్డి) చిన్నప్రాయము గల కాలము (=యౌవనస్థదశ) ధర్మకార్యములందు నిలుపుటకును చెడ్డ కార్యములలో స్థిరపడుటకును చాల బలము కలిగియున్నది. ఈ మర్మము ఎరిగి ముసలితనములో చేయబోవు (=వృద్ధ) నియమములను తలంపక నిష్ఠతో చిన్నప్రాయమందు (=వయోధర్మమునందు) మోక్షము (=ముక్తపదము) పొందుటకు చింతింపవలెను.

35. నడవ దోపక బలము తరిగిన వార్ధకమున=నడచుటకు శక్తిలేక బలము తొలగిన ముసలితనములో । రమ=భాగ్యము ।

36. తారతమ్యంబులు=భేదములు ఏ విధముగా కలిగినవో.

37. ఈ భూమియందు (=వసుధ స్థలంబున) మిక్కిలి ప్రకాశించు బుద్ధి యొక్క (=అహీన లసత్ ప్రతిభ) విలాసమే యౌవనకాలమగును. అట్టి కాలమును తగని పాపముయొక్క మొదటి కారణముల విలాసముచే (=అనర్ఘ్యతర అఘ నిదాన లీలచే) నవ్వుచు పోగొట్టి (=ఉత్తరించి) బలములేని ముసలితనములో ఎవడు మోక్షచింత (=పారమార్థికము) తలంచునో. అట్టివాడు తెలివిలేని వాడగును.

38. పంకసంకలిత కార్యాలోచనపరుడై=పాపము కూడిన కార్యములను ఆలోచన చేయువాడు । శ్రమమై=కష్టముగా । ఆలస్య మమృతం విషంబు=ఆలస్యము చేయునెడల అమృతము సహా విషమగును । ధర్మకార్యకరణమున=ధర్మకార్యములు చేయుటచేత । స్వయం కృతామేయ=సొంతగా చేసిన గొప్ప పాపములు బాధింపక పోవునా । ఆయుర్వ్యయము కాకుండునే=ప్రాణము నష్టము కాకుండునా, అనగా మరణము జరుగకుండ నుండునా । నిత్య సన్నిహితో మృత్యువు=మరణము ఎల్లప్పుడును సమీపములో నుండును అను సామిత తప్పునా । దైనందినగండంబై=దినదినము అపాయమై పడుగును । పరమపదమార్గ నిరోధంబగు=మోక్షమార్గమునకు అడ్డుగా నుండు

కాలంబు నుత్తరింపక సర్వేశ్వరాఖండ భక్తియోగంబు చిత్తంబున స్థిరంబుగాఁ బాదు
కొల్పిన మహానుభావునకుఁ గైవల్యపదంబు కరతలామలకంబై యుండు మఱియు 38

ఉత్సాహ॥ నరుఁ డెవండు ధాత్రి నీతుల న్యాయమార్గసంగతిన్
స్థిరముగా నటించు వాని దివ్య భక్తి మెచ్చుచున్
స్వరితసాంక్ష్యనైనవారు స్థిర దయారసాప్తిఁ ద
స్సరుని మది వసించి తా మనాగతంబు హెచ్చఁగన్ 39

క॥ రక్షింతురు కిల్బిషముల । శిక్షింతురు చెడని సిరులఁ జెలఁగి ఘనంబౌ
మోక్షమున నుంతు రపరా । ధక్షముఁ గావించి తల్లి తనయుని రీతిన్. 40

సీ॥ ఇలను గొందఱు క్రియాభ్రష్టులు దురితాంధకా । రములోనఁ జిక్కి యీ సమయమునను
దపము సేయఁగ నేల ధర్మమేటికి నిజం । బాడు టెందుకు యౌవనాంతమునను
బూనెదమనుచు దుర్బుద్ధి నాత్మ దలంచి । తిరుగని పయనంబు తెరువు గనక
పరసేవన త్రయసంగతి లోకసా । ఖ్యంబు నభిలషించి డంబమునను
తే॥ దిరుగుచుందురు మరులొంది మరణవేళఁ । బ్రాణగమన భయంబును వ్యాధిభయము
నాలుబిడ్డలఁ బాయు భయంబు మదిని । జాలి పుట్టించుఁ బరు నెన్నఁ జాలు రెపుడు. 41

చ॥ అసమబలంబున న్వెలయు యౌవనకాలము నుత్తరించి సా
ధ్వసమును ఖేదకారణ విధంబును దైన్యముఁ జెందునట్టి పె
న్మసలితనంబు గల్గునెడ మోక్షనిదానతపంబు సేయఁగా
వసమగునే క్రియాభ్రష్టుఁ డనవచ్చిన వాని మహీతలంబునన్. 42

ఉత్సాహ॥ గురుఁడు బుద్ధి చెప్పునపుడు దసంతత ప్రభాస్ఫుర
త్పరమపురుష సత్కథా ప్రభావపుస్తకమ్ములన్
పరమనీమఁ జూచునపుడు పాపమోచనక్రియా
కరుఁడుగాక రోగియైన కాలమున నెఱుఁగునే. 43

దేహము యొక్క ఇంద్రియముల సుఖము । కాలము నుత్తరింపక = వ్యర్థముగా పుచ్చక । కైవల్యపదంబు కరతలా
మలకంబై = మోక్షభాగ్యము సులభముగా దొరుకును.

39. న్యాయమార్గ సంగతిన్ = న్యాయమార్గముమీది స్నేహముతో । దయారసాప్తి = దయారసముయొక్క కలిమితో । అనాగతము హెచ్చఁగ = ఎల్లప్పుడు అధికముగా ।

40. కిల్బిషములు శిక్షింతురు = పాపములను పోఁగొట్టుదురు । సిరుల = భాగ్యములచేత । అపరాధక్షము గా
వించి = క్షమింపబడిన వాని చేసి ।

41. యౌవనాంతమున = ముసలితనములో । తిరుగని పయనంబు తెరువు గనక = వచ్చిపోవు మార్గము చూ
డక । పరసేవన త్రయసంగతి = కపముతో కూడిన మూఁడు చెడ్డగుణములయొక్క ప్రేమచేత । డంబమున మరులొం
ది = ఆడంబరముతో కామగుణము పొంది తిరుగుదురు । ప్రాణగమన = ప్రాణము పోవు భయము । పరు నెన్న
జాలరెపుడు = ఎప్పుడు దేవుని ప్రార్థింపఁ జాలరు.

42. సాటిలేని (=అసమ) బలముతో వెలయు యౌవనకాలము వ్యర్థముగా పోఁగొట్టి భయమును (=సా
ధ్వసమును) దుఃఖమునకు (=ఖేద) కారణమైన విధమును బలహీనమును (=దైన్యము) యెక్కువ చేయునట్టి
పెద్ద ముసలితనము కలుగు సమయమున మోక్షము పొందించు (=నిదాన)తపము చేయుటకు వశమగునా? ఇటు
వంటివాని నేర్పరి (=క్రియాభ్రష్టుడు) అనవచ్చునా.

43. గురువులు బుద్ధి చెప్పునప్పుడును మంచి కాంతితో ప్రకాశించెడు (=అసంతత ప్రభాస్ఫుర) దేవు
నాథునియొక్క చరిత్రము శ్రేష్ఠమైన పుస్తకములను మంచి మనస్సుతో (=పరమ నీమ) చదువునప్పుడు పాపము
పోఁగొట్టుకొనువాఁడై యుండవలెను గాక వ్యాధి పుట్టిన కాలములో ఆ విధముగా చేయ నెఱుగునా.

క॥ బలవంతమైన కార్యము । బలము గలుగునపుడె కాని బలరహితుండై
నిలుచునపు డెట్లు సేయుఁ । వెలయఁగ నిది గుఱుతు సుమ్ము వినువారలకున్. 44

ఉ॥ మానవకోటికిం దగిన మార్గము గన్పడ నర్చ్యశిష్టవా
రానతి యిచ్చినట్టి క్రమమంతయు నిట్టిద కాఁ దలంచి వి
జ్ఞానవినోదియై పరఁగు సజ్జను గాంచిన వారలెల్ల న
జ్ఞానవిమోచనంబయి యసాధ్యఫలంబును గొందురుర్వరన్. 45

చ॥ జగతి నసామ్యమౌ స్థిరతుసాంత్వము సాధ్యము సేయఁ గోరువాఁ
డగవరధైర్య యౌవనమునం దన భక్తిని యర్చ్యశిష్ట వా
రగణిత ధర్మసూత్రముల నానతి యిచ్చినభంగి సేయఁగాఁ
దగు నటులైన సద్గతి నిధానము కొంగుపసిండి యెంచఁగన్. 46

వ॥ ప్రాణప్రయాణసమయంబున స్వయంకృతాపరాధనివహంబును బ్రథమ గురువర స్లీవ
సన్నిధానంబున లెక్కవెట్ట మిక్కిలి వెక్కసంబై యుండుఁ బడుచుఁదనంబున నెప్పుడో
సల్పిన యపరాధమ్ముల నప్పుడ గుర్వాలయంబునఁ బ్రకటంబు చేసినఁ దుదకు హృద
యంబు వికటింపక యకలంక విజ్ఞానంబున సరళంబై యుండునది గావున స్వేచ్ఛావి
హారంబునఁ బశుప్రాయుండుగాక పరమగురు ప్రకటిత సన్మార్గంబున నధిగమింపఁ బూ
నుట మేలుగాదె బాల్యకౌమారయౌవన దశావిశేషమ్ముల విజ్ఞానమయుండై యే
నరుండు వర్తించు నా నరుం డెప్పుడు పంచత్వంబు నొందు నప్పుడ నిర్వాణంబు
సిద్ధించుటకు సందేహంబులేదీ క్రమంబు పరమ సులభంబు వినుము. 47

ఆ॥ అమితమైన ముక్తి నభిలషించు నరుండు । భక్తియుక్త హృదయ పాత్రుఁ డగుచు
నయము వెలయ జేసునాథగురుస్వామి । నభినుతింపవలయు నదియు వినుము. 48

స్రగ్ధర॥ హారితార్తీ జేసునాథార్యతిలక శ్రితచక్రావనా సత్యవర్తీ
కరుణాపాథోనిధీ దుష్కర దురిత కుభృత్కాండ దంభోళిధారా

---

45. విజ్ఞానముచే వినోదించినవాడై పరగెడు మంచివాని అనుసరించిన (=సజ్జను గాంచిన) వారలెల్ల అజ్ఞానము పోయి (=విమోచనంబయి) పొందుటకు కష్టమైన (=అసాధ్య)ఫలమగు మోక్షము పొందుదురు.

46. కొండవంటి శ్రేష్ఠమైన ధైర్యము గలవాడా (=అగ వర ధైర్య) సాటిలేని (=అసామ్యమౌ) స్థిరతు సాంత్వమును పొందుటకు (=సాధ్యము చేయ) కోరువాడు యౌవనమునందు అర్చ్యశిష్టులు చెప్పిన రీతిని చేయదగును. అటు చేసినయెడల మోక్ష నిక్షేపము (=సద్గతి నిధానము) కొంగునందలి బంగారమువంటిది (=కొంగు పసిండి) అగును అనగా సులభముగా పొందును.

47. ప్రాణము పోవుసమయములో తాను చేసిన పాపముల సమూహము (=స్వయం కృత అపరాధ నివహము) జేసువు స్లీవయెదుట ఒప్పుకొనుట (=లెక్కపెట్ట) కష్టముగా నుండును. యౌవన ప్రాయములో చేసిన పాపములను అప్పుడే గుడిలో ఒప్పుకొనునెడల హృదయము ఎదురు తిరగక (=వికటింపక) జ్ఞానంబున స్థిరమ్ముగా (=సరళంబై) నుండును, ఇష్టము వచ్చినట్లు పశువువలెగాక (=స్వేచ్ఛావిహారంబున పశుప్రాయుడు గాక) జేసువు బోధించిన మార్గమున నడచుట (=అధిగమింప) మంచిది. బాల్యము కౌమారము యౌవనము అను మూడు దశల సమయములలో... మెందలైనవి.

49. భయము పోకొట్టువాడా (=హారితార్తీ), సజ్జనుల సమూహముయొక్క రక్షకుడా (=శ్రితచక్రావనా) సత్యముతో వర్తించువాడా (=సత్యవర్తీ) కరుణ సముద్రమువంటివాడా (=కరుణాపాథోనిధీ) పెద్ద పాపములు అనెడు పర్వత సమూహములకు వజ్రాయుధముయొక్క దెబ్బవంటివాడా (=దుష్కర దురిత కుభృత్కాండ దంభోళిధారా) దేవునియొక్క ఏక ప్రభావముగలవాడా (=పరమాత్మ ఏక ప్రభావ) మోక్షము పొందతగిన విద్యలకు పాత్రవంటివాడా (=పరమపద ఫలప్రాప్య విద్యా నిధానా) నిండిన అద్భుతమును ప్రయోగించిన

క॥ ముక్తినిదానక్రియలన్ । భక్తి నొనర్పక విరుద్ధభావవిలాసా
సక్తుండ నైతి నింకె ట్లనుర । క్తి న్ననుం బ్రోచెదవొ వరప్రతిభాఢ్యా. 53

సీ॥ చేతనకోట్ల విశేష బాధావిధం । బుల దరింపంగం జేయం బుట్టినట్టి
దేవరవారిని స్లీవప్రమాణమున దుష్టు । లమర సంధించిన క్రమమునంత
వింటినే నిపుడు గన్గొంటి నాదగు భాగ్య । మును నేమనుచు నెంచుకొనెదు వాండ
నటులు చేసిన యవయవబంధనంబున । కోడక ధృతిమించి యీడులేక

తే॥ పరంగు కరుణారసంబున నరులం బాప । జలధి వెడలించి ముక్తికి జగుగు నరణిం
జూపు నిను నుతి గావింప నోపుదురె ధ । రాస్థలంబున నెంతటి ప్రాజ్ఞులైన. 54

క॥ ఈ పగిది నన్నుతించినం । బాప విముక్తియును మోక్షఫలసిద్ధియు ను
ద్దీపింపం బ్రోచు గురుండు ద । యాపరుండై తెలియు మిది క్రియావిభవజ్ఞా. 55

క॥ ఏయెడ నాత్మకుం దరణో । పాయముం జింతించు నతండు బహు భంగులం దాం
జేయం దగు నబ్దములో । న్యాయస్థితి దురిత కీర్తన మదెట్లనినన్ 56

సీ॥ విను మొక వత్సరంబునం బదిరెండైన । నెల లొప్పు వానినన్నిట గణింప
విదితమై నలువదెన్మిది యర్కవారమ్ము । లమరుం దదర్కవారములయందుం
బ్రత్యర్కవారమ్ము భయభక్తి వినయముల్ । గలిగి యాద్యాచార్యనిలయమునను
బని పూని తా నొనర్చిన కిల్బిషవ్రాత । మును బ్రకటంబుగా ఘనరవమునం

తే॥ బలికి వలుమాఱు దుఃఖింపవలయు దాన । నఘ విమోచనమును సుకృతాప్తియు నగు
నట్లు చేయని మనుజున కధిక దుష్కృ । తక్షయామయమున బల్మి దరుగుచుండు. 57

క॥ కలుష క్షయామయము తను । బలరహితముగాదు బుద్ధి బలహీనంబుం
గలిగించునట్లు గావునం । జలుపం దగున్ దురితరోగ సంహారంబున్. 58

క॥ దోష సంకీర్తనంబె । యౌషధముగం గొనినం బుణ్యమను బలమును ని
ర్వైషమ్యభావ మధికమ । నీషయు వర్ధిల్లు నిల ననిందితచరితా. 59

---

జల్పములన్) కాలము పోగొట్టితిని.

53. మోక్షమునకు కారణమైన (=నిదాన) క్రియలను చేయక విరుద్ధమైన తలంపులచే కలిగిన శృంగార చేష్టలయందు ఆశ కలవాడనైతిని (=విరుద్ధ భావవిలాసాసక్తుడు) గొప్ప ప్రభావముగలవాడా (=వరప్రతిభాఢ్యా)

54. మనుష్యులు (=చేతన కోట్లు) నరకమునుండి (=బాధావిధంబు) దాటి పోవునట్లు చేయుటకు పుట్టిన మిమ్ము దుష్టులు స్లీవలో సంధించిన విధము వింటిని ఇట్లు అవయవములు కొట్టబడుటకు (=యవయవ బంధమునకు) భయపడక (=ఓడక) సాటిలేని కరుణతో నరులను పాప సముద్రములోనుండి తీసివేసి (=వెడలించి) మోక్షమునకు పోవు మార్గము చూపెడు నిన్ను లోకములోని యెంత తెలివిగలవారైనను స్తుతింపగలరా?

55. ఉద్దీపింప=కలుగుటకు। క్రియావిభవజ్ఞా=క్రియ నిపుణుడా।

56. అన్ని సమయములందు (=ఏయెడ) ఆత్మకు మోక్షము పొందు ఉపాయము (=తరణోపాయము) తలంచువాడు సంవత్సరములో అనేకసార్లు పాపసంకీర్తనము చేయతగును.

57. సంవత్సరములో 12 నెలలు ఉండును. వానియందు 48 ఆదివారములు (=అర్కవారము) ఉన్నవి. ఆదివారములయందు ప్రతి ఆదివారమున గుడిలో (=ఆది ఆచార్య నిలయమున) పాపముల సమూహము స్పష్టముగా (=ఘనరవమున) చెప్పవలయును. దానిచేత పాపముల ఓర్పును పుణ్యములును (=సుకృతాప్తి) అగును. అట్లు చేయనివానికి పాపము అను క్షయ వ్యాధిచే (=అమయము) బలిమి తగ్గును.

58. పాపము అను క్షయవ్యాధి శరీరమును (=తన్ను) బలములేనిదిగా చేయదుగాని బుద్ధికి బలహీనము కలిగించును.

59. నిర్వైషమ్య భావము=పగలేని మనస్సు। మనీష=బుద్ధి.

చ॥ క్షమ ననుకూల శాత్రవుల చందమున మ్మురిపించుచున్న పా
పముల సమూహమానటులు పావఁ దగు న్మది వాని నమ్మి మం
దమతి వహించియుండినఁ దుదం బలు మోసము దెచ్చుఁగాన దు
ర్భ్రమ విడి సత్క్రియాపరతి రంజిలువాఁడె క్రియాప్తుఁ డెన్నఁగన్. 60
తే॥ పుణ్య మొనరించుటకు బుద్ధిపుట్టమియును । దుష్కృతము సేయ మేలని తోఁచుటయును
సత్య మీ రెంటియందలి నిత్యశ్రమను । తెలిసి వర్తించు మనుజుండు ధీరుఁ డరయ. 61
క॥ కరము పిశాచమువంటిది । ధర నజ్ఞానము దలంపఁ దదమితమాయా
పరవశుఁడై వర్తింపక । పురుషుఁడు విజ్ఞానమంత్రమున వెలయఁ దగున్. 62
ఆ॥ దురితకర్మమునను దూరగమైపోయిన । పుణ్యసంచయమును బుడమి పావ
కీర్తనం బొనర్చి పూర్తిగాఁ దనుఁ జెందఁ । జేయువలయు మోక్షసిద్ధికొఱకు. 63
సీ॥ అబ్దంబులోపల నడుగప్తునకుఁ । బాపసంకీర్తన మొనర్చు సరణిగాక
పరిశుద్ధమైనట్టి స్వాంతంబుతో నిట । మీఁదటఁ గల్మష మిశ్రకార్య
ములు సేయనని ధర్మమున నడిచెదనని । తెలివి గల్గి దృఢ ప్రతిజ్ఞఁ బూని
గురుతు మించఁగ జేసుగురుమూర్తి ననుభవం । బుగఁ గొనునట్లు మేలుగఁ దలంచి
తే॥ గోదుమప్పము నప్పుడు బోధ సల్పు । సద్గురుస్వామిచే గ్రహించంగవలయు
నది గ్రహించిన దాని మహాత్మ్యమెల్ల । దివ్యభోజనమని యంద్రు భవ్యచరిత. 64
సీ॥ లోలతఁ దన యింటిలోఁ జేయు భోజనం । బది యనిత్యాంగఁబు నవనిఁ బెంచు
నా దివ్యభోజనం బకలంక సర్వేశ్వ । రాఖండ తేజస్సమైక్య మొసఁగుఁ
గావున సత్క్రియాగరిమ గాంచఁ దలంచు । నరుఁ డఘమార్గఁబుఁ బరిహరించి
ధర్మమార్గమునందు నిర్మిత ఫలవాంఛ । నడచిన నఘబంధ మడఁగిపోవు
తే॥ స్వర్గ నిర్వాణమున కేగ నూహ సేయు । మనుజుఁ డీ దివ్యభోజనమ్మును గ్రహింప 65
వలయు నిటు సేయఁడేని యా ఖలుఁడు ఘోర । నరకసంగతి కరుగు దుర్నయుఁ డనంగ.
క॥ ధర మనుజుని యాత్మను గల । దురితవ్యాధిని హరింప దొరయగు సర్వే
శ్వరుఁ డీ యౌషధమును దాఁ । గరుణం గల్పించె వినుము ఘనసుగుణనిధీ. 66
మ॥ పరశౌర్యంబున నంతరంగ రిపుల న్బాధించి వారింప ను

---

60. ఒగ్గుతో లోబడిన (=క్షమన అనుకూల) శత్రువుల విధంబున (అనగా: జయించిన శత్రువులు తిరిగి పడునట్లు) తిరిగి వచ్చెడు (=మురిపించుచున్న) పాపసమూహమును, అగును. వానిని పోగొట్ట (=పావ) తగును. దుర్బుద్ధి విడిచి సత్క్రియల చేయుటయందు (=సత్క్రియాపరతి) రంజిలువాడు క్రియా నేర్పరి అగును.

61. పుణ్యము చేయుటకు బుద్ధి పుట్టకయును, చెడ్డ క్రియలు చేయుటయును అను ఈ రెంటిలో నిత్య కష్టము ఉన్నదని వర్తించు మనుష్యుడు ధీరుడగును.

62. తత్ అమిత మాయా పరవశుడు= దానియొక్క గొప్ప మాయకు లోబడినవాడు ।

64. కల్మష మిశ్ర కార్యములు=పాపముతో కూడిన కార్యములను. గురుతు మించగా=నియమ్ము అతిశయించగా । అనుభవంబుగా కొనునట్లు=లోనికు తీసికొనుట । బోధ సల్పు=మంత్రించిన.

65. ఆశతో (=లోలత) ఇంటిలో చేసిన భోజనము అతని శరీరమును (=అంగము) పెంచును. దివ్యభోజనము సర్వేశ్వరుని గొప్ప బలముతో పొందిక చేయును (=అఖండ తేజస్స సమ ఐక్యము) సత్క్రియలమీద ఇష్టము (=గరిమ) పొంద తలచువాడు పాపమార్గము విడిచి పుణ్యమార్గములో నిర్మింపబడిన ఫలములమీద ఆశతో నడుచునెడల పాపముల సమూహము అడగిపోవును.

66. దొర=రాజు ।

ర్వారఁ దాము నొనరించినట్టి కలుషవ్రాతమ్ములం ద్రుంప బం
ధురమై మించిన వర్తమాన భవసందోహంబునుం ద్రెంప ను
ద్ధురరీతిం దగు భావిపాతకములం దూలింపఁగా సత్కృపా
భిరతి న్మేలగు దివ్యభుక్తి నిటు గల్పించెం బరేశుం డొగిన్. 67

సీ॥ ఇదిగాక ఘనమైన యీ దివ్యభోజనం। బున మోక్షమార్గముఁ బొడమకుండఁ
దొలఁగిపోయిన ధర్మములు దృఢంబుగ వచ్చు। స్వాంతంబునకు సంతసంబు గలుగు
భక్తియోగంబు తీవ్రస్థితి నింపొందు। విశ్వాసమునకు సద్వృత్తి మించు
స్ఫురితసాంత్వము నతిస్థిరరీతి విలసిల్లు। ముక్తి కేగుట కిది మూలమగును.

తే॥ దీనికంటె నయంబైన దివ్యసాధ। నం బొకటి లేదు భూతలయంబునందు
నమితమైనట్టి దురితామయమ్ములకెల్ల। నౌషధశ్రేష్ఠమని పెద్ద లానతిచ్చిరి. 68

చ॥ కరుణఁ బరాత్పరుండు మును గల్పన చేసిన కల్పనాసము
త్కరమును ధీరులీ ధరణిఁ గట్టడ చేసిన కార్యరీతి సో
మరితనమెంతయు న్విడి క్షమం గని తా నెఱుఁగంగవచ్చు శ్రీ
కరమగు దివ్యభోజనము గల్గు క్రియాస్థ్మన కెన్నిభంగులన్. 69

మ॥ ఘనపాపాంబుధి దాఁటఁ దెప్పగతి ముఖ్యంబైన యో దివ్యభో
జనమా దివ్యరహస్యమా సుకృతము న్సత్యంబునుం గల్గి ని
న్ననిశంబు న్నుతి సేయు సజ్జనుల మోక్షానందముం జెందఁ బా
వనచారిత్రులుగాఁగఁ జేయుదుగదా భాస్వద్దయాశాలివై. 70

మ॥ స్ఫురదుల్లాసభరంబు నాత్మకు బలంబు న్నిత్య విశ్వాసమున్.
గురుపుణ్యప్రతిభావిశేషమును బ్రత్యుగ్రప్రభావంబు శాం
తరసావేశము నీఁ దలంచు నిను మోదంబొప్ప నే వేఁడెదన్
సరసంబై తగు మోక్షమార్గ గరిమ న్సంధించి రక్షించుమీ. 71

క॥ అని యిటులు దివ్యభోజన। మును దలఁచియు జేసు దేహము గ్రహియింపన్.
ఘన మోదమునఁ బరాత్పరుఁ। డనలేని సుఖమ్ము నొసఁగు నెనఁగిన కరుణన్. 72

67. గొప్ప శౌర్యముతో మనస్సుయొక్క శత్రువులను (=అంతరంగరిపులు) బాధించి తొలగించుటకును (=వారింప) తాను వెనుక చేసిన పాపసమూహము తీసివేయుటకును, దట్టమై (=బంధురమై) మించిన ఇప్పుడు ఉండు (=వర్తమాన) పాపసమూహమును (=భవ సందోహము) కొట్టివేయుటకును, భయంకరమైన (=ఉద్ధుర) రీతిని ముందు జరుగు (=భావి) పాపములను తొలగించుటకును కృపగలిగిన ఆశతో (=సత్కృపా అభిరతి) దేవుడు ఈ దివ్యభోజనము స్థాపించెను.

68. తీవ్రస్థితి=త్వరగా। దురిత అమయము=పాపము అనెడు వ్యాధి।

69. కల్పనాసముత్కరము=కల్పనల సమూహము। ధీరులు=పెద్దవారలు, అధికారము గలవారలు। కార్యరీతి=కట్టడలను। క్షమం గని=ఓర్పుతో చూచి।

70. పాపము అనెడు సముద్రము దాటుటకు తెప్పవలె నుండు దివ్యభోజనమా! నిన్ను ఎల్లప్పుడు స్తుతించెడు మంచివారలను పరిశుద్ధులను (=పావన చారిత్రులుగా) చేయుదువుగాక, ప్రకాశించుచున్న దయగలదానవై (=భాస్వత్ దయశాలివై.)

71. ఆత్మకు ప్రకాశమైన సంతోషమును(=స్ఫురత్ ఉల్లాసభరము) ఆత్మకు బలమును నిత్య విశ్వాసమును, గొప్ప పుణ్యమనెడు మహాత్వమును విశాలమైన (=ప్రత్యుగ్ర) ప్రభావము ఇయ్య (=ఈన్) తలంచెడు నిన్ను వేడెదను.

సీ॥ అవనిఁ గ్రియాశాలి యగు మానవుఁడు నిశ్చ । లంబగునట్టి మనంబుతోడ
నక్షయంబైనట్టి మోక్షఘట్టము నెక్క । నూహించి తద్వ్యాప్తి నుండెనేని
యందుకు నొక యుపాయము గలదెట్లన్న । మిత్రుల ఘనమైన మైత్రి దూర
మైనను బాంధవు లలుకఁ బూనిననైన । ధనము హీనంబైన ధరణిధవుల
తే॥ వలన నవమాన మొసఁగినఁ బ్రాణసంక । టామయంబు ఘటించిన నన్వయంబు
దొలఁగిపోయినఁ దొలుతఁ దాఁ దలఁచినట్టి । దీక్ష నదలక పరుని బ్రార్థింపవలయు. 73
గీ॥ సుకృత మధికంబు నొనరించి సుక్రియున్న । కటిని నించుక యగు దురితంబు నేయఁ
బరమునకు శంక యేల వలదు కుండ । నిండిన మధువు నడఁచదే నీరుబొట్టు. 74
క॥ నరుఁ డొక్క కటిని నీష । త్పురితం బొనరించెనేని తోడన దానిన్
నిరసనము సేయవలయున్ । ధరణి మనస్తాపవిధిని ధర్మవిధిజ్ఞా. 75
ఉ॥ అంతట నుండిత్యైన సుకృతాంచితమైన మనంబుఁ బూని దు
ర్భ్రాంతుల నెల్లఁ బో నడఁచి పాపముల న్విడియింపఁగను సి
ద్ధాంతముగాఁ బ్రతిజ్ఞగొని ధర్మహితోక్తులు పల్కుచుం గ్రియా
కాంతుఁడు కావలె న్నరుఁ డఖండపరద్యుతిఁ జెందఁ గోరినన్. 76

వ॥ మఱియు నొక్క విశేషంబు గలదు వినుము, తొల్లి నెల్లలోకమ్ములం బ్రసిద్ధి గాంచిన యగ్ర్యశిష్ట మహానుభావు లానతిచ్చినప్రకారంబు, నరుఁ డించుక కలుషంబు గావించునెడఁ దన్నిమిత్తంబు దుఃఖంబు నొందక దుష్కార్య పరంపరానందిత హృదయుండై లెక్కలకు నిక్కలిదై యెక్కసంబగు కిల్బిషబృందంబు నొనర్చినవానిం గని కోపావేశంబునఁ బిశాచంబునకుం దొలంగుచందంబున సర్వేశ్వరుండు దూరంబుగాఁ జను నది గావున మర్త్యలీలోకంబున దురిత ప్రకరసమాగత దుర్వ్యథాభారంబు నెఱుంగరు. తద్వ్యధానంబు నెఱింగినవారలకు సదాచార్యబోధాప్రవర్ధిత విజ్ఞానలాభంబు సులభంబై యుండఁ జెముత్రోవ నడువనేల పూనెదరు. క్షారపారావారసంబంధంబున మధురం బగు నదీజలంబు తద్గుణంబుం గాంచురీతి ఘనంబగు వృజినంబునఁ బుణ్యం బడఁగుట నిజంబుగాదే, గాఢాంధకారంబున వస్తు పరిశీలనంబు గావింపఁ దోఁపని క్రియ నజ్ఞానకారణంబగు పాపంబున సర్వేశ్వర దయారసప్రాప్త పరమపదం

73. క్రియాశాలి=నేర్పరి । తత్ వ్యాప్తి=ఆ ఆలోచన । మైత్రి=స్నేహము । అలుక బూననైనా=కోపగించినను । ధరణిధవుల=రాజులు । ఆమయము=రోగము । అన్వయము=కులము । దీక్ష=ప్రతిజ్ఞ । పరుని=దేవుని.

74 సత్క్రియలను అధికముగా చేసి కృశించిన కటిని కొంచెము పాపమును చేయు నెడల దేవునికి (=పరమునకు) భయము ఎందుకు అక్కరలేదు. ఒక నీటిబొట్టు కుండనిండిన తేనెను చెడగొట్టదా.

75 ఈషత్=స్వల్ప । నిరసనము=విడిచిపెట్టుటలను । ధర్మవిధజ్ఞా=ఓ ధర్మము తెలిసినవాఁడా.

76. అంతట నుండిత్యున=ఆ పాపములను విడిచిపెట్టిన పిమ్మట । సుకృత అంచిత మైన=మంచి కార్యములచే ఒప్పుచున్న మనంబు । భ్రాంతుల=చెడ్డ ఆశలను । సిద్ధాంతముగా=నిజముగా । ధర్మహిత ఉక్తులు=ధర్మముతో కూడిన మాటలు । క్రియాకాంతుఁడు=మంచి క్రియలచే కాంతిగలవాఁడై ఉండవలెను । పరద్యుతి=మోక్షప్రకాశము.

77. దుష్కార్య పరంపర ఆనందిత=చెడ్డ క్రియలచే ఎడతెగని ఆనందము పొందిన మనస్సుగలవాఁడు । దురిత ప్రకర సమాగత దుర్ వ్యధ=పాపసమూహముచేత వచ్చు చెడ్డ బాధయొక్క భారము । ఎఱుంగరు=తెలియరు । సత్ ఆచార్య బోధ ప్రవర్ధిత=మంచి గురువు అగు జేసువుచేత బోధింపబడి వృద్ధిపొందిన జ్ఞానముయొక్క ప్రయోజనము । క్షారపారావార సంబంధంబున=ఉప్పు సముద్రముయొక్క సంబంధముచే । వృజినంబున=పాపముచేత । గాఢాంధకారంబున వస్తు పరిశీలనంబు గావింప=ఘనమైన చీకటిలో వస్తువు పరీక్ష చేయు నెడల

బ ప్రాప్తంబగు నట్లగుటం జేసి వృజినంబు దుస్సహదుర్గంధాశుద్ధక్రమంబు నుత్పాదిం
చు పైత్యంబు ననుకరించి ప్రబలంబై యుండునందువలన పైత్యరోగవికారంబును వి
దారించుకైవడి దివ్యౌషధగ్రహణంబునఁ దంహస్సంహరణంబు చేసి పరాత్పర కృ
పారసంబునకుం బాత్రుండు గావలయు నట్లగు నేనిం గుమారాఖ్యనిమ్మించు వరుం డన్న
రుని యాత్మయందు స్వీరితుసాంత్వనం బరఁగు తన్మైత్రి నిరంతరంబు సువర్ణభూష
ణంబునందు ఖచితంబగు మాణిక్యంబుపగిది నెడలేక వైరాగ్యంబు నభివృద్ధి నొందిం
చుచుండు. 77

సీ॥ అవనిఁ గ్రియాశాలి యన నొప్పు మనుజుండు। నృతముగా నొక విధి నెమ్మనమున
దృఢమగునట్లు సందేహంబులేక వ। హింపఁగావలయు న దెట్లులనిన
నభవునం దకలంకమగు భక్తి నిల్పుట। మంచి స్నేహమును దక్కించుకొనుట
వరమాత్మునకుఁ జాల భయపడియుండుట। యతని కనహ్యమౌనది వదలుట
తే॥ యిటుల నొనరింప మెచ్చి సర్వేశ్వరుండు। కృపను మన్నించి సుకృతాభివృద్ధి మోక్ష
గరిమ నిడు నిక్కముగ దీని మఱవవలదు। పూను మిదియెల్ల సర్వలోకేష్టానుమతము. 78

క॥ వరునకు భయపడు టెట్లని। కరమడిగెద వేని యతని కల్పనలను సు
స్థిరముగఁ గల్గిన యర్థము। నురుభక్తిం బూని నడవ నూహింపవనఘా. 79

క॥ నరుఁ డా బలమున నింద్రియ। పరవశత నణంచి న్యాయపద్ధతి నడవ
ద్దొరకొనిన దానమేలగుఁ। బరమపదము గల్గకున్న ప్రాజ్ఞవరేణ్యా 80

చ॥ వినుమటు గావునం బరుని విశ్వమయు న్విడిపోని భక్తి నె
మ్మనమునఁ బాదుగా నునిచి మానుగ నొక్క ముహూర్తమాత్రమై
నను వినుతించి యే యెడ ఘనంబగు న్యాయము దప్పకుండినం
దనరఁగ మోక్షమాతనికిఁ దంగెటిజున్నుగదా తలంపఁగా 81

చ॥ వరుని దయారసంబు తనపైని దిరంబుగ నుండునట్లు యే
పురుషుఁడు సత్యవాఙ్నికరభూషణుఁడై చెలువొందుచుండుఁ ద
న్నరుఁ డొకవేళ నొక్క వృజినం బవశస్థితిఁ జేసిన న్సదా
దరణను వాని మోక్షమును దార్కొనఁ జేయఁడె యీ ఘనుం డొగిన్. 82

అదికనపడని విధముగా। సర్వేశ్వర దయారస ప్రాప్త=దేవుని దయారసముచే కలుగు మోక్షము అప్రాప్తము అ
గును। దుర్ సహ దుర్గంధ అశుద్ధక్రమము ఉత్పాదించు=సహింపరాని చెడ్డ వాసనయొక్క అశుద్ధక్రమము గలుగ
గచేయు పైత్యము అనుసరించి। పైత్యరోగవికారంబును విదారించుట కైవడి=పైత్యము అనెడు రోగము పో
గొట్టు విధముగా। అంహస్సు సంహరణము చేసి=పాపము పోగొట్టి। కుమార అఖ్యన్ మించు=కుతుడు అను పే
రుతో ఒప్పుచున్న సర్వేశ్వరుడు। అనఘరగు తత్ మైత్రి=స్విరితుసాంత్వవు అన ఒప్పెడు అతని స్నేహము। సువర్ణ
భూషణంబునందు ఖచితంబగు మాణిక్యంబు పగిది=బంగారు ఆభరణమందు నిర్మింపబడిన రత్నము వలె.

78. క్రియాశాలి=నేర్పరి। ఒక విధి=నేమము। అభవునందు=దేవునియందు। దక్కించుకొనుట=ఉంచుకో
నుట। సుకృతాభివృద్ధి=సుకృతములయొక్క పెంపు। ఇడు=ఇచ్చును.।

80. పరవశత=ఇంద్రియములయొక్క ప్రభుత్వము। దొరకొనిన=పూను నెడల। ప్రాజ్ఞవరేణ్యా=తెలివిగల
వారలలో శ్రేష్ఠుడా.।

81. విశ్వమయుని=దేవుని। ఒక ముహూర్తమాత్రమైనను=ఒక ఘడియైన। యే యెడ=ఎట్టిచోటనైన।
తంగెటి జున్ను=యెట్లు తంగెటి జున్ను తేలికగా దొరకునో ఆ విధముగా మోక్షము అతనికి సులభముగా నగును.

82. సత్యవాక్ నికర=సత్యవాక్యము అను శ్రేష్ఠమైన భూషణము గలవాడై। వృజినము=పాపము।

వ॥ సర్వేశ్వరునకు నసహ్యంబగు కార్యంబుగాఁ జల్పుచు, నతనికి వెఱవక ప్రథమగురుమణికల్పిత కల్పనార్థంబును వ్యర్థంబుగాఁ దలంపుచు దుష్టేంద్రియ వ్యాపారపారావారమగ్నుండై దురాశాపాశంబులఁ గట్టువడి యుండు నరుండు పరాత్పరేష్టప్రసాదంబున కనర్హుండగు నది గావున న్యాయానుసారియై సత్కార్యకరణుండై జగత్కర్త యనం బరఁగు కైవల్యనాథుని యఖండంబగు మహత్త్వము భావించు నతండు తత్ప్రసాదంబునకుఁ బాత్రుండై యోగ్యంబగు భాగ్యంబు ననుభవించు నిందుకు సందేహంబులేదు వినుము. 83

క॥ మును నాచే నచియింపఁబ।డిన దేవభయంబు తనదు డెందంబునఁ గ
ల్గ నుపాయ మొకటి గల దది।వినుపించెద వలయుఁ బరుని వినుతి యొనర్పన్. 84

ఆ॥ సర్వశక్తియుక్త సర్వలోకస్రష్ట।సర్వలోకనాథ సర్వవేద
సముదయాభివేద్య సర్వేశ్వర భవద్వి।లాస మెన్న మనుజులకు వశంబె. 85

ఆ॥ దేవ భవదనంత దివ్య దయారస।భావమహిమవలనఁ బాపములకు
వెఱవునొందఁ జేయవే యింకనైన న।న్నవగుణుండటంచు దవులనిడక. 86

క॥ ఘనతర సుకృతాధారం।బును నై దేవప్రసాదమున కవనంబై
పెనుపొందు భయము నస్మ।న్మనమునఁ దిరముగ ఘటింపుమా కృపవలనన్. 87

క॥ నరులకు వెఱవక సర్వే।శ్వరునకు భయపడుమనుచు భవత్తనయుండౌ
గురుఁడానతి యిడె నవ్విధి।స్థిరముగ నా మదిని నిలువఁ జేయుము వేగన్. 88

చ॥ నరుఁడొకవేళ నెమ్మది ఘనంబుగఁ గోపముఁ బూనెనేని ని
ష్కరుణమెయిన్ శరీరమును ఖండన సేయునె కాని ఘోరమౌ
నిరయము నొందఁ జేయఁగను నేరఁడు; నీదగు కోపమెంతయు
న్నరక పథంబుఁ గూర్చు నిది న్యాయము గావున నా మనంబునం
దరమరలేని నీయెడ భయంబును జెందఁగఁ జేసి కావవే. 89

సీ॥ అఖిల జగత్కర్తవైన సర్వేశ్వర।ననయమ్మునట్టి నా మనవివలన
సదయుఁడవగుచు నా హృదయంబు నీయెడ।వెఱచి యుండఁగఁ జేయవే మహాత్మ
భవదనుకంపాప్రభావపాత్రులు దక్క।నన్యులు మట్టులేనట్టి నరక
పదమునందుండుట విదితమైనందున।ముందుగా నిను వేఁడుకొందు నేను

అవశస్థితి=వశములేక। సత్ ఆదరణను=మంచి ప్రేమచేత। కాంక్షన=పొంద।

83. ప్రథమ గురుమణి కల్పిత కల్పనార్థంబు=యేసుసాధుడు కల్పించిన కల్పనల భావమును। దుష్టేంద్రియ వ్యాపారపారావారమగ్నుండై=ఇంద్రియముల పని అనెడు సముద్రములో మునిగి। న్యాయానుసారియై=న్యాయము అనుసరించి। కైవల్యనాథుని=దేవుని।

84. పరుని వినుతి యొనర్పన్ వలయును=దేవుని ప్రార్థింపవలయును.

85. సర్వశక్తియుక్త=సర్వశక్తిగలవాడా। స్రష్ట=కలిగించినవాడా। సర్వవేదసముదయ అభివేద్య=సర్వవేద సమూహముచేత తెలిసికొన తగినవాడా

86. దేవ=దేవుడా। అవగుణుండటంచు=నన్ను చెడుగుణములు గలవాడని దూరముగ నుంచక।

87. అవనంబై=కాపాడునదై। అస్మత్ మనమున=నామనమున।

88. భవత్ తనయుండౌ=నీకుమారుడైన గురుదేవుడు। అవ్విధి=ఆ విధమున

89. నెమ్మది=మనస్సునందు। నిష్కరుణమెయిన్=కరుణలేకుండ। నిరయము=నరకము। కూర్చున్=ఇచ్చును। అరమర=సందేహము.

తే॥ భ్రమను నేఁ జేసినట్టి పాపముల గముల । నణఁచి మేలైన సుకృత కార్యములు నలుపఁ
గా నొనర్చితి రభయప్రదానమిదియ । గాఁగ మది నెంచి తరియింతుఁ గను ముదమున 90
తే॥ అనుచు నీరీతి సన్నుతించినఁ బరేశుఁ । డఖిల తేజః ప్రకాశితుండైన ఘనుఁడు 91
దురితములఁ జెందఁగా నీక గురుతరైక । మోక్ష భాగ్యంబు నొసఁగుఁ బ్రమోదమునను
సీ॥ అదిగాక సత్క్రియాస్పదుఁ డౌక మనుజుండు । శాంతంబుగాఁ బుణ్యవంతుఁడగుచు
నుండఁ దలంచిన నురుతరవిజ్ఞాన । సరణి నాత్మను ఘోర దురితబృంద
మును నంటనీయక వినయుఁడై కొంచెపుఁ । గలుషంబునైనఁ దొలఁగవలయు
నీషదఘంబున నేమగునని తల్ప । ధరణి నంతర్గత జ్వరము పగిదిఁ
తే॥ పెనఁగి యాత్మకు దుర్బలంబును ఘటించుఁ । బుణ్యములు సేయుటకు బుద్ధి పుట్ట నీదు
గాన మరణంబునకు భయము మాను విధని । సృజనమునకు దృఢంబుగా నెంచవలయు వెలినటోవ్వ. 92
ఉ॥ కించిదఘంబటంచుఁ బరికించుచు నిల్వఁగఁగూడ దగ్ని గాను
కించుకయైన మహాటవుల నెన్నిటిఁ గాల్చునొ తద్విధంబు దా
నెంచుచు దానినయ్యెడ సహింపక ద్రోల్చుచు ధర్మసంచయం
బంచితబుద్ధి సేయఁ బరమాత్ముని స్నేహము గల్గు మించఁగన్. 93
క॥ ఒక ధర్మకార్యమును జే । యక కాలము నుత్తరించు టది బహుళంబై
న కలుషమని యానతి యిడి । రకలంకత రార్యశిష్టు లనఁదగు మనుజుల్. 94
సీ॥ ధర్మహీనముగాఁగ దాఁటుకాలము నను । స్థానములకుఁ దల్లి యగుచునుండు
నది యెట్లనినఁ దల్లియందు బిడ్డలు పుట్టి । తల్లిచే మిగుల వర్ధిల్లురీతి
వ్యర్థకాలమున సంభవమంది దానన । పెరుఁగుచుండును ఘోర దురితబృంద
మట్లగు పెఱిఁగి క్రియాశాలులైన మ । హాత్ముల నిర్ణయం బాత్మయందు
తే॥ గాఢమగునట్లు నిల్పి సత్కార్యకరణ । మున గడపఁగవలెయుఁ గాలమును వివేక
సహితమానసుఁడగుచు నే జనుఁ డటువలెఁ । జలుపునతఁడు ఘనుండన జగతి బరఁగు. 95
వ॥ దివ్యగురుం డనందగిన జేసునాథస్వామి సన్నిధానంబు నిధానంబుగా నభిలషించి, తదంఘ్రి యుగళ కమల సేవయే యుద్యోగంబుగా భావించి, తద్విగ్రహాభిముఖ స్థుండై నిలిచి, యమ్మహానుభావుండఖిల నరుల సంఘాతంబును నిగ్రహింపం దలం

90. నయమైన=న్యాయమైన । భవత్ అనుకంప ప్రభావ పాత్రులు=నీ దయయొక్క ప్రభావమునకు పాత్రులుగా నుండువారలుగాక । భ్రమను=భ్రాంతిచే । అభయ ప్రదానము=శరణు ఇచ్చుట । తరియింతు=ముక్తి పొందుదును.

91. గురుతర ఏక=మిక్కిలి గొప్ప ముఖ్యమైన ।

92. సత్క్రియాస్పదుడు=సత్క్రియలకు స్థానమైన వాడు । శాంతంబుగా=పూర్తిగా । ఉరుతర=గొప్ప జ్ఞానముయొక్క సరణితో । ఈషత్ అఘము=స్వల్పపాపము । అంతర్గత జ్వరము పగిది=లోజ్వరమువలె । పెనగి=అభివృద్ధి పొంది ।

93. ఇంచుక=కొంచెము । ద్రోల్చుచు=విడిచిపెట్టుచు.

94. కాలము ఉత్తరించుట=వ్యర్థముగా పుచ్చుట । బహుళంబైన=అధికమైన । అకలంకతర=మిక్కిలి పరిశుద్ధులు ।

95. సంభవము=ఉత్పత్తి । సత్కార్యకరణమున=సత్కార్యములను చేయుటయందు

96. నిధానంబుగా అభిలషించి=జేసునాథుని సన్నిధానము నిక్షేపమువలె ఆశించి । తత్ అంఘ్రి యుగళ కమల=పద్మములు అనెడు అతని రెండు పాదముల సేవ । తత్ విగ్రహ అభిముఖస్థుఁడు=అతని స్వరూపమునకు

చి, యొనరించిన కార్యమ్ముల ననవార్యమ్ముగా స్తోత్రంబు గావించి, వారు జగత్సంచారంబు సేయుచు నిద్రాహారమ్ములకుం దొలంగి బహువిధ ప్రసంగ సంఘమ్ముల ప్రచయించి నిజశిష్యవర్గమ్ములకు బోధించిన బోధావిధానం బెంతయు స్వాంతంబున నిడుకొని, వివేకయుక్తుండవై సోమరితనంబును దూరంబుగాఁ దొలంగింపవలయు నట్లయినఁ గృతార్థుండగు దానం జేసి నిర్మాత్సర్యంబును నిష్కాలుష్యంబును నిర్వ్యసనంబును నిరహంకారంబును నిశ్శాత్రవంబును గలుగు. సర్వేశ్వరుం డుదారకారుణ్యరసావేశంబున సంరక్షించు నీ వృత్తాంతంబు సాంతంబుగా నీ హృదయంబున నుంచుము. 96

క॥ సర్వేశ్వరు నుతుఁడవై యీ । యుర్వర జనియించి సద్గురూత్తముఁ డనఁగా
నిర్వాణఫలదుఁ డనఁగా । సర్వమునకుఁ గర్త యనఁగ స్వామి యొసంగెన్. 97

సీ॥ అలరిన జీసునాథాచార్యమణి మున్ను । గష్టపడ చేసిన కార్యములను
బలుమారు గావింపఁ బొలుపారిన జనుం । డపవర్గ భాగ్యంబు నందలేఁడు
స్వామి కైంకర్యంబు సోమరితనమున । నొనరించు నతఁడు తద్ఘనకరుణను
జెందనేరఁడు దాన మందబుద్ధియు ధర్మ । నాశనం బొదవు దుర్నయము పెరుఁగు
తే॥ నట్లగుట నశ్వరంబగు దీక్ష నాత్మయందు । స్థిరము గావించి గురునాజ్ఞ శిరమునందు 98
మోచి వర్తించు మనుజుండు ముఖ్యుఁడగు క్రి । యార్హుఁడని యార్యశిష్టవారాళి నుడిరి.

చ॥ అసదృశమైన మేలు మది నాసపడంగనె యెట్లు గల్గు, దు
ర్వ్యసనముఖోగ్రపాపములఁ బాయక యింద్రియపారవశ్యము
న్మసయును గోపము న్విడక మానసమాంద్యము నొంచకన్ దయా
రసమును సూనృతవ్రతముఁ బ్రాజ్ఞగురూత్తమ సేవఁ బూనకన్. 99

క॥ సోమరితనమును విడి తే । జోమయు నద్వయుఁ బ్రసిద్ధు శ్రుత్యంతనుతో
ద్దాము నభవు సర్వేశ్వరు । నే మనుజుఁడు దలఁచు నతఁడు హితుఁ డతని కగున్. 100

క॥ అహరహము సద్వ్రతమునకు । బహు విఘ్నము లొదవుచుండుఁ బొల్పడి దానం
దహతహపడక మనోధృతి । వహుఁడవై వర్తించు టొప్పు వనధిగభీరా. 101

చ॥ జగతి నతిప్రయాసమున సౌఖ్యము యుద్ధముచే జయంబు న

---

యెదుట నిలిచి । సంఘాతమును నిర్వహింప=సకల మనుష్యుల సమూహము కాపాడునది । ఒనరించిన=దేవుడు చేసిన కార్యములను అడ్డగింపలేని విధముగా స్తోత్రము సలిపి । నిష్కాలుష్యమును=దోషములేనిది । నిశ్శాత్రవంబును=పగలేనిది ।

97. ఉర్వర=భూమి । నిర్వాణఫలదుడు=మోక్షఫలమిచ్చెడువాడు

98. పొలుపారిన=అడ్డ చేసిన । ఒదవును=పుట్టును । దీక్ష=పట్టుదల । క్రియార్హుడు=గొప్ప పనులకు తగినవాడు ।

99. అసదృశమైన మేలు=అసమానమైన మోక్షము । దుర్వ్యసన ముఖ ఉగ్ర పాపములను=చెడుగుణము మొదలైన గొప్ప పాపములను విడిచిపెట్టక । ఇంద్రియ పారవశ్యము=ఇంద్రియములకు లోబడి । మస=వేడుక । మానసమాంద్యము=మనస్సు మందముగా నుండుట । సూనృతవ్రతము=సత్యవ్రతము । ప్రాజ్ఞ గురూత్తము=తెలిసిన జీసునాథుని యొక్క—

100. తేజోమయుని=తేజస్సుగలవాని । అద్వయుని=సాటిలేనివాని । ప్రసిద్ధు=ప్రసిద్ధిగలవాని । శ్రుత అంత నుత ఉద్దాము=వేదగ్రంథములలో నుతింపబడిన గొప్పవాని । అభవును=పుట్టుకలేనివాని ।

101. సత్ వ్రతమునకు=మంచి ప్రతిజ్ఞకు । దానం పొల్పడి తహతహ పడక=దానికి లోబడి వ్యాకులము పడక । వహుడవై=గలిగినవాడవై । వనధి గభీరా=ఓ సముద్రమువలె గంభీర్యముగలవాడా.

య్యగణిత తేజ దుఃఖమున హర్షము నొంది చెలంగుఱీతి నెం
చఁగ విజితేంద్రియత్వమున శాశ్వతమైన పరేశు సత్కృపం
దగఁ బడయంగవచ్చు నిది తప్ప నుపాయము గల్గ దెన్నటన్. 102

వ॥ ఫలహీనంబగు నిలారుహంబు సమూలంబుగా ఖండించి వైశ్వానరునకు వైచుట కర్హంబగు చందంబునఁ బుణ్యహీనుండగు మానవుండు పరాత్పరు నమర్షంబున దూషింపంబడి ఘోరంబగు నిరయంబునం బడియుండు నీ క్రమంబు మనంబున సువ్యక్తంబుగాఁ దలంచి యుండుట మోక్షసాధ్యంబని విజ్ఞానవృద్ధులు పలుకుదు రప్పలుకుల యర్థలాభంబు సులభంబై యుండ నరుండు చేయు ప్రయత్నం బోవ నేటికి కదియునుం గాక. 103

క॥ సోమరితనమున కర్థం । బేమని నీ వడిగెదేని నెఱిఁగింతుఁ బరం
ధామార్చనమునఁ బుణ్య । స్తోమము నొనరించు నెడల సుస్థిరబుద్ధిన్. 104

క॥ రుచి గలుగక యుండుటయును । సుచరిత్రులనంగఁ బరఁగు సూరిజనుల స
ద్వచనములవినమియుఁ బాప । ప్రచయవిధి నాశ నిల్ప భావించుటయున్. 105

సీ॥ అట్టి సోమరితనం బధిక క్షయామయ । రీతినుండు నటంచు నీతి మెఱయఁ
దలపోయవలెఁ జుమ్ము తద్రోగమునఁ బుణ్య । సంచయం బేరీతిఁ జలుపనోపు
ధ్యానంబును జపంబు జ్ఞానప్రసంగరం । గత్పుస్తకములు నకరణిఁ గాంచు
నార్తిమైఁ బావసంకీర్తనం బెటు సేయఁ । బూనియుండు మఱియు దీనివలన
తే॥ సమరు పెద్దలమీఁదఁ గోపమును భయము । దైన్యమురుచియు బుద్ధిమాంద్యమ్ము నివియు
మొదలుగాఁగల చేటులు మోక్షరాజ్య । మెటులు సాధించు సత్ఫలం బేమి దాన. 106

వ॥ అది గావున. 107

చ॥ స్థిరతర వృత్తిఁ బుణ్యములు చేయుతటి న్విపరీతమైన సో
మరితన మెంతయు న్వదలి మానవుఁ డెవ్వఁడు నిల్చువాఁడె పో
పరమవివేకి శిష్టజనబాంధవుఁ డప్రతిమానయోగి స
ద్గురువరముత్కరుండు భవదూరుఁడు మోక్షఫల ప్రసక్తుఁడున్. 108

తే॥ తాను ధర్మకార్య తత్పరుం డగునెడఁ । బెనఁగు బుద్ధిమాంద్యమును హరింప

102. ఆ అగణిత తేజ=అమిత మహిమగలవాడ దుఃఖముచేత । విజితేం॰ జయింపబడిన ।

103 ఫలములేని చెట్లు వేరులతో (=నిలారుహము సమూలముగా) కొట్టివేసి అగ్నిలో (=వైశ్వానరు నందు) వేయబడుటకు తగిన విధమున పుణ్యములేని మానవుడు దేవునియొక్క కోపముచే (=అమర్షమున) నిందితుడైనవి । ఆ పలుకుల యర్థలాభము=ఆ మాటల యర్థముయొక్క ప్రయోజనము.

104. పరంధాముడు=దేవుడు ।

105. సుచరిత్రులు=అత్యంత శిష్టవారలు । సూరిజనుల=తెలివిగలవారలయొక్క । సద్వచనాలు=మంచి మాటలు । పాప ప్రచయ విధి=పాపముయొక్క సమూహముమీద ఆశ నిల్పుట.

106. క్షయ ఆమయ రీతి=క్షయము అనెడు రోగమువలె । తద్రోగమున పుణ్య సంచయంబు ఏ రీతి చలుప నోపు=అట్టి వ్యాధి ఉండునెడల ఎట్లు మనుష్యుడు పుణ్యసమూహము చేయ జాలును । జ్ఞానప్రసంగరంగత్=జ్ఞానబుద్ధితో ఒప్పుచున్న పుస్తకములు । ఆర్తిమై=దుఃఖముతో । బుద్ధిమాంద్యము=బుద్ధి మందముగా నుండుట.

108. పో=సుమ్మీ । శిష్టజన బాంధవుడు=మంచివారలకు ఒప్పినవాడు । అప్రతిమానయోగి=సమానము లేని పుణ్యాత్ముడు । సద్గురు వరము ఉత్కరుడు=యేసునాథుని వరముల సమూహము పొందినవాడు । భవదూరుడు=పాపములేనివాడు । ప్రసక్తుడు=మోక్షముగురించి మాటాడువాడు ।

109. ధర్మకార్య తత్పరుండు=ధర్మకార్యములందు మునిగినవాడు । పెనగు బుద్ధిమాంద్యమును హరింప=

విశ్వభర్త యగుచు వెలయు శ్రీసర్వేశ్వ।రుని నుతింపవలయు మనుజుఁ డధిప. 109

వ॥ అది యెట్లనిన. 110

సీ॥ విశ్వలోకేశ సర్వేశ్వర నిను నేను। వేమఱ చెలువొంద వేఁడుకొనెదఁ
గరుణ పెంపొంద నాకర్ణింపు మాదృశ। జ్ఞానహీన జనావన వ్రతాభి
లాష మింపొంద నిలాతలంబున మను।ష్యావతారము నంది భావమలర
మించి ముప్పదియేండ్లు సంచార మొనరించి। సత్యవేదార్థసాంగత్యరీతి
తే॥ నిఖిల ధర్మప్రసంగముల్ నిర్ణయించి। పంచజనులకు బోధ గావించి వారి 111
నెలమి మోక్షార్హులుగఁ జేసి వెలయు నీప్ర।భావ మెవ రెన్నఁగలరు ప్రజ్ఞావిధమున.

మ॥ భవదీయ ప్రతిభా విలాసగరిమ వర్ణింపఁగా నర్చ్యశి
ష్టవరేణ్యానుమతి న్వహింపఁగను దోషవ్రాతముం ద్రుంప స
త్యవచస్సంగతి గాంచ దుర్వ్యసనమున్ దండింపఁగాఁ జేసి ప్రో
వవె పుత్రు న్నను నేర మెంచకను సద్భావంబుచే నుండఁగన్. 112

ఉ॥ వరదుఁడ నీ ప్రసాదమను వహ్నిని నా మది నిండి జ్ఞానముం
గరమణఁగించు మాంద్యమను కాననమున్ దహియింపఁ జేసి స
త్పురుషవరావనం బగుచుఁ బొల్పు వహించు భవచ్చరిత్రమున్
స్థిరముగ సన్నుతింప దయచే నొనరింపుము నీకు మ్రొక్కెదన్. 113

మ॥ ధరణి న్మన్న భవత్ప్రభావమును మోదం బొప్ప వర్ణించి యా
నరులెల్ల న్నినుఁ జేరి మోక్షకథితానందంబునన్ ధీయుతులై
పరలోకంబున నిల్చినారనుచు దీప్యద్ధర్మసూత్రమ్ము సు
స్థిరరీతిం బలుకంగ వింటి నిపు డక్షీణానురాగంబునన్. 114

ఉ॥ అందున నా మనంబున మహాశ జనించె దయాబ్ధివైన నీ
చందము తేటగాఁ బరఁగె శాశ్వతమై తగు వైభవంబునం

---

ముట్టుకొనెడు బుద్ధియొక్క మందము పోగొట్టుటకు.

111. మాదృశ జ్ఞానహీన జనావన=నావంటి జ్ఞానములేని జనులను రక్షించువాడా। వ్రతాభిలాష మింపొంద నిలాతలంబున=వ్రతములందు కోరిక ఇంపు పొందగా ఈ లోకములో। సత్యవేద అర్థ సాంగత్యరీతి=సత్యవేదముయొక్క అర్థముతో కూడిన కల్పనలను। పంచజనులకు=సకల మనుష్యులకు.

112. నేను నీ ప్రభావ ప్రేమయొక్క గొప్పతనము (=భవదీయ ప్రతిభావిలాసగరిమ) వర్ణించుటయు, అర్చ్యశిష్టవారల శ్రేష్ఠుడగు దేవసాధుని చిత్తమును (=అర్చ్యశిష్టవరేణ్య అనుమతి) వహించుటయును, పాపసమూహమును పోగొట్టుటయును (=దోషవ్రాతము త్రుంప) సత్యవచనములతో సాంగత్యము చేయుటను (=సత్యవచః సంగతి గాంచ) చెడ్డ వ్యసనము తొలగింపను జేసి (=దుర్ వ్యసనము దండింపగా జేసి) నేను చేసిన నేరములను తలంపక నేను మంచి హృదయముతో నుండునట్లు (=సద్భావంబుచే నుండగా) నీ పుత్రుడైన నన్ను ప్రోవవా.

113. వరముల నిచ్చెడువాడా (=వరదుడ) నీ దయ అనెడు అగ్నిచేత (=వహ్నిని) నా మనస్సున నిండి, జ్ఞానమును పూర్తిగా (=కరము) అణగించు బుద్ధియొక్క మందము (=మాంద్యము) అనెడు అడవి కాల్చి నశింప (=కాననము దహింప) చేసి మంచివారలకు రక్షణమైనట్టియు (=సత్పురుషవర అవనము) సొంపు కలిగినట్టియు (=పొలుపు వహించు) నీ నడత (=భవత్ చరిత్రము) నేను సన్నుతింపగా దయతో నొనరింపుము.

114. మోక్షకథిత ఆనందము=మోక్షములో దొరకెడు సంతోషముచే। దీప్యత్ ధర్మసూత్రము=ప్రకాశించు వేదగ్రంథములలోని వాక్యము। అక్షీణ అనురాగమున=నిండు ప్రేమతో.

115. దయాబ్ధివైన నీ చందము తేటగా పరగె=దయా సముద్రమువంటి నీ నడవడిక నాకు తేటగా కనబడుచున్నది.

జెండఁగఁ జేతు పీవనుట సిద్ధమటంచును నమ్మినాఁడ నా
పందెము గెల్వఁ జూడుము నెపమ్ములు నెంచక యో పరాత్పరా. 115

తే॥ అనుచు సన్నుతింప నజ్ఞాన గాఢాంధ । కారమడఁగు సద్ఘృణారసమునఁ
బరుఁడనంతుఁ డతుల భాగ్యకారణమైన । మోక్షమును నొసంగు ముదముతోడ. 116

సీ॥ అదిగాక సకల పుణ్యములకు ముఖ్యమై । పరఁగు సర్వేశ్వర భక్తి వినుము
తద్భక్తి నాత్మ నిశ్చయమ్ముగ నిల్పిన । నెనలేని విజ్ఞానమునకు బలము,
కల్పనార్థము తెలుపంగఁగఁ జేయు ప్రజ్ఞయు, । స్వాంతారినికర భంజనము, ఘోర
నరక కారణ వృజిన ప్రకాశనమును । బరమపదేశు సంబంధనియతి

తే॥ దనరు మోక్షకవాటభేదన విధంబు । నతుల మైనట్టి యర్చ్యశిష్టాఖ్య పెంపు
గలుగఁ జేయునటంచు రంగత్ప్రతిజ్ఞ । నాదగుచుఁ దానతి చ్చె సత్యంబు గాఁగ. 117

సీ॥ రూఢిమై సర్వేశ్వరునియందు సద్భక్తి । గల్గి తత్కల్పితకల్పనార్థ
మునఁ బ్రవర్తించుటయును దన్ను గుఱి చేసి । నట్టి ప్రత్యర్థుల నెత్తుఁ దగుచు
నుండుటయును దప్ప నొక రీతియగు దయ । చేసిన ప్రత్యర్థుల స్నేహఋణము
దీర్పఁ గార్యమ్ములు త్రివిధమ్ములై యుండు । వారలకును వారి బాంధవులకు

తే॥ వారి బహుమానమునకును వంచనంబు । నొప్పకుండుట కపటంపు సఖ్యమును ర
చింపకుండుట పరమాత్మ సేవవలన । మించిరని వారి సారి నుతించుటయును. 118

వ॥ అది నిమిత్తంబుగా పరులయెడల సఖ్యంబు ముఖ్యంబుగా గ్రహించవలెనని తలంచిన యతండు పరిశుద్ధుఁడగునని యర్చ్యశిష్టాగ్గానందులానతిచ్చినప్రకారం బిది సత్యవేద సమ్మతంబగుం గావునఁ గ్రియాగ్రాండు దీని నసభక్తిహృదయుండై యాచరింపవలయు, దాను సర్వేశ్వరానుగ్రహపాత్రుండఁ గావలయునని వారలఁ బ్రార్థింపవలయును. 119

క॥ ఘనుఁడగు పరుని కృపారస । మును గోరు నతఁడు నిత్యమును దడఁధీరుం
గొనియాడవలయు నెట్లన । వినిపించెద నీకు దాని విధ మేరువడఁగ. 120

సీ॥ శాశ్వతైశ్వర్య సర్వేశ్వర విజ్ఞాన । రహితుని నన్గృపారసమువలన
మనుచుట కిపుడొక మనవి గావించెద । నవధరింపుము ప్రేమ నవనియందు

116. సత్ ఘృణారసమునఁ=దయారసముచేత । పరుఁడు అనంతుఁడు=మితిలేనివాఁడైన దేవుఁడు ।

117. తత్ భక్తి=ఆ దేవస్నేహముచేత । ప్రజ్ఞ=తెలివి । స్వాంత అరి నికర భంజనము—మనశ్శత్రువుల నాశనము । నరక కారణ వృజిన ప్రకాశనమున=నరకమునకు కారణమైన పాపము తెలిసికొనుటకు తెలివిని । పరమపదేశు సంబంధనియతి=దేవునితో కలిసి పోవుటకు నియమము । మోక్ష కవాట భేదన విధంబు=మోక్షపువాకిలి తెరచెడు విధము । అర్చ్యశిష్టాఖ్య పెంపు=అర్చ్యశిష్ట అను నామము యొక్క గొప్పతనము । రంగత్ ప్రతిజ్ఞ=ప్రకాశించెడు ఇష్టముతో ।

118. దృఢముతో (=రూఢిమై) దేవునిమీద స్నేహము కలిగి అతడు కట్టడ చేసిన కల్పనల యొక్క యర్థముల ప్రకారము (=తత్ కల్పిత కల్పన అర్థమున) నడచుటయును, తనమీద నమ్మకము ఉంచిన (=గుఱి చేసిన) పరులకు స్నేహితుడై యుండుటయు ఈ రెంటిని ఒక విధమైన దయతో చేసిన పరుల స్నేహము అనెడు ఋణము తీర్చుటకు మూడు విధములైన కార్యములు కావలెను: ప్రత్యర్థులకును వారల బంధువులకును వారల సొత్తునకు చెడుగు చేయక యుండుటయు కపట స్నేహము చూపింపక యుండుట (=సఖ్యమును రచింపక యుండుట) దేవునివలన (=పరమాత్మ సేవవలన) ప్రత్యర్థులు గొప్పవారైరని (=మించిరని) తలంచి వారలను ఎల్లప్పుడు (=సారి) ప్రేమించుటయు.

119. సత్యవేద సమ్మతంబగును=వేదము ఒప్పుకొనినది అగును.

మనుజులచే నీకుఁ బని గల్గకుండిన। నెనరు వారలమీఁద నీకొదవుట
వింటి నా మది నిల్పుకొంటి వాంఛ నొకటి। పలికెద ననఘ మత్స్వాంతమునను
తే॥ బదిలమగునట్లు నీమీఁద భక్తి నిలుపఁ। గా భవత్కల్పనల మీఱకయు నటింప 121
నిన్నుఁ జూచి ప్రత్యులనెల్ల నెమ్మిఁ గొలువఁ। జేసి రక్షింపవలెఁ జుమ్ము వాసి యొసఁగ.
క॥ అపకృతి చేసినవారల। కుపకారము చేయునట్టి యూహ మదాత్మం
బునఁ గలిగింపుము ప్రముఖ్యుఁడ। నపరాధము లెంచవలవ దఖిలసమాఖ్యా. 122
వ॥ అని వినుతింపవలయును. 123
సీ॥ సర్వేశ్వరునిగూర్చి సజ్జనులెల్లరు। భువిఁ జేయఁ దగినట్టి పుణ్యములను
బదిటికి నిన్ను దేర్పాటుగాఁ దెల్పెద। నేకచిత్తమునఁ బరేశుమీఁది
భక్తిని నిల్పుట పాపసంగతమగు। పని మానియుండుట పరుని మహిమ
నెన్నుచు నాతని సన్నిధి నొదుఁగుట। ప్రత్యులయఘమున వ్యసనపడుట.
తే॥ అడుగడుగునకుఁ బరుని దయాను దలఁచుట। తన్నిమిత్తంబు నతని స్తోత్రము చలుపుట
యతని యాజ్ఞను నడువ జాగ్రత నెసఁగుట। విమలభావంబు ధర్మకార్యముల నిడుట. 124
ఆ॥ తనకు వలయు మేలు నొసగూర్చునని యాత్మ। నమ్మహానుభావు నమ్మియుంట
శరణ మీవటంచుఁ బరమాత్మునర్థిన స। ర్వేశ్వరుని స్మరించి వేఁడుకొనుట. 125
వ॥ అదియునుంగాక శాశ్వతైశ్వర్యధురీణుండగు సర్వేశ్వరు స్వయంకృత పుణ్యాగణ్యఫలా
వాప్త్యర్థంబు సార్థకములగు వచనమ్ములం బ్రార్థింపవలయు నెట్లనిన, నాదిమధ్యాం
తరహితుండవగు దేవుండవు, తేజోమయుండవు సకలలోక జనకుండవు, మహాత్మా!
సకలచేతనసంఘాతోగ్రపాతకహరణార్థంబుగా మన నాథుండన మించిన జేసునాథు
ని చరణసరసీరుహయుగళ భక్తిని నా మనంబున ఘనంబుగా నిలువ నొనరింపుము. భ
వత్కల్పిత కల్పనానల్పతరార్థంబు నామ్రేడితంబుగా మదీయ చేతఃస్థలంబున నుచ్చరిం
ప ననుసంధింపుమని స్తవంబొనర్చిన యతండు క్రియార్హుండ నంబరఁగు నుతియును. 126

121. శాశ్వతైశ్వర్య=నిత్యమైన భాగ్యముగల దేవుఁడా। నీకు పని కలుగక=మనుష్యులచే నీకు ప్రయోజనము కలుగక యుండినను। మత్స్వాంతమునను... మొదలైనవి=నా హృదయములో నీమీఁద స్థిరమైన భక్తి నిలుచుటయును, నేను నీ కల్పనలను మీరక నడచుటయును, నేను నీ నిమిత్తము సకల మనుష్యులను ప్రేమతో స్నేహించను చేయుండి.

122. ఊహ—తలంపు। అఖిలసమాఖ్యా=సమస్త కీర్తిగలవాఁడా.

124. సర్వేశ్వరునిగూర్చి...... మొదలైనవి=దేవుని నిమిత్తము చేయవలసిన పుణ్యములలో పదింటికి అర్థము చెప్పెదను। పాపసంగత మగు పని=పాపముతో కూడిన పని। పరుని మహిమ..... మొదలైనవి=దేవుని మహాత్మ్యము తలంచి అతని సన్నిధిలో నుండుట। ప్రత్యుల యఘము=మనుష్యులు చేసిన పాపము నిమిత్తము దుఃఖపడుట। విమల భావంబు=శుద్ధమైన అభిప్రాయము ధర్మకార్యముల=పుణ్యకార్యములందు ఇడుట=పెట్టుట.

125. తనకు వలయు మేలు=తనకు కావలసిన మేలు ఒసగూర్చునని=చేకూర్చునని ఆత్మలో దేవుని నమ్ముట.

126. శాశ్వతైశ్వర్య ధురీణుఁడు=మితిలేని ప్రభావము ధరించినవాఁడు। స్వయంకృత పుణ్య అగణ్యఫలావాప్తి అర్థంబు=తాను చేసిన పుణ్యముల యొక్క ఫలములను పొందుటకొరకై। సార్థకములగు=మంచి అర్థముగల వచనమ్ముల=మాటలతో। తేజోమయుఁడవు=తేజము కలిగినవాడవు। సకల చేతన సంఘాత ఉగ్ర పాతక హరణ అర్థంబుగా=సకల మనుష్యుల సమూహముల భయంకర పాపముల పోగొట్టుటకొరకై। చరణ సరసీరుహయుగళ భక్తిని=పాదములనెడు పద్మములమీఁది భక్తిని। భవత్ కల్పిత కల్పన అనల్పతర అర్థంబు=నీచే కల్పింపబడిన కల్పనల మిక్కిలి గొప్ప అర్థములను। ఆమ్రేడితముగా మదీయ చేతఃస్థలమున=అనేక సార్లు నా మనస్సున। స్తవము=స్తోత్రము.

ఆ॥ ధరను బ్రతినరుండు తన విషయంబున । న్యాయసూత్రమెసఁగఁ జేయఁదగిన
పుణ్యసప్తకం బగణ్యమై చెలువొందు । నదియుఁ దెల్పెదను మహాత్మ వినుము. 127

సీ॥ మొదలఁ జేసిన పాపములకు మనస్తాప । మును గాంచుటయును, నిమ్ముగఁ బరేశుఁ
గూర్చి పాతకము నొనర్చఁ దానికనని । దీక్ష వహించుట ధీరులైన
తిరుసభవారిలో దురితాత్ముఁడనటంచుఁ । దను దిట్టుకొనుటయుఁ, దప్పులకును
నాలయంబైన నిజాంగంబు నురు నిరా । హారాది తపముల నడఁచుటయును

తే॥ మిగుల నంహోవితతిమీఁదఁ బగ దలఁచుట, । పరుని కల్పనలను ముద మలర నమియును
దనదు సంసార మెట్లట్ల ధర్మకార్య । మును నడపుటయు నని గురుముఖ్యుఁ డనియె. 128

ఆ॥ ఒరులఁ జూచి సేయ నుచితమైనట్టి పు । ణ్యమ్ము లేదు గలవు సమ్మదమున
వినఁగ నవధరింపు మనఘ నీవర్థ్యుఁడ వగుటఁ జేసి తెలుప నలశయితు. 129

సీ॥ అన్యుల కొక రోగ మావహిల్లినఁ జూచి । తనుఁ జెందినట్లుగాఁ దలఁచుటయును
బరులకు మేలైన ఫలము గల్గిన నది । తన మేలుగాఁగ సంతసము గనుట
యొరు లెఱుంగక తన కొకవేళ నేరంబు । సల్పిన నందుకు సైఁచుటయును
దా శాంతుఁ డగుచు నందఱకును ధర్మశా । స్త్రప్రసంగము దెల్పి తనుపుటయును

తే॥ మంచివారని యితరుల నెంచుటయును । చెలువు మీఱి విరోధము సేయమియును
నాథుడైన జేసువు చేసినట్టు పరుల । యాత్మలను రక్షసేయఁ బ్రయాసపడుట. 130

వ॥ మరియుఁ గ్రియార్థులొనర్పందగిన పుణ్యంబగు తాక్షి గలదు, దాని నాకర్ణింపు మ
గణ్యంబగు పుణ్యకార్యకరణేచ్ఛాసంగతస్వాంతుండగు మానవుండు వివేకనిదానంబ
గు జ్ఞానలోచనంబున తాక్ష్యభిధాన సుకృతి నిక్షేపంబును గాంచి తత్సాధ్యంబున
కధికంబగు ప్రయాసంబు నొందుచు సంపత్పరిపూర్ణంబగు నగరం బస్థిరంబులేక
స్థిరంబుగా నోపని విధంబున నతాక్షియగు సుకృతంబు స్వాస్థ్యంబు గాదని యెఱింగి
ప్రవర్తింపవలయు నట్లయిన సకల జలధర ప్రవర్షితాంబు ప్రవాహం బున్నత మహీ
తలంబున న్నిలువక చని లోఁతు పుడమి న్నిండియుండు చందంబున సర్వేశ్వరు కృ
పాకటాక్షంబు సాహంకారులయెడం దొలఁగి దైన్యులయం దిష్టంబై యుండుఁ బ్రథ

---

127. న్యాయ సూత్రము ఎసగ=న్యాయక్రమములు ప్రకాశించునట్టుగా । పుణ్య సప్తకంబు అగణ్యమై =యేడు పుణ్యములు లెక్కింపరానివై

128. కాంచుట=పొందుట । దీక్ష వహించుట=ప్రతిజ్ఞచేయుట । ధీరులైన తిరుసభవారిలో=సకల క్రీస్తవులలో తాను దుర్మార్గుడని । తప్పులకును ఆలయంబైన నిజ అంగము ఉరు నిర్ ఆహార ఆది తపముల=అన్ని పాపములకు కారణమైన తన శరీరమును గొప్ప ఉపవాసము మొదలైన తపములచేత నిగ్రహించుట । అంహః వితతి=పాపసమూహము । తనదు సంసారము ఎట్లు అట్ల ధర్మకార్యమున=ఎంత జాగ్రతగా సంసారకార్యములను నడుపుదుమో అట్లు ధర్మ కార్యములను నడపవలయును.

130. రోగము ఆవహిల్లిన=వ్యాధి పుట్టిన । సైచుట=సహించుట । తనుపుట=తృప్తిపొంద చేయుట.

131. తాక్షి=సీసత (వినయమను అర్థమగును. తాక్షి అనెడు మాట అరవమాటే గాని తెనుగుమాట కాదు. జ్ఞానముత్యాలమాలిక అనెడు పుస్తకము అరవమునుండి తెనిగింపబడెను. కనుక దొరికిన తెనుగు పుస్తకములో కొన్ని అరవ మాటలు ఉపయోగింపబడినవేమో) । అగణ్యంబగు పుణ్యకార్య కరణ ఇచ్ఛ సంగత స్వాంతుండు =అనేక పుణ్యములను చేయుటయందు ఆశ కలిగిన హృదయము గలవాడు । వివేక నిదానంబగు=వివేకమునకు స్థానమైన జ్ఞానలోచనంబున=జ్ఞాననేత్రములచే । తాక్షి అభిధాన సుకృతి నిక్షేపమున=తాక్షి అనెడు పుణ్యము యొక్క నిధిని । తత్ సాధ్యంబునకు=దాని సంపాదించుటకు । స్వాస్థ్యము=స్థిరము । సకల జలధర ...... మొదలై

మ గురుమణిస్థమైన జేసునాథుండే తత్పుణ్యంబు ననేక విధమ్ములం గ్రియాసందర్భంబు
గ మానవుల మానసమ్ముల గాటంబుగా నాటఁ బ్రసాదించినారుకాదె యీ క్రమమం
తయుఁ దామనుష్ఠించినయదిగాదె యట్లగుటంజేసి యిహపరలోక కర్తయైన జేసునా
థుండు సాపరాధిచందంబున స్లీవపంచత్వంబు నొందుట చేతనోజ్జీవనార్థంబుగదా
యని విచారింపవలయు నందున సర్వేశ్వరుండు సత్యవ్రతుల నిరీక్షించి సప్రమోదాం
తరంగుండై యుండునది గావున. 131

క॥ ఈ క్షితిఁగల సత్క్రియలను। దాక్షియె ముఖ్యంబుగాఁగఁ దలఁచుచు ఘనమై
యక్షయమై విలసిల్లెడుఁ మోక్షసుఖము నొందవలయు ముఖ్యచరిత్రా. 132

క॥ తాక్షి యనెడి పుణ్యము తన। కక్షయముగఁ గల్గుటకు దృఢాస్థి క్రియార్థం
డక్షకుఁడై పరఁగిన ఘను। మోక్షప్రదుఁడైన గురుని మును వేఁడఁ దగున్. 133

వ॥ అది యెట్లనిన. 134

సీ॥ నిస్తుల మాధుర్యవస్తువులం దతి। మధురమై చెలువొందు మహిమవలనఁ
బెనుపొందుచు ననాది జనకుని సుతుఁడవై। యరుదైన జేసునాథార్యతిలక
భావించి చేతనోజ్జీవనార్థంబుగా। నరుఁడవై ధాత్రి జన్మంబు నొంది
యనుపమస్థితి తాక్షి యను పుణ్యమును నేర్పఁ। దవరు వేడుక నుపాధ్యాయులవఁగ
తే॥ మేటివై మించినట్టి నీ సాటియైన। గురువరేణ్యుండు లేఁడని గురుతుగాఁగ 135
సత్పురుషు లెన్నఁగా వింటి సనయమైన। నెనరు మదిగల్గి వినుము నా మనవి యిపుడు.

సీ॥ ఘనమైన పరలోకముననుండి దిగి యొక్క। పసులగాడిని సంభవంబు నొంది
తల్లిచేతను దేవధామంబున గురుస। న్నిధిని కానుకగాఁగ నిల్పఁబడియు
విలసిల్లు సన్మనస్కులచేత సేవింపఁ। బడి పేద శిష్యులు భక్తి కొలువ
నెనలేని దారిద్ర్యమున నుండి ధరణిపై। సంచార మొనరించి సకలమునకుఁ
తే॥ కర్తవై యల్ప మర్త్యుల కాళ్లు గడిగి। బంధుర జ్ఞానవిలసత్ప్రబంధములను
గల్పనం బొనరించిన కార్యమెల్ల। సనయము త్తరణోపాయమునకుఁ గాదె. 136

ఉ॥ ఇన్ని విధంబులన్ శ్రమను నెంతయు నోరిచి కూర్చినట్టి భూ
సన్నుతమైన నీ విమల సత్యచరిత్ర విధిం దలంప నే

---

నవి=అశేష మేఘములు కురిపించిన నీటి సమూహము ఎత్తుగల స్థలమున నిలువక లోతైన భూమి నిండుచున్న విధమున। సాహంకారులు=అహంకారముగల వారలను। క్రియా సందర్భంబుగ=క్రియలచేత। గాటంబుగా=దృఢంబుగా। అనుష్ఠించినది=తాము చేసినది గాదె। సాపరాధి=అపరాధి। చేతనోజ్జీవనార్థంబుగా=మనుష్యులను రక్షించుటకొరకు। సత్యవ్రతుల=ఇట్టి ప్రతిజ్ఞగల వారలను। సప్రమోదాంతరంగుడై=మనస్సులో సంతోషము గలవాడై।

132 సత్క్రియలను=సత్క్రియలలో.

133. దృఢాస్థి=దృఢము పొంది। అక్షకుడై=నాశము లేనివాడై। మోక్షప్రదుడు=మోక్షము నిచ్చువాడు

135. నిస్తుల మాధుర్య...... పొందతివి=సమానము లేని మధురమైన వస్తువులకన్న నెక్కువ మధురము కలిగిన। చేతనోజ్జీవనార్థముగ=మనుష్యులను రక్షించుటకొరకు। అనుపమస్థితి=సమానములేని విధమున। గురుతుగాగ=తెలియగా

136. దేవధామము=దేవాలయము। బంధుర=ఒప్పిదమైన। ప్రబంధములను=ఏర్పాటులను మరొ తరణ ఉపాయమునకు=నా రక్షణమునకు గాదా।

137. ఇన్ని విధంబుల...... పొందతివి=నీవు ఇన్ని విధములలో కష్టములను భరించి ప్రోగుచేసిన భూసన్నుతమైన=లోకములో పొగడబడిన। బుద్ధిహీనుని కరంబగు...... పొందతినవి=బుద్ధిలేని నన్ను శ్రేష్ఠమైన।

ర న్నను బుద్ధిహీనుని వరంబగు నీ కరుణారసంబునఁ
మున్నఁగఁ దాష్టితో మెలఁగ మోసము చెందఁగనీక ప్రోవుమీ. 137

క॥ అని వేఁడుకొనిన గురుమణి । తన హృద్వాక్కర్మములను దయను గలిగి నే
ర్పునఁ బరులను బెద్దలటం । చనిశముఁ దెలియంగఁ జేయు సమ్మాననపునిఁ. 138

ఉ॥ ఆరయ వర్యశిష్ట జనులందఱు నానతి యిచ్చి రిట్లహం
కారము ఘోరపాతకనగంబునకు న్మొదలౌ నటంచుఁ ద
ద్భూరి మహీజశాఖలవఁ బొల్పగుచుండు నఘమ్ములందుఁ ద
ద్వారము నేపణంపఁగ నుపాయము గల్గునటంచు దానిచేఁ
జారుతరైక మోక్షమును సాధ్యము సేయఁగ నొప్పునం చొగిన్. 139

వ॥ అది యెట్లనిన సత్క్రియాసంగతస్వాంతుండగు మానవుం డహంకారంబు నారంబు నందుఁ బ్రవేశంబై పిశాచ తంత్రోపాయంబుఁ బుట్టించి దుర్గతి ననుసంధించుననియును దానం జేసి సర్వేశ్వరానుగ్రహంబు దూరం బగుననియును సుకృత పదార్థం బదృశ్యంబగుననియు నెఱింగి యయ్యహంకారంబును నిరాకరించి తదాగతమ్ములగు కష్టముల నొందకుండవలయు నందున కుపాయం బెద్దియనినఁ బ్రవిమలంబగు మనంబున నస్థిరంబగు సుఖంబు నభిలషింపక శరీరంబునకు దుర్బలంబు నాపాదించు దురితమ్ముల ద్రోవం జూడక సత్యప్రతిజ్ఞావహుండై సద్గుణమ్ముల హృదయంబున దృఢంబు చేసి స్వభూషణంబును బరదూషణంబును వదలి, పరాత్పర ధ్యానంబునఁ గాలంబును సార్థకంబుగాఁ గడపవలయు నట్లు గడపిన యతండు నిరహంకారుండై శాశ్వ యను పుణ్యంబు నొందు నదియునుంగాక 140

సీ॥ అవని మోహంబున నరుదెంచు చేటు ల । ష్ట విధంబులగుచుండు నవియు వినుము
బుద్ధికి మాంద్యంబు పొడముట సద్ధర్మ । కార్య విరోధంబు గలుగుటయును
దుర్వాంఛ మదిని జెందుట సత్యవాక్కులఁ । బలుకుట కెనఁగు వాగ్బంధనంబు
తను కష్టమునకు నెంతయు నోర్వలేమియు । నిహసౌఖ్య మధికమం చెన్నుటయును
తే॥ ప్రాణగమనంబునకు భయపడుట యనృత । భోగముల నొందవలదని భూరిమహిమ

---

నీ కరుణయొక్క రసములో మునుగుటకును వినయముతో జీవించుటకును మోసము పొందగ నియ్యక ప్రోవుము.

138. శేసునాథస్వామి (=గురుమణి) హృదయమునను వాక్కునను కర్మములను దయను కలిగి పరులను మీకు పెద్దలం అనుచు నిత్యము ఆమానవునకు తెలియగా చేయును.

139. అహంకారము ఘోర పాపములను చెట్టునకు వేరు అగును । తత్ భూరి మహీజ శాఖలన్=ఆ గొప్ప చెట్టుయొక్క కొమ్మలం అనగా । అఘమ్ములం=పాపములం పొల్పు । అగుచుండున్=ఒప్పుచుండును తత్ వారమును ఏపు అణంపగా=ఆ సమూహముయొక్క అభివృద్ధిని అణచుటకు । చారు తర ఏక=ప్రకాశ ముఖ్యమైన.

140. సత్క్రియా సంగత స్వాంతుండగు=పుణ్యములతో కూడిన హృదయము కలిగినవాడగు । నారంబు నందు=జనులయందు । దుర్గతి ననుసంధించునని=నరకము కలిగించునని । సుకృత పదార్థం బదృశ్యంబగును=పుణ్యముల సమూహము వ్యర్థమైపోవును । తత్ ఆగతము=దానివలన వచ్చు । ప్రవిమలంబగు...... మొదలైనవి=పరిశుద్ధ మనస్సుతో స్థిరములేని సుఖములను కోరక । ఆపాదించు=కలిగించు । దురితమ్ముల త్రోవం జూడక=పాపముల త్రోవ చూడక । సత్య ప్రతిజ్ఞావహుండై=సత్యమైన ప్రతిజ్ఞ చేసినవాడై । స్వభూషణమును పరదూషణమును=తమ్ము తాము పొగడుకొనుట ఇతరులను నిందించుట । సార్థకంబుగా=ప్రయోజనకరముగా ।

141. మాంద్యము=తెలివి తక్కువ । వాగ్బంధనమ్ము=వాక్కునకు కట్టు । తను=శరీరముయొక్క । ఇహసౌఖ్య=ఈ లోక సుఖములను । ప్రాణగమనంబు=మరణము । పరునిమీద=దేవునిమీద । క్రూరదమన=ఓ క్రూరులను

వలనఁ గట్టడ చేసిన వరునిమీఁద । గోపమున నుండుటయు నివి క్రూరదమన. 141

చ॥ అసదృశభక్తిమై తగు క్రియార్హుఁడు దా నిటువంటి చేటులన్
వెసఁ దను జెందకుండఁగఁ బవిత్రమతిన్ విడఁద్రొక్కి మోహసా
ధ్వసములఁ బాసి పాపములపై రుచినొందక దివ్య మోక్షభా
గ్యసముచితానురక్తిఁ బరునాత్మఁ దలంపఁగ నొప్పు నేర్పునన్. 142

సీ॥ ఇటు సేయకుండినఁ బటు మోహవహ్ని పా । తకశుష్కసమిధాప్తిఁ దెరలి మండి
వితతమై దుష్కామవిస్ఫులింగమ్ములు । నాగినపకీర్తి యన్పొగలవలనఁ
బ్రజ్వరిల్లుచుఁ దపః ఫలపుణ్యనిలయంబు । సరభసరీతి భస్మంబు సేయు
మమత వీడని యట్టి మనుజాధమునకంటె । నిరయంబునకుఁ దాన త్వరగ నేగి

తే॥ పటుతరంబైన బాధ నచ్చటను గూర్చుఁ । బరుని కల్పనలను మఱవంగఁజేయు 143
మఱియు హేయ్యైనబుద్ధికి మాంద్యమునిడు । మోక్షవిభవంబు నడఁగింప మూలమగును

క॥ ఈ వగిది నెసఁగు మోహ । వ్యాపారమునందుఁ గోర్కి వదలి క్రియార్హుం
డై పుణ్యముల నొనర్ప ద । యాపరుఁడై విశ్వభర్త యనిశముఁ బ్రోచున్. 144

క॥ అపవిత్రమూలములు మో । హపరిచితము లురువివేక హరణమ్ములు స
త్యపరాఙ్ముఖములు వనఁగా । విపరీతములగుచుఁ గొన్ని వినఁబడుఁ జేటుల్. 145

వ॥ అవి యెవ్వి యనిన మోహసంప్రాప్తంబగు పాపం బెల్లఁజేటులకు నెక్కుడై యుండునది మోహోత్సాహపరవశుండగువాని మనీష నీషత్కాలంబునం బోఁ దఱిమి జ్ఞానచక్షుర్భంగంబు గావించి వాని యాత్మను గానరీతి నుంచుననియు పరమపద ఫలవినాశనంబునకు నిదానంబై ధర్మకార్యంబున కమర్షంబుఁ బుట్టించుచుండెను నాత్మ నాచ్ఛాదించిన మాంద్యంబు మోహంబునకు బిడ్డయై యుండుననియు సమస్తశాస్త్రవేత్తలగు సర్వ్యశిష్టవారానతియిచ్చినారది గావున నితర దురితంబు లాత్మ కపవిత్రంబు ననుసంధించు నీ మోహసమాగమకిల్బిషం బాత్మానయుపమ్ముల కపరిశుద్ధంబు సంపాదించు నట్టిగుటఁ గ్రియార్హుండగు నరుఁడీ కల్మషంబునకు వెఱచి నిజాత్మ నప

శిక్షించువాఁడా ।

142. అసదృశ భక్తిమై=సాటిలేని భక్తితో । మోహసాధ్వసములఁ=మోహభయములను । మోక్షభాగ్యసముచిత అనురక్తి=మోక్షముమీద తగిన ప్రేమతో । పరున్=దేవుని ।

143. మోహవహ్ని...... మొదలైనవి=మోహము అను నిప్పు పాపములు అను ఎండిన కట్టెలను పొందుటచేత (=శుష్క సమిధ ఆప్తి) ఎక్కువగా మండి విస్తారమై (=వితతమై) కామము అను నిప్పు రవ్వలచేత (=దుష్కామ విస్ఫులింగమ్ముల) అపకీర్తి అను పొగలవలన అధికమగును (=ప్రజ్వరిల్లును) తపముయొక్క పుణ్యముల యింటిని త్వరగ నాశనము చేయును (సరభస రీతి భస్మము సేయును) మమత వీడని...... మొదలైనవి=ఇట్టి కోరికలను విడిచిపెట్టని నీచునికంటె త్వరగ నరకమునకు పోయి ఘోరమైన బాధలను అక్కడ పెట్టును.

144. మోహ వ్యాపారమునందు=మోహ కార్యములందు । ఒనర్ప=చేయు నెడల

145. అపవిత్రమూలములు...... మొదలైనవి=అశుద్ధమునకు కారణములు, మోహముమీదనిండు ఆశలు, గొప్ప జ్ఞానమును పోగొట్టునవి, సత్యమునకు పెడముఖము పెట్టునవి విస్తారముగా అగును.

146. మోహ సంప్రాప్తంబగు=మోహముచేత కలిగిన పాపము । నెక్కుడై=గొప్పదై । మోహోత్సాహపరవశుండగువాని మనీష=మోహ సంతోషముచేత తన శరీరము తెలియని వానియొక్క బుద్ధిని । ఈషత్కాలంబునఁ=కొంచెము కాలములో తఱిమి । జ్ఞాన చక్షుర్భంగంబు గావించి=జ్ఞాన నేత్రములు నాశనము చేసి । పరమ పద ఫల వినాశనంబునకు నిదానంబై=మోక్షఫలము నశించుటకు మూలమైన అమర్షము=కోపము । ఆచ్ఛాదించిన=కప్పిన ।

రిశుద్ధంబు గాకుండునట్లు మెలంగవలయు నిదియుంగాక బలవచ్ఛత్రురూపంబగు మోహంబును విరోధించి తచ్ఛత్రువువలనం గాయమ్ముల నొందక జాగ్రత్సహితుండై యుండి మనంబునం దాక్షి గలిగి యనాద్యుండును సకల మేలుల స్వరూపియు నగు సర్వేశ్వరుని సహాయం బపేక్షింపవలయు మఱియు మోహంబను శత్రువమేయశౌర్యంబున నిరంతరాయోధనంబు గావింపఁ గట్టాయిత్తంబై యుండు బుద్ధిమంతుం డగు మనుజుండు తద్ఘోరజన్యంబున వ్రణమ్ములంబడగ పలాయనం బగుట కర్తవ్యంబని శిష్టులు వక్కాణింతు రిందుల భావం బెయ్యది యనిన స్త్రీపురుషు లనోన్యస్యంబు నిరర్థకంబగు స్నేహంబున వ్యర్థ ప్రసంగంబు నొనర్పక దమతమ యోగ్య క్రమంబునంత యునెఱింగి ప్రవర్తించు పంచజుని సర్వేశ్వరుం డఖండ కారుణ్యాసప్రవాహంబునం దేలించి పాలించు నిందులకు సందేహంబు లేదు వినుము. 146

క॥ ధరణీమండలి నెంచఁగ । నిరు తెఱంగులఁ దగు విరక్తి హితమతియగు స
ద్గురుని కృపారసవైభవ । సరణి స్వరూపింతు వినుము సత్యవినోదీ. 147

సీ॥ రంజిల్లు పూర్ణ విరక్తి సంసారి వి । రక్తియునన నందు ముక్తికొఱకు
క్షితి ధర్మసూత్రపద్ధతి నగు వైవాహి । క ప్రమదాభోగ కార్యములను
దవులక యునికి పూర్ణ విరక్తి యన నొప్పుఁ । బరిణయ ప్రాప్తసుందరుల వలన
నొనరు భోగంబునఁ దనరుచు నన్యకాం । తాభోగమును మదిఁ దలఁపకునికి
ఆ॥ పూని ధీరులెల్ల దీని సంసార వి । రక్తి యండ్రు స్త్రీపరప్రతతుల
కెల్ల నీ విరక్తు లుల్లాసకరములై । పరఁగుచుండుఁ జూవె భవ్యగుణుఁడ. 148

క॥ ఈ రెండు విరక్తులలో । నారూఢిగ మొదటఁ జెప్పినదె పరమును దాన్
ధీరులగు పెద్దలెల్లరు । గౌరవమున దానిఁ బూని గనిరి పరంబుల్. 149

ఆ॥ జ్ఞానపరిమళంబు గలిగి యుత్తమమునై । తగినరీతి మొదటి దగు విరక్తి
వలరియుంట కన్నెయగు దేవమాతయం । దెలమి నవతరించె జేసుగురుఁడు. 150

క॥ ఆ సరణి నుద్భవించిన । జేసుగురూత్తమవరేణ్యుఁ డెనలేని మతిన్
భాసిల్లుచుఁ దాఁ గనియెన । దా సంపూర్ణమయి గేరుదాని విరక్తిన్. 151

---

నితర దురితంబులు...... మొదలైనవి=వేరు పాపములు ఆత్మకు మైలను కలిగించును గాని మోహముతో కూడిన పాపము ఆత్మకును శరీరమునకును అశుద్ధము కలిగించును. । బలవత్ శత్రు రూపంబగు=బలవంతుడగు విరోధివంటి । తత్ శత్రువువలన=ఆ విరోధిచేత నష్టము పొందక । అనాద్యుండు=ఆదిలేనివాడు । మోహంబను...... మొదలైనవి=మోహము అను శత్రువు గొప్ప శౌర్యముతో నిరంతరమైన యుద్ధము చేయుగా । జన్యంబున=యుద్ధమునందు । వ్రణమ్ములన్=గాయములను । పలాయనంబగుట కర్తవ్యంబు=పారిపోవుట ముఖ్యమైన పనియగును ।

147. హితమతి=మేలుచేయు మనస్సు కలిగిన । సత్య వినోదీ=సత్యములో సంతోషము గలవాడా.

148. రంజిల్లు పూర్ణ...... మొదలైనవి=పూర్ణ విరక్తత్వము సంసారి విరక్తత్వము ప్రకాశించును. ఈ రెంటిలో మోక్షముకొరకై ధర్మసూత్రముల ప్రకారము అయిన వివాహములో (=వైవాహిక) స్త్రీతో భోగము లో తగులుకొనక ఉండుట పూర్ణ విరక్తత్వము అగును. పెండ్లివలన లభించిన స్త్రీవలన పొందు భోగముచేత నొప్పుచు పర స్త్రీని తలంచక ఉండుట పెద్దలు సంసార విరక్తత్వము అనుదురు. స్త్రీలకును పురుషులకును అందరికి ఈ విరక్తత్వము సంతోషకరములై పరగును.

149. కనిరి పరంబు=మోక్షము పొందిరి.

150. జ్ఞాన పరిమళంబు...... మొదలైనవి=జ్ఞానవాసనతో చేరి మంచిదై మొదటిదగు తగినట్లుగా విరక్తత్వముచేత ఒప్పిన దేవమాతయందు జేసువు మనుష్యావతారము ఎత్తెను.

151. కనియె=అవలబించెను । గేరుదాని=ఒప్పుచున్న దాని

సీ॥ సందేహసహిత సంసారవిరక్తి సా। మాన్యముగాఁగ నెమ్మదిఁ దలంచి
యెడలేని భక్తితో నడిచినఁ బూర్ణవి। రక్తిమార్గమును వరం బటంచు
మేటినిజాశ్రితకోటికెల్లను బోధ। గావించి మించె నా ఘనుని కిదియు
ఘనమైన శృంగారవనముగా శోభిల్లె। దీనిచే ముక్తి సిద్ధించు నరుల
తే॥ కిందులకు సందియంబులే దించుకైన। సన్మనస్కుల కెంతయు సరియగుదురు.
ఈ విరక్తిని గను జనులెల్ల నెపుడు। మహి నెఱుంగుము పరమ ధర్మంబుగాఁగ. 152

కం॥ అవనీమండలమునఁ బ్రే। మ బూర్ణ విరక్తి ఘటించుకొఱకు నయమునఁ గన్యా
కువలయదళనేత్రతనూ। భవు నేసుగురుం దలంపవలయు న్భక్తిన్. 153

చ॥ కవినుతశుద్ధమై పరఁగు గౌరవ మొప్పఁగఁ బుణ్యమౌ విర
క్తి విధ మెఱుంగఁ జేయఁగను కిల్బిషముల్ హరియింపఁ బెంపుమై
నవిరళ బుద్ధిమించి సుజనావళి నేలెడి జేసునాథ నీ
ప్రవిమలపాదపద్మములఁ బ్రస్తుతి నిస్తులరీతిఁ జల్పెదన్. 154

సీ॥ రంజిల్లు శుద్ధ విరక్తి యనుమాణిక్య। మును నెఱుంగఁగ దాని పెనురయమున
నాయాసమున నోర్చి యన్వేషణ మొనర్చ। ఘనమైన నీ యనుగ్రహమువలన
బుద్ధి గల్గఁగఁ జేసి బుధు లెన్నఁ దత్ఫలం। బును నను బొందింపు మనఘ యిటులఁ
గాక తక్కినఁ దదాగతపుణ్యఫలము నా। కబ్బునే యట్లౌట ననవరతము
తే॥ కర్తవై యుండి నా మది గట్టిగా భ। వత్ప్రసాదంబు నొసఁగి ప్రోవంగవలయు
స్పిరితుసాంక్తు వనెడుమాట ధరణియందుఁ। దెల్లమై విలసిల్లక కల్ల యగును. 155

శా॥ ఈ కార్య మ్మొనరింప దుర్లభము నేఁ డింతైన లేకుండ న
స్తోకోపద్రవకృన్మనీషఁ దగు శత్రున్మించి రాకుండ న
న్నీ కారుణ్యరసప్రవాహమున మున్గింపంగదే వేగరా
వే కళ్యాణగుణాకరా గురువరా విద్వజ్జనశ్రీకరా. 156

152. సందేహములతో గూడుకొనిన (=సందేహ సహిత) సంసార సహిత విరక్తి సాధారణమైనదిగ తలచి। మేటినిజ ఆశ్రిత కోటికెల్లను=తన్ను ఆశ్రయించిన గొప్ప వారలందరికి। మించె=జేసునాధుడు అతిశయించెను। ఇదియు=ఈ పూర్ణ విరక్తియే। దీనిచే=పూర్ణ విరక్తిచే। ఈ విరక్తిని గను జనులెల్ల=పూర్ణ విరక్తి పొందిన వారలందరుయు

153. ప్రేమతో విరక్తి మనకు ఇచ్చుటకుగా (=ఘటించుకొరకు) తామరవంటి నేత్రములుగల (=కువలయదళనేత్ర) కన్యయొక్క కుమారుని తలచుకొనవలయును (=తలంపవలయు.)

154. కవినుత=కవులచే పొగడబడిన। పుణ్యమౌ విరక్తి విధ మెఱుంగ చేయగను=విరక్తి అను ఈ పుణ్య విధము ఎరిగించుటకును। కిల్బిషము హరియింప=పాపము పోగొట్టుటకును। పెంపుమై అవిరళ బుద్ధిమించి=అధికముగా ఎడ తెగని బుద్ధితో। నిస్తుల రీతి=సమానము లేని విధమున

155. రంజిల్లు.....ఎఱుంగగన్=ప్రకాశించు విరక్తత్వము అను మాణిక్యము తెలుసుకొనుటకును, వేగమున కష్టమునకు (ఆయాసమునకు) ఓర్చి దాని వెదకుటకు (=అన్వేషణము ఒనర్చ) నీ అనుగ్రహముచేత। బుధులెన్న=సజ్జనులు మెచ్చుకొనునట్లు, గాక తక్కినన్=ఇట్లు నీవు చేయక పోవు సెడల విరక్తత్వముచేత కలుగు (తత్ అగత) పుణ్యఫలము నాకు అబ్బునా?। అట్లౌట=కాబట్టి

156. ఈ కార్యము చేయుటకు నేడు కొంచెమైనను కష్టము లేకుండ। మిక్కిలి కష్టము కలిగించు బుద్ధితో (=అస్తోక ఉపద్రవ కృత్ మనీష) తగు శత్రువుని నామీద రాకుండ నన్ను నీ కరుణ అను ప్రవాహమున మునగ చేయవలయును। కళ్యాణ గుణ ఆకరా=సుఖమైన గుణములకు గనివంటివాడా। విద్వత్ జన శ్రీకరా=విద్వాంసులకు సంపద ఇచ్చువాడా.

సీ॥ మఱియు శరీర సంబంధమైన మహాశ । వర్ధిల్లుచున్నది వహ్నిపగిది
నయ్యగ్నికి సహాయమై పిశాచము జ్వాల । గావించుచున్నది గాలిరీతి
నటులైన నా మంట నంట నీక మదాత్మ । నెంతయుఁ గడతేర్చు వంతు నీ యు
ధీనమై యుండుట దెలిసి నేనిపుడు ని । న్వేఁడుకొంచున్నాఁడ నీడులేని
తే॥ భవదమేయదయారస వర్షధార । వలనఁ దత్కలికీలానివహము నడఁచి 157
ప్రోవవలెఁ జుమ్ము శిష్యుని భావ మలర । ననుచు వినుతింప నాఘనుఁ డపుడు ప్రోచు.
క॥ ఎనలేని సద్గురుస్తవ । మున జ్యోతిశ్చక్రమంత్రమును బ్రియదత్తం
బును జపియింపం గలిగిన । జనునకు వరమైన మోక్షసరణియు దొరకున్. 158
వ॥ వెండియుం గ్రియానిపుణుండైన జనుం డామయంబు నమేయం బగునెడ నౌషధంబుఁ గొను బుద్ధిమంతుని చందంబున శరాంతరంగ శత్రువులవలనం జిక్కువడక సజాగ్రన్మానసుండై యుండవలయు నొక సమయంబున మనంబున దుర్విచారంబు పొడమిన నప్పుడ దానిం బరిహరింపవలయుఁ దమోగుణగరిష్ఠుండగు నతనికిఁ బిశాచతంత్రంబువలని బాధ ప్రాప్తించు సర్వేశ్వర ప్రసాదసిద్ధి గల్గిన జను నబ్బాధ దరియ న్వెఱచుచున్నది గావున కోపంబును దురాశను దూరంబునఁ దొలంగింపవలయు, నట్లు సేయ నోపని యాతని యాత్మయందలి పుణ్యద్రవ్యంబును శత్రువులనెడు చోరులు హరింతు రది గావున నుపాయద్వయంబు నెఱుంగవలయు నెట్లనిన శత్రువు లెంత బలవంతులైనఁ దన చిత్తం బచంచలంబై యుండుటయు వినయ సహితుండై విశ్వభర్తం గీర్తించుటయు నీయుపాయద్వయంబున నంత శ్శత్రునిరాసంబును బిశాచ సమిజ్జయంబును బుణ్యఫలావాప్తియు నరకంబును గాంచమియు లభించు నిదిగాక తక్కిన ప్రసంగంబు వినుము. 159
ఆ॥ గురుతరాత్మ శత్రునిరసనంబునకు వి । జ్ఞాన సిద్ధికిని సమానరహిత
శాంతిమయవిలాసు సర్వేశ్వరుని వేఁడు । కొనఁగవలెఁ గ్రియాన్వితుఁ డనుదినంబు. 160
సీ॥ సర్వలోకాధీశ సర్వేశ వినయంబు । తో నీకు శరణాగతుండనైతి
నస్మదాత్మాహితు లహరహంబును గను । తెప్ప మూయక నన్ను డప్పరంపు

157. కడతేర్చువంతు నీ అధీనమై యుండుట=రక్షించు పని నీ అధికారములో నుండుట । ఈడులేని=సాటిలేని । భవత్ అమేయ దయారస వర్షధార=నీ గొప్ప దయారసము అనెడు వర్షముయొక్క ధారవలన) తత్ కలికీలా నివహము నడచి=ఆ నిప్పుమంటల సమూహము పోగొట్టి

158. సద్గురు స్తవమున=శ్రేష్ఠ సాధునియొక్క స్తుతిచే

159. ఆమయము అమేయంబు అగునెడన్=రోగము గొప్పది అగునెడల ఔషధము తీసుకొను బుద్ధిగలవానివలె । శర అంతరంగ శత్రువులు=కఠోరమైన మనస్సుగల శత్రువులు । సజాగ్రత్ మానసుడై=జాగ్రతతో కూడిన మనస్సుగలవాడై । తమోగుణ గరిష్ఠుడు=సోమరితనము కలిగినవాడు । ప్రసాద సిద్ధి కలిగిన=ప్రసాదముయొక్క భాగ్యము పొందిన । ఆ బాధ దరియన్ వెఱచు=ఆ పిశాచతంత్రము సమీపించుటకు వెఱచును. । విశ్వభర్త కీర్తించుట=దేవుని ప్రార్థించుట । అంతః శత్రు నిరాసంబును=మనస్సుయొక్క శత్రువును ఎదిరించుటయు । పిశాచ సమిత్ జయమును=పిశాచముల సమూహము జయించుటయు । పుణ్య ఫలావాప్తియు=పుణ్యఫలములను పొందుటయు

160. గురుతర ఆత్మ శత్రునిరసనంబునకు=గొప్ప ఆత్మయొక్క శత్రువులను ఎదిరించుటను । జ్ఞానసిద్ధికిని=జ్ఞానము పొందుటకు । సమాన రహిత శాంతమయ విలాసు=సాటిలేని శాంతముతో కూడుకొనినవిలాసుడగు దేవుని వేడుకొనవలెను.

161. శరణాగతుండనైతి=నీ శరణు చొచ్చితిని । అస్మత్ ఆత్మ అహితులు=నా ఆత్మయొక్క శత్రువులు

బాధల పాల్సేయఁ బయనమై యున్నారు। మఱియును నా యందు మందబుద్ధి
యను దుర్బలంబును బెనుపొందుచున్నది। నీవు కారుణ్యవార్నిధివిగానఁ

తే॥ గలుగు శత్రుభయము తొలఁగించి రక్షింప। వలయు సుతుని దండ్రివలె మహాత్మ
తెలియ నన్నుఁ బోలు దీనుఁడు నినుఁ బోలు। దేవుఁ డవని లేఁడు ధీరవినుత. 161

వ॥ అనాదిజనకస్వరూప విభవ విభాసితుండవై విజ్ఞానానూనప్రభావంబునం జెలంగిన జేసు గురువరా! భవచ్చరణ సరసీరుహయుగళంబు మదీయ చిత్తంబునం గీలించి వేఁడు కొనియెద నా యందలి యజ్ఞానంబు నుపసంహరించి శాత్రవసముదయంబువలన నప జయంబు రానీక మన్నించి సన్నహారహంబును భవదధీనంబు గావించుకొనవలయు భవదీయ దయారస ప్రభావంబున సంభవంబు నొంది త్వద్రుధిరంబునం బ్రవర్ధితుండ నై యుండు నన్ననన్యగతికుం బోషించు భారంబు దేవర వారిదిగాదే యని నాతెంచి నఁ బరాత్పరుండు గరుణించు నిందులకు సందేహంబు లేదు వినుము. 162

క॥ అనయప్రదమగు మోహా। మ్మును గెలువంగ నొక యుపాయమును బెద్దలు తా
మొనలేని మహిమఁ బూర్వం। బున నానతి యిడిరి విను మిపుడు శాంతనిధీ. 163

సీ॥ ఘన మోహసంబంధ కార్య ప్రసంగమ్ము। లను మోహసహిత స్థలముల కేగ
నాయత్తపడు దృక్స్థిరానందమును నది। కట్టుట, కోలుగాని శాంతి నొసఁగు
స్నేహంబు నెప్పుడు శిక్షించుటయు, స్త్రీలు। పురుషులఁ గూడియుఁ బురుషు లంగ
నలఁ గూడియుఁ బ్రసంగములు సేయుటలు మాను। టయు, తదుపాయాంగ దయమనంగఁ

తే॥ బరఁగు నటు సేయఁజేని మున్పలికినట్టి। మూఁడు పనులును దుష్కృతమూలములగుఁ
గాన మోక్షఫలానూన కారణంబు। గాఁ దలఁపఁ దగుఁ దదుపాయ మాదరమున. 164

క॥ ఇనుము క్రియ గట్టి యగు నె। మ్మనమును గాఢాగ్నిరీతి మండుచు మోహం
బనికము గరఁగఁగఁ జేయుం। జనదెయ్యెడ నైన మోహసరణిఁ గమింపన్. 165

ఆ॥ అనుచు నీ విధమున సర్వభూశిష్ట హెరోసి। మూనుడనఁగఁ దగిన ధీనమంచి
తాగ్ర్యలానతిడిగి యవియ ముఖ్యంబుగా। నాత్మ నమ్మవలయు ననఘచరిత. 166

---

ఆహారహంబున=గాత్రిబగిలు। చెప్పరఁఘు బాధల పాలుసేయు=గొప్ప కష్టము అనుభవింప చేయుటకు। పెను పొందుచున్నది=అతిశయించుచున్నది। నీవు కారుణ్య వారినిధివి=నీవు కరుణా సముద్రమువంటివాడవు। ధీర వినుత=ధీరులచే స్తుతింపబడినవాడా!

162. విజ్ఞాన అనూన ప్రభావంబున జెలంగిన=జ్ఞానముయొక్క సాటిలేని ప్రభావంబుచే ప్రకాశించెడు భ వత్ చరణ సరసీరుహయుగళంబు=తామరలవలెనుండు నీ రెండు పాదములను। గీలించి=చేర్చి। శాత్రవ సముద యంబువలన=శత్రువుల సమూహముచేత। భవత్ అధీనము గావించుకొనవలయును=నీ వశముగా చేసుకొనవల యును. । సంభవము=పుట్టుక। త్వత్ రుధిరమున ప్రవర్ధితుండనైయుండు=నీ రక్తముతో వృద్ధిపొందినవాడనైయుం డు। నన్ను అనన్యగతికుం=ఇతర గతి లేని నన్ను।

163 అనయప్రదమగు=పాపము నిచ్చునట్టి।

164. మోహముతో కూడిన (=సహిత) స్థలములకు ఏగుటకు నిర్ధనుడ్యొక్కడు మాత్రముయొక్క స్థిరమైన ఆనంద మును అటంకము పరచుట (ఆయత్తపడు... అదికట్టుట) కోర గాని—కనికిమాలిన। శాంతి నొసగు=ఆశ నిచ్చునట్టి। అంగనలు=స్త్రీలు। తత్ ఉపాయ అంగదయము=ఆ ఉపాయముయొక్క అవయవసమూహము। గాన మోక్ష... ఆదరమున=గనుక ప్రేమతో (=ఆదరమున) ఆ ఉపాయము మోక్షమునకు సాటిలేని కారణముగా తలంపతగును.

165. ఇనుముకరి గట్టి అగు మనస్సును దట్టమైన నిప్పువలె మండెడు మోహము కరుగునట్లు చేయును. మోహమార్గమున ఎక్కడనైన నడచుట (=గమింప) తగదు

166. ధీనమంచిత అగ్ర్యలు=బుద్ధితో ఒప్పుచున్న పెద్దలు

చ॥ అనిశము మోహకారణమునై దురవస్థలఁ గూర్చ మేటియై
సనయవిహీనమైన తన స్వాంతము నెయ్యెడ నమ్మ కేసునా
ధుని వరబోధ నమ్మి భవదూరుఁడునై పరమార్థచింత నే
జనుఁడు దినమ్ములం గడపు సత్క్రియ యాతనిఁ జెందు నందమై. 167

క॥ కరము వరమైన క్షీరము । గరళయుతంబైన విడువఁగాఁ దగురీతిన్
ధర సుఖకరజీవనమున్ । దురితాకరమగుటఁ దెలిసి తొలఁగింపఁ దగున్. 168

క॥ ప్రాణముల నభిలషించెడి । మానవుఁడు విషంబుఁ ద్రాగ మదిఁ గోరని చం
దాన ముముక్షాసక్తుఁడు । తా నొప్పం దగడు దురితతంత్ర మొనర్పన్. 169

క॥ ఈ వసుధ నలోమానన । దావీ దనఁదగినయట్టి ధర్మాత్ములుగం
జె వెలసిన పుణ్యులెవ్వరు । స్త్రీ వశులై చెడరె తొల్లి జితవైరిగణా. 170

వ॥ అది గావున జ్ఞానభక్తివైరాగ్యములయెడ న్భయనయసమేతుండయిన యతం డుత్త
ముం డనం దగియుండు. 171

సీ॥ సకల లోకాధీశు సర్వేశ్వరుని దాసుఁ । డైనవాఁడు దురాశ నాత్మయందు
నిలువ నీయక పాపనివహంబు సొరకుండ । నాత్మ యన్ గృహమున కలరినట్టి
మూఁడు వాకిళ్లను మునుమున్నె తెలిసి యం । దాద్యమై నెలకొన్నయట్టి కంటి
వాకిలి మూయఁగావలె మూయకున్న సొం । పెసఁగిన వస్తునిరీక్షణమున

తే॥ దుర్విచారమ్ము లాత్మను దోఁచుచుండు । నందువలన నఘమ్ములు చెందు మిగులఁ
గానవదిగాంచి మనుజుండు కన్నుమూయ । దుర్విచారంబు లాత్మకుఁ దోఁచకుండు. 172

క॥ ఈ కరణి ధృతిని రెండవ । వాకిలియగు చెవిని మూయవలె దానన్ మో
హాకలితవాక్యములు విన । రాక విరక్తియు ఘటించుఁ బ్రస్ఫుటలీలన్ 173

క॥ ఈ రీతి నలరి మూఁడవ । ద్వారంబగు నోరు మూయవలయుం దానన్
ఘోరాఘమిశ్రమగు వా । గ్వారమ్మెడ వెడలకుండుఁ గలుగు నయంబున్. 174

క॥ ద్వారత్రయబంధనమున । నేరీతి నరుండు వెలయు నీ లోకమునం
దారయనని తలఁచిన విను । మారూఢిగఁ దద్విముక్తి కయ్యెడు నీతిన్. 175

---

167. ఎప్పుడును మోహకారణముగాను, కష్టములను (=దరవస్థల) కూర్చుటను గొప్పదిగాను (=మేటియై) నుండెడు నీతిలేని (=సనయ విహీనమైన) తన హృదయము నెన్నటికిని నమ్మక పాపము లేనివాడై (భవదూరుడునై) మోక్షముమీది ఆశతో (=పరమ అర్థచింతతో) ఏ నరుడు దినములను గడుపునో... మొదలైనవి

168. పాలు (=క్షీరము) విషముతో కూడినచో (=గరళయుతంబైన) విడువదగినరీతిన సుఖముతో కూడిన జీవనము పాపములకు స్థానమగునని (=సుఖకర జీవనము దురిత ఆకరము) తెలిసి

169. ప్రాణముల నభిలషించెడు=బ్రతుక కోరువాడు । ముముక్షాసక్తుడు= మోక్షము కోరువాడు ।

170. జితవైరిగణా=జయించిన శత్రుల సమూహముగలవాడా

172. సొరకుండ=చేరకుండ । అందాద్యమై నెలకొన్న=అందులో మొదటిదై ఏర్పడియున్న । సొంపెసగిన= అలంకారమైన । వస్తు నిరీక్షణమున=వస్తువులను చూచుటచేత

173. ఘటించును ప్రస్ఫుటలీల=ప్రకాశముగా కలిగించును

174. ఘోర అఘ మిశ్రము=గొప్ప పాపముతో కలిసిన । వాక్ వారము ఎద వెడలకుండును=మాటల సమూహము హృదయమునుండి బయటికి రాకుండును । నయంబు=నీతి

175. విచారింపగా ఈ మూడు ద్వారములను మూయుటచేత ఏవిధముగా నరుడు ఈ లోకములో ఉండగలడు అని తలంచినచో ఆ విముక్తికి అగు విధము వినుము.

తే॥ జలుపఁగావలయును మనస్తాపవిధిని। దాక్షి నుండుట ధర్మమా నీ క్ష్మాత
లంబున నెవండిటులు సేయు సంబరమున। దీనసత్యప్రశాంతముల్ దృఢము నొందు. 181

వ॥ మఱియు నహంకారయుక్తమ్ములు నశాంతమ్ములు నైన వాక్యమ్ములును వ్యర్థమ్ములగు సరసభాషణమ్ములును దురితకారణమ్ము లవం బరఁగు నది యెట్లనిన, మొదలఁ జెప్పంబడిన సాహంకారమ్ములును శాంతరహితమ్ములు నగు వాక్యమ్ములవలనఁ గిల్బిషంబు సిద్ధించుట జగద్విదితంబుగదా వ్యర్థ సరసభాషణమ్ములఁ బాపంబు సిద్ధించు చందంబు వినుము కొందఱు సరస వాక్ప్రసంగం బభంగంబగు స్తోత్రంబు తమ్మం జేయుటగా నెఱింగి యుప్పొంగి సంతోషితాంతరంగులై మరలఁ బ్రశస్తంబగు స్తవంబు సల్పుదురు దానిం జెందుట క్రియానైపుణ్యులకు ధర్మంబుగా దదియునుంగాక సరస వచనమ్ములవలనం బరుల మనంబు ఘనంబగు పరితాపంబు నొందును. గొన్ని సరస భాషణమ్ములు మోహసందీప్తమ్ములు గావున శ్రోతజనులకు మనోవికార దుర్విచారంబు నుత్పాదించు వెండియు నభిముఖస్థులుగాని మానవులపయి సరస వ్యాహారంబులు నొడివిన వారల కవి దూషణయుతంబులై పరఁగు నట్లగుట నిది వాగ్దోషమునం బ్రకటంబయ్యె నది విచారించి వివేకశాలియగు జనుండు సత్యమ్మును నిత్యమ్ముగా మనమ్మునం బాదు చేసి యెల్లసమయమ్ముల సరసవచస్స్ఫురణంబు నూపక జ్ఞాన జనశ్రోత్రార్హంబగు వచనంబును న్యాయయుక్తంబుగా నాడవలయు మనోగతంబగు వృత్తాంతంబంతయు నెఱింగించి దాని బహిర్గతంబుగాఁ బ్రకటంబు సేయ నర్హంబుగా దెట్లనినఁ బ్రజ్ఞాహీనుల చిత్తమ్ములు ముఖగహ్వరమ్ములనె యుండుఁ బ్రాజ్ఞుల ముఖగహ్వరంబులు చిత్తంబులనె యుండునని సత్యవేదంబునం బల్కంబడును. వాగ్దోషరహితుండగు నరుం డధిక పుణ్యవంతుండని యపోస్తులుఁడగు యాగప్పగారివలనం బరుండు పల్కించె నది యుత్తమంబగు ధర్మంబు. 182

క॥ జగతీస్థలమున వ్యర్థము। లగు కథలును మోహయుతములగు వచనమ్ముల్
తగ వ్రాసిన పుస్తకముల। ను గణింపుచుఁ జదువవలదు నూతన లీలన్. 183

ఆ॥ చదివినందువలన సత్ఫలం బింతైన। రాదదియునుగాక రయము నాత్మ
కపరిశుద్ధమైన యఘములు దుర్విచా। రములు వచ్చుఁ జూవె విమలచరిత. 184

---

=హృదయములోని దుర్గుణముల సమూహమంతయు బయలుదేఱగనోపు=బైటికి రాగలుగును। నయయుక్తరీతి=నయముతో కూడిన విధమున। క్రూరఫలము నిచ్చయించుట=పనికిరాని పండుమీద ఇష్టపడు నెడల। తత్ అంతమునకు=ఆ హాని వెళ్లగొట్టుటకు మనస్తాపపడవలయును। దాక్షి=వినయముతో నుండుట పుణ్యమగును। క్ష్మాతలంబున=ఈ లోకములో। దీన=దీనివలన।

182. అహంకార యుక్తమ్ములును అశాంతములునైన=గర్వముతో కూడినవియు శాంతములేనివియునైన వాక్యములు। సాహంకారములు=అహంకారముతో కూడినవి। కిల్బిషంబు=పాపము। జగత్ విదితంబుగదా=అందరికి తెలిసిన విషయముగదా। సరసవాక్ ప్రసంగంబు=ఎగతాళి మాటలు। అభంగంబగు స్తోత్రంబుగా=భంగము కాని స్తోత్రముగా। సంతోషితాంతరంగులై=సంతోషముతో కూడిన మనస్సుగలవారై। ప్రశస్తంబగు స్తవంబు=శ్రేష్ఠమైన స్తుతి। క్రియానైపుణ్యులకు=నేర్పరులకు। మోహసందీప్తములు=మోహముతో కూడినవి। శ్రోత జనులకు=వినిన వారలకు। మనోవికార=మనస్సుకు వికారము కలిగించు। ఉత్పాదించు=పుట్టించును। అభిముఖస్థులు గాని మానవులపయి=ఇష్టములేని మానవుల యెదుట। సరస వచస్స్ఫురణంబు నూపక=సరసపు మాటలు పలుకక। జన శ్రోత్రార్హంబగు=జనులు వినుటకు తగిన। మనోగతంబగు=మనస్సులోనుండు। ప్రజ్ఞాహీనుల=బుద్ధిలేనివారల। ముఖగహ్వరమున=నోటియందు। ప్రాజ్ఞుల ముఖగహ్వరంబులు=జ్ఞానముగల వారల నోరు।

చ॥ ధరణి సుబుద్ధియుం బరమ ధర్మము పాపవిముక్తియు న్నృతం
బరసి వహింపఁ గోర్కి గలయట్టి జనుం డటువంటి పుస్తకో
త్కరమును నేటుగా విడిచి జ్ఞానవిధిం దగు పుస్తకౌఘముల్
వెరపుగఁ గాంచఁగావలయు వేమఱు సత్క్రియ దీన నబ్బెడున్. 185

ఉ॥ దీన సమస్తధర్మవితతిన్ గ్రహియింపఁగవచ్చు జ్ఞాని, స
న్మానము గల్గుఁ, బుణ్యమును న్యాయము మించు దురాశలన్నియుం
దోనఁదొలంగు సాధ్వసముతోడఁ బరాత్పరు నెన్నఁబోలు న
జ్ఞానమడంగు దుష్కృత పిశాచము దూరముగుఁ దృఢంబుగన్. 186

తే॥ నిస్తులములగు విజ్ఞానపుస్తకముల । సావధాన మనీషచేఁ జదువవలయుఁ
జదువునప్పుడు మొదల సంశయము లేక । ఘనుని సర్వేశ్వరుని వేఁడుకొనఁగవలయు. 187

సీ॥ స్వామి యీ పుస్తకచయవచనములు నా । చెవిఁ బడునప్పుడు చిత్తమునను
పొంపుమీఱఁగఁ బ్రవేశింపఁగాఁ జేసి భ । వత్ప్రియులగు వారివలన మున్ను
విన్న సూత్రార్థము ల్సన్నగా నా మది । నొత్తియుండఁ గానింపుమెపుడు
తదనుగుణంబుగా మొదలఁ జేయుము దరి । తములకుఁ గా మనస్తాపవిధిని

తే॥ గాంచునట్లానరింపుమటంచు వేఁడు । కొనవలయు నందుచే జ్ఞానమును స్మరణయుఁ
దత్ఫలావాప్తియు లభింపుఁ దథ్యమనుచు । గురుపుంగవు లిచ్చిరి కరుణవలన. 188

చ॥ నిరతిశయప్రభావ భవనీరదవారసమీర భవ్యశం
కరకరుణాకరసాంద్రశయ జగత్త్రయపోషణ సత్యభావనా
పరమపదేశ నిత్యవిభవా సకలేశ్వర ముముక్షుమార్గవత్
స్థిరతరరూప సత్త్వమయజీవన రోగిజనాధిపావనా. 189

క॥ నిర్వాణఫలద సన్నుత । గీర్వాణమునీంద్ర దురితగిరివిబుధేంద్రా
దుర్వారశత్రుభంజన । సర్వేశ్వర విశ్వరక్ష సత్యకలాపా. 190

185. నృతంబు=సత్యము । పుస్తకోత్కరము=పుస్తకముల సమూహము । పుస్తకౌఘము=పుస్తకముల సమూహము.

186. వితతి=సమూహము । సన్మానము=మర్యాద । తోన=వెంటనే । సాధ్వసముతోడ=భయముతో । అడగు=అడిగిపోవును.

187. నిస్తులములగు=సాటిలేని । మనీష=బుద్ధి ।

188. భవత్ప్రియులగు వారివలన=నీ భక్తులవలన । విన్న సూత్రార్థములు సన్నగా=వినిన వేదములయొక్క అర్థములు స్థిరముగా । ఒత్తి యుండగా=అణగి యుండగా । తత్ అనుగుణంబుగా=దానికి అనుకూలముగా । గాంచునట్లు పొందునట్లు । తథ్యము=నిజము ।

189. నిరతిశయప్రభావ=అతిశయము లేని ప్రభావము గలవాడా । భవనీరదవారసమీర=పాపముల నెడి మేఘ సమూహములకు గాలివంటివాడా । భవ్యశంకర=శుభమైన సౌఖ్యము నిచ్చువాడా । కరుణాకరసాంద్రశయ=కరుణా సముద్రుడా । జగత్త్రయపోషణ=ముల్లోకములను పోషించువాడా । సత్యభావనా=సత్యమును ...వాడా । పరమపదయీశ=మోక్షమున కధిపతీ । నిత్యవిభవా=శాశ్వతైశ్వర్యము గలవాడా । సకలాత్మకా=అన్నిటికి ఆత్మయైనవాడా । ముముక్షుమార్గవత్=ముముక్షు మార్గమువలె । స్థిరతరరూపా=స్థిరమైన రూపము గలవాడా । సత్త్వమయజీవన=సత్త్వగుణముతో కూడిన వృత్తిగలవాడా । రోగిజనాధిపావనా=రోగులను పావన మొనర్చువాడా ।

190. నిర్వాణఫలద=మోక్షఫలము నిచ్చువాడా । సన్నుత గీర్వాణ మునీంద్ర=గీర్వాణులచేతను, మునులచేతను, నుతింపబడువాడా । దురితగిరివిభుధ ఇంద్ర=పాపములనెడి పర్వతములకు దేవేంద్రునివంటివాడా । దు

మ॥ సాపరాధ హితార్తి సంహార సర్వలోకవశంకరా
దీపితాబ్జసుహృన్నిశాకర దేవదేవఘృణాకరా
స్థాపితాఖిల సత్యభాషణ శాంతభాసుర భూషణా
గోపువంశ మరన్న పోషణ క్రూరశాత్రవశోషణా. 191

గద్యము॥ ఇది శ్రీమద్గురుసార్వభౌమ కృపాసంప్రాప్త కవితావిలాసపాత్ర కాశ్యపగోత్ర పవిత్ర మల్లెల వేంకటకృష్ణామాత్యపుత్ర విద్వజ్జనవిధేయ తిమ్మరాజ నామధేయ విరచితంబైన జ్ఞానచింతామణి ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 192

---

# ద్వితీయాశ్వాసము.

క॥ గురుచరణాంబుజయుగళ | స్మరణైక వినోద గోపు మల్లన్న హితా
దరణప్రభావ తేజః | స్థిరరూప దయానివేశ శ్రీసర్వేశా. 1

ఆ॥ వినుము మర్త్యవల్లె వనఘుఁడై విజ్ఞాన | లీల వెలయుచుండు లింగవిభున
కానతిచ్చెఁ బ్రేమ నవ్వలికథను సం | జీవనాథగురుఁడు భావమలర. 2

క॥ ఉపమింప మూఁడు విధముల | జపములు గలవవియు వినుము సర్వేశ్వరుఁ డ
త్కృప నార్యులానతిచ్చిరి | నిపుణత నా తెలిసినంత నీకు వచింతున్. 3

తే॥ జగతి వాగ్జపమన మనోజపమనంగ | ధ్యానజపమన వినుతింపఁ దగినవాని
చందముల నేర్పరింతు విస్తరముగాక | యల్పమునుగాక యుండునట్లమల చరిత. 4

క॥ ఉర్విని వాగ్జపమనఁగా | సర్వేశు ననంతు నభవు సత్ఫలదుఁ బరున్
నిర్వాణభర్తఁ ద్రిభువన | ధూర్వహు ముఖగహ్వరమున స్తుతి సేయనగున్. 5

సీ॥ వినుము మనోజపం బనఁగ నాననబిలం | బును మూసి మానసమునఁ దలంచి
మననిసేయుట, భక్తి మాని వాగ్జపమెంత | నల్పినఁ గల్గదు సత్ఫలంబు

---

ర్వార=వారింపరాని । శత్రుభంజన=శత్రులను నాశనము చేయువాఁడా । సత్యాలాప=సత్యమే భూషణముగ గలవాఁడా ।

191. స+అపరాధ=పాపాత్ములకు । హిత=దరిచేరబడిన (కలిగిన) । ఆర్తిసంహార=భయమును పోఁగొట్టువాఁడా । సర్వలోకవశంకరా=సర్వలోక పాలన చేయుచున్నవాఁడా । దీపిత=ప్రకాశించు; అబ్జ=కమలములకు । సుహృత్=స్నేహితుఁడా; నిశాకరా=చంద్రుఁడా । ఘృణాకరా=కనికరముగలవాఁడా । అఖిల సత్యభాషణస్థాపితా=సమస్త సత్యవాక్యములను స్థాపించినవాఁడా । శాంతభాసురభూషణా=శాంతము అనెడి ప్రకాశించుచున్న భూషణముగలవాఁడా । క్రూరశాత్రవశోషణా=శత్రువులను శోషిల్లచేయువాఁడా ।

1. గురువుయొక్క పాదములనెడు కమల ద్వయమును (=గురు చరణ అంబుజయుగళ) స్మరించుటయందు ఆనందించువాఁడైన(=స్మరణ ఏక వినోద) గోపు మల్లన్న స్నేహితునకు ఆదరించువాఁడును (=హిత ఆదరణ) తేజముగల స్థిరమైన రూపముగలవాఁడును దయగలవాఁడునైన (దయా=నివేశ) సర్వేశ్వరుఁడా.

3. నిపుణత=నేర్పుతో

4. విస్తారముగాక అల్పమునుగాక=ఎక్కువ తక్కువలేకుండ

5. వాక్కు జపమును అనగా: దేవుడు అంతము లేనివాడు పుట్టుకలేనివాడు మంచి ఫలము ఇచ్చువాడు మోక్షమునకు కర్త (=నిర్వాణ భర్త) మూడు లోకముల భరించువాడు (=త్రిభువన ధూర్వహు) అని నోటితో (=ముఖగహ్వరమున) స్తుతి చేయుట.

6. ఆనన బిలము=నోరు । ప్రచండ కలుషవితతులు=భయంకర పాపముల సమూహములు ।

జనితఫలంబును దానే । ఘనుఁడగుచు వహించి కౌతుకంబునఁ బొందున్. 11

మ॥ అమితప్రాజ్ఞులు మాన్యులర్చిన జపధ్యానస్తవం బాత్మఁ గొం
చెముగా నెంచుచుఁ దా రచింపవల దిచ్చంగోట లేనట్టి ప్రా
యము చందంబున శత్రుబృందమున వేమారున్ భయంబయ్యెడుం
గ్రమమొప్ప న్మును జేసినట్టి వినుతిం గావించు టర్హంబగున్. 12

సీ॥ క్రమమొప్ప ధర్మమార్గమ్మున భక్తియై । నడుచుచు జపము నొనర్పఁ దొడఁగు
నరుఁడు తత్ప్రయత్నంబున మనంబు గరఁగఁగ । నానంద బాష్పము లక్షియుగము
నందు జాలుకయున్న నతఁడు స్ఫిరితసాంద్ర । వననువాగలచేత వచ్చునట్టి
ఘనతర విజ్ఞాన కౌతూహలంబును । జెందనేరఁడు తదానందమునఁగు

తే॥ సదయుఁడగుచు మెచ్చి సర్వేశ్వరుఁడు తాన । మూలమగుచుఁ బ్రోవఁ బూనవలయుఁ
దత్ప్రసాదమునకుఁ దాక్షిచేతఁ బరేశు । నమ్మి కొలువవలయు నయనిధానా. 13

ఉ॥ తాలిమిఁ దాక్షియుం గలిగి ధర్మపథంబున మించెనేని ని
ర్వేలకృపామతిం బరుఁడు వేగమె జ్ఞానము ప్రాప్తిఁగంటికి
న్నొలగు బాష్పపూరమును మెచ్చి యొసంగటుగాక తక్కినం
జాలకయుండు దేవుని ప్రసాదము నొందుట కా జనుండిలన్. 14

సీ॥ జలజాతవైరి దర్శనమున నుప్పొంగి । తద్వియోగంబునఁ దగ్గువార్ధి
పగిది మనుష్యుండు దగఁ గొన్ని దినములు । జ్ఞానమోదంబున జపము నమల
ధర్మకార్యమ్మును దత్పరుఁడై సల్పి । కొన్ని దినములు తత్స్పృహారహిత
మై దాని వదలుట మరిఁ దలఁపఁగఁ బుణ్య । వర్ధనంబగున జపమును విడువ

తే॥ కుండునట్లుగ నతనికి నొక్కబుద్ధి । తెలుపవలయు నదెట్లన దీటులేని
జ్ఞానసంతోషమునన్నైన సకల లోక । భర్త గలఁడను వానికి ఫలము గలుగు. 15

తే॥ విశ్వలోకేశుఁడైన సర్వేశ్వరుండె । కలఁడనుచు నమ్మ నగునదు జ్ఞానహర్ష 16
మును జపంబును దాక్షియు నొనరు ధర్మ । కార్యవర్ధనమును నిచ్చు ఘనుఁడతండు.

చ॥ అని యొనరించువానికి మహోదయ మల్పదిచేటివానికిన్

---

దానివలన గలుగు ఫలమును । వహించి=తాల్చి । కౌతుకంబును బొందున్=సంతోషమును బొందును.

12. అమిత ప్రాజ్ఞులు=గొప్ప బుద్ధిమంతులు । జపధ్యానస్తవము=జపము ధ్యానము స్తోత్రము । రచింపవలదు= చేయవలదు । ఇచ్చన్=మనస్సునందు । శత్రుబృందమునన్=విరోధులచే । వేమారున్=అనేకసారులు । మును జేసినట్టి వినుతిన్=వెనుక జేసిన ప్రార్థనను । కావించుట అర్హంబగున్=చేయుట తగును ।

13. జపము ఒనర్పన్ తొడఁగు=జపము చేయ యత్నించు । అక్షియుగము=రెండు కన్నులు । ఘనతర=గొప్పదైన । విజ్ఞాన కౌతూహలమును=జ్ఞానమనెడు సంతోషమును । నయనిధానా=నీతికి నిధియైనవాడా!

14. ధర్మపథము=పుణ్యమార్గము । మించెనేని=నడచినచో । ఇర్వేలన్=రెండు వేళలను । పరుడు=దేవుడు । జ్ఞానము ప్రాప్తి=జ్ఞానసంతోషభాగ్యము । బాష్పపూరము=అశ్రుజల ప్రవాహము (కన్నీరు) అటుగాక తక్కినన్=అట్లుగానియెడల । (దేవప్రసాదమును బొందుటకు ఆ మనుష్యుడు చాలకుండును.)

15. జలజాతవైరి=పద్మములకు విరోధియగు చంద్రుని । దర్శనమున=చూపువలన । తత్ + వియోగమునన్=అతని యెడబాటువలన । వార్ధి పగిది=సముద్రమువలె । జ్ఞానమోదంబునన్=జ్ఞానసంతోషముతో । అమల ధర్మకార్యము=శుద్ధమైన ధర్మకార్యమును । తత్పరుడు=ఆశగలవాడు । తత్ + స్పృహరహితమై=దానియందలి ఆశలేనివాడై । పుణ్యవర్ధనము=పుణ్యముల నెక్కువ చేయునది । దీటు=సమానము.

16. విశ్వలోకేశుడు=సకల లోకములకు అధిపతి (దేవుడు) । జ్ఞానహర్షమును=జ్ఞానసంతోషమును.

నదియుఁగఁ దాను పాత్రుఁడను గానని దేవుని వేఁడఁగాఁ బరుం
డు దయను బ్రోచు వాని నెవ డుద్ధృతశాంతియటంచు నెంచుచున్. 22

క॥ నాలవ పని సర్వేశ్వరుఁ । డేలిక యని తెలిసి యతని నెసఁగు సదాచా
రాలాపమ్ముల వేఁడుట । వాలాయంబయ్యెఁ బాపవశ్యుఁడుగాకన్. 23

క॥ ఐదవ కార్య మచంచల । మైదగు హృదయమునఁ ద్రిజగదారాధ్యుఁ బరున్
మోదమున నమ్మి జపము । త్యాదరమునఁ జల్పనయ్యెనది సుకృతిసుధీ. 24

చ॥ అరితిమిరార్క యీయాఱవదియైన పని స్వామియమ్మనుష్యుఁడే
వరమును గోరు నప్పుడది వానికి దేవుఁ డొసంగకుండినన్
వెఱవక తాన యిచ్చునని వేమఱు నాసరుఁ డాత్మలోఁ బరా
త్పరు దృఢభక్తి నమ్మి ధృతి దప్పక వేఁడుట యయ్యె నొయ్యనన్. 25

తే॥ పూని గురువులు గుడిలోనఁ బూజసేయు । నెడను దిరుసభవారు గట్టడ యొనర్చి
నట్టి జపముఖ కార్యము లలరు మతులఁ । జలుపుకొలిపి వలయు ద్రికరణంబులను భక్తి. 26

సీ॥ ఆ సమయమ్ములయందు మానంబు న । చంచలదృష్టియున్ స్వాంతమునను
సాధ్వసంబును గల్గి సాచార దేహులై । విఘ్న రాహిత్య సద్వృత్తిఁ బరఁగ
నెనలేని శాంతి సర్వేశ్వరుఁ బ్రార్థింప । వలయును మఱియుఁ గైవల్య వాంఛ
నట కరుదెంచిన యా మనుష్యులెల్ల । నవఘులంచుఁ దలంచి యక్షి వాఙ్మ
తే॥ నములచే వారియెడల నేరములొనర్ప । కుండుటయు నెల్ల కార్యమ్ములొగిఁ బరేశు 27
నందు నిలుపుటయును ముక్తిఁ జెందు యత్న । మనుచు నానతి యిడిరాన్యులవనియందు

సీ॥ వరపీఠమున గురుపట్టంబు గల్గిన । ఘనులచే దీవన కరము గాంచి
జేసునాథ శరీర భాసుర రక్తముల్ । జనకుఁడై తగు పరేశునకు నెప్పు
నైవేద్యమగునని నయముతో భావింపఁ । దగు స్లీవమానులో దయ నొసంగు
కర్తుఁడు మన ఘోరకలుష విముక్తికిఁ । బగునట్లు బలిగాఁగఁ బ్రాణములను
తే॥ నాఁ డొసంగినయటువలె నేఁడు గోదు । మప్పమును ద్రాక్షఫలరసంబార్యులైన
గురువరులచేతఁ బరునకుఁ గోర్కెలలరఁ । గాను నైవేద్య మర్పింపఁగావలయును. 28

శాంతి=దీనత ననుభవించినవాడు । (జపము చేయునప్పుడు తనయందు పుణ్యము లేదు, తానడుగు వరము తాను బొందుటకు దగినవాడను కానని జేసునాథుని వేడిన వాని దేవుడు వానిని గొప్ప దైన్యముగలవాడని యెంచి కాపాడును)

23. ఎసగు=ఒప్పునట్టి । సత్ + ఆచార ఆలాపముల=మంచి నియమముగు మాటలతో । వాలాయము=అవశ్యము (తప్పక) (సర్వేశ్వరుడు యజమానుడని తెలిసికొని తప్పక యతనిని మంచి మాటలతో వేడుకొనుటయే నాల్గవది)

24. అచంచలము=నిశ్చలమైన (నిలకడయైన) త్రి జగత్ ఆరాధ్యున్=ముల్లోకములచే పూజింపబడువానిని । జపము + అత్యాదరమున=మిక్కిలి ప్రీతితో । చల్పన్=చేయగా । సుకృతిః ధీ=పుణ్యాత్ముడా ।

25. అరితిమిర అర్క=శత్రువులను చీకటికి సూర్యునివంటివాడా । వేమఱున్=అనేక సారులు । ధృతి దప్పక=ధైర్యమును విడువక । ఒయ్యనన్=తిన్నగా

పూజ సేయు నెడన=పూజచేయునప్పుడు । జపముఖ కార్యములు=జపములు మొదలగు కార్యములు । అలరు మతులన్=సంతోషమైన మనసులతో

27. అచంచల దృష్టియు=చలనములేని చూపును । సాధ్వసము=భయము । స + ఆచార దేహులు ఐ=ఆచార యుక్తమైన దేహముగలవారై । విఘ్నరాహిత్య=విఘ్నములు లేని । సద్వృత్తి=మంచి పనులు । ఎనలేని=సాటిలేని । కైవల్యవాంఛ=మోక్షమందలి ఆశ । అక్షి వాక్ మనసములచే=చూపు, మాట, మనసులచే । ఒగిన్=క్రమముగ

28. కరము=ఎక్కువగా । కాంచి=పొంది

క॥ ఏ నైవేద్యంబైనను । నీ నైవేద్యంబు గతిఁ బరేశునకు సమా
ధానముగు చుండనోపదు । గాన నిది యొనర్పవలయుఁ గైవల్యేచ్ఛన్. 29

ఉ॥ ఈ జగతి న్మహాఘముల నాశముఁ జేయుట కెంచిచూడ నీ
పూజకు సాటియై పరఁగు పూజ గలుంగఁగ నేర దెవ్వఁ డీ
పూజ సమస్త పూజలను బోఁడిమి మాన్చి జయించు మోక్షమున్
దేజము నిచ్చు నాత్మకు ధృతిన్ ఘటియించు జనావనప్రియా. 30

వ॥ అట్లగుటం జేసి శ్రీమాన్నిపుణుండగు జనుండు శరీరత్యాగానంతరంబునఁ జెందవలసిన ఫలంబున కీపూజావిశేషంబు సహాయంబై సిద్ధింపంజేయు నీదివ్యపూజాక్రమం బధికతరంబుగాఁ గలుగుటం జేసి సర్వేశ్వరునకు ముఖ్యంబగు. పూర్వంబున నేసునాథ గురుశిఖామణి స్లీవప్రమాణపీఠంబులో జనకుండగు పరాత్పరునకు నిజ శరీరంబును బలిగా నొసంగుట కిది లక్ష్యంబగుచున్నయది దానం జేసి మనం జేసునాథాచార్య మరణంబును దలంచి మనంబును బ్రపంచవశంబు గానీక దయారసనదీభర్తయగు కర్తను భక్తిసపూర్వంబగు హృదయంబున స్తవంబు గావించుచుండవలయు నిదియునుం గాక గతకాలంబునం జేసిన దురిత పుంజంబులం దలంచి వాని దూరంబు గావింప ఘనంబగు మనస్తాపంబు నొంది తాము సమర్పింపఁ దలంచు నైవేద్యరూపంబగు ప్రథమాచార్య శరీర రుధిరమ్ములం గాంచి నిజాత్మజ సంబంధమ్ములుగా నెఱింగి యగణ్యంబగు కారుణ్యంబున సహింపునట్లుగా విశ్వాసంబునం దాక్షియుక్తంబుగా నమ్మహాత్ము వేఁడుకొనవలయు నందున నా నైవేద్యంబు హృద్యంబుగా గ్రహించి యతం డొసంగు దివ్యప్రసాదఫలమ్ములకుఁ బారంబు లేదందున నిశ్చయంబుగా మోక్షంబు సిద్ధించు మఱియును. 31

ఆ॥ సకల పుణ్యములకు సద్ధర్మమర్యాద । లకుఁ దపఃప్రతిజ్ఞలకును సద్గు
ణములకెల్లఁ దల్లి నా విలసిల్లెడి । జేసుగురువిరీతి నెఱుఁగవలయు. 32

చ॥ పుడమిని మాదృశుల్ సకల పుణ్యచయంబును నేర్చి సేయఁ బెం
పడరెను మోక్షమార్గమున నాస్తి నెఱుంగఁగ నావశేషుచే

29. ఈ నైవేద్యంబుగతిన్=ఈ నైవేద్యమువలె । కైవల్య+ఇచ్ఛన్=మోక్షముందలి యాశచే । పరేశునకు=సర్వేశ్వరునికి.

30. మహాఘములు=గొప్ప పాపములు । నాశముచేయుటకు=నాశనము చేయుటకు । బోఁడిమి మాన్చి=గొప్పతనమును పోగొట్టి (తగ్గించి) ధృతిన్ ఘటియించు=ధైర్యమును కలిగించును । జనావనప్రియా=జనులను రక్షించుటయందు ప్రీతిగలవాఁడా!

31. శరీరత్యాగ అనంతరము=ప్రాణము పోయిన పిమ్మట । అధికతరము=శ్రేష్ఠము । గురుశిఖామణి=గురుశ్రేష్ఠుడు । లక్ష్యంబగుచున్నది=గురిగా అగుచున్నది । (దయారస) నదీభర్త=సముద్రుడు । దురిత పుంజములు=పాప సమూహములు । ప్రథమాచార్య=శ్రేష్ఠ గురువైన జేసునాథుని యొక్క । శరీర రుధిరమ్ములన్ గాంచి=శరీరమును రక్తమును జూచి । నిజ ఆత్మజ సంబంధములు=తన కుమారుడైన జేసునాథుని సంబంధములుగా । అగణ్యంబగు=గొప్పదగు । సహింపునట్లుగ=ఒప్పునట్లుగా । హృద్యము=మనసునకు ఇష్టమైనది । పారము=హద్దు

32. సత్+ధర్మమర్యాదలకు=మంచి పుణ్యములకు మర్యాదలకు । తపఃప్రతిజ్ఞలకు=తపో నియమములకు । తల్లినా=తల్లియునగా । విలసిల్లెడి=ప్రకాశించెడి

33. మాదృశుల్=మావంటివారు । పుణ్యచయము=పుణ్యసమూహములు । పెంపు అడరెదు=ఎక్కువ అతిశయించు । ఆస్తి=భాగ్యమును । ఎదపక=వెస చేయుటకై (మావంటివారు పుణ్యములను చేయుటకును, మోక్ష

నెడవక పంపఁగాఁబడిన జేసుగురూత్తము దివ్యచర్య నె
ప్పుడును స్మరించుచుఁ స్థిరవిభూతిని గాంచెద మంచనన్వలెన్. 33

సీ॥ కొమరొప్పు సకల ధర్మములకు మాతృక। యనఁగ మించిన జేసుమునియందు
నమరుప్రభావమెయ్యది యున్నను దరిద్రు। లందుఁ దాను దరిద్రుచందమునను
దాక్షితో నడచుట ధరణి నొక్కని నింద। చేయకుండుటయు సశేషజనులఁ
బ్రాకట ప్రతిభ బహూకరించుట ధన। వంతులఁ గాంచి యొక్కింతయును
తే॥ నిచ్ఛకము వల్కకుండుట హెచ్చు దేహ। కార్యముల నాత్మ నిలుపమి కలుషయుక్తు
లైనవారలఁ గడదేర్ప నభిలషించు।టయుఁ బ్రయాసమునను నోర్చుటయును బెఱియు. 34

క॥ తన కపరాధ మొనర్చిన। మనుజుని నేరము సహించి మహనీయదయా
ధనమునఁ బ్రోవఁ దలంచుట। విను మిది యా గురుని సుగుణవిభవములు చూవే. 35

చ॥ గురుఁడు శరీరవాసనను ఘోరదరిద్రమునందు నుండి శాం
తరసము గల్గి యున్న్యల ఘనంబగు కీర్తి హరించి వారలం
గరుణను బ్రోచి పాతకులఁ గన్గొని నింద యొనర్పఁ బోక యా
నరులకు జ్ఞానసూత్రవిధి న్యాయముగా ఘటియించె నెంతయున్. 36

చ॥ జపమొనరించువేళ బహు శాంతము గల్గిన పుణ్యమూర్తి శి
ష్యపరికృతోపచారముల నందఁగ నోపక వారికెల్లఁ బ్ర
త్యుపకృతి చేయు ధన్యుఁడు నరోన్నతి నమ్మిన మర్త్యకోటికిం
గృపను బరేశుభక్తి నిడుఁ గేవల సత్యవచఃప్రభావుఁడై. 37

సీ॥ సకల మానవులకు స్వామియై తగినట్టి। జేసునాథగురుండు భాసురార్చ్యశి
ష్టమాతకు నర్చ్యశిష్టజోజెపను। వారికి నొదిఁగి తద్వార్తలకును
సంతోషపడియున్న శాంతచిత్తుం డహం। కారశూన్యుం డరోగ్యంబటంచుఁ
బట్టాభిషేకాది బహుమానములయందు। నిస్పృహచే నుండు నీతిధనుఁడు
ఆ॥ నఖిల పంచజనుల యాత్మబృందమును మో। క్షమున నిలుపఁ దలఁచు సాహసుండు
గాన సుజనుఁ డట్టి కార్యమ్ములందును। వలయు నతని మదిని నిలుపుకొనఁగ. 38

చ॥ అరమరలేక యీ గతిఁ దదార్యశిఖామణి నాత్మనుంచి యే

---

భాగ్యము పొందుటకును పర్వేశ్వరునిచే తనుండి వేరుచేయబడక పంపబడిన జేసునాథుని దివ్య నడతను తలంచుచు స్థిరమైన భాగ్యమును బొందెద మనవలెను)

34. కొమరు ఒప్పు=మనోజ్ఞమైన। అమరు=ఉండు। అశేషజనులన్=జనులనందఱను। ప్రాకట ప్రతిభ=మంచి బుద్ధితో। బహూకరించుట=గౌరవించుట। ఇచ్ఛకము=ముఖస్తుతి। దేహ కార్యములు=శరీర సంబంధమగు పనులయందు। ఆత్మ నిలుపమి=ఆత్మను ఉంచకుండుటయు। కలుషయుక్తులు=పాపాత్ములు। కడతేర్పన్ అభిలషించుటయు=రక్షింప గోరుటయు।

35. మహనీయదయాధనమునన్=గొప్పదయతో

36. శరీర వాసనను=దేహవిషయమందు। జ్ఞాన సూత్ర విధి=జ్ఞాన మార్గముయొక్క ఏర్పాట్లను। ఘటియించెన్ ఎంతయున్=ఎక్కువగా కలిగించెను.

37. శిష్యతతి=శిష్య సమూహము। కృత + ఉపచారములన్=చేయు సేవలను। అందగ నోపక=పొందనిష్టపడక। ప్రత్యుపకృతి=బదులు సేవ। నరోన్నతిన్=న్యాయముయొక్క గొప్పతనమును। మర్త్యకోటికిన్=మనుష్యులకు। పరేశుభక్తిన్=దైవభక్తిని ఇడున్=ఇచ్చును। సత్యవచఃప్రభావుడై=నిజమగు శక్తిగలవాడై।

38. అరోగ్యము=పనికిరానిది। నిస్పృహ=ఆశలేనితనము

చ॥ లలినల తేనెటీఁగ సకల ప్రసవమ్ముల మాధురీక్రమం
బలరఁగఁ గాంచుకైవడిఁ గ్రియానిపుణుండగు మానవుండు ని
ర్మలమతులైన సద్గురుల మాటల జ్ఞానయుతప్రసంగరీ
తులఁ దగు ధర్మసూత్రములతోడ గ్రహింపఁగ నొప్పుఁ బుణ్యమా. 46

క॥ యతులను గురుపట్టోన్నతి। నతికిన సత్పురుషులను మహా పుణ్యులఁగా
మతి నుతి సేయఁగ దగుఁ ద। త్ప్రతతి మహిమఁ దెలియఁ బలికెదను వినుమధిపా. 47

సీ॥ వారవారణభక్తి వర్ధలక సర్వేశ్వ। రుని నమ్మియున్నట్టి ఘనులు ఘనులు
జనుల పాపములకై కనలనొందక యుండ। జపరీతిఁ బరగెడు సరసమతులు
కలుషాంధకారసంకటము వడంప దీ। పముల చందమున లోకమునఁ దగిరి
పుణ్యనిధానులై పుడమి మానవులను। బుణ్యాత్ములుగఁ జేయఁ బొడమినారు

తే॥ వారలను నింద సేయక వారిమీఁద। భక్తి నిల్పినఁ బరలోక నైభవంబు
తన వశంబగు నెన్ని చందములనైన। నార్యసంస్తుతికంటెఁ బుణ్యంబు గలదె. 48

క॥ ధర వారి నింద సేయుట। గురుదూషణగాక సభకు ఘోరార్తి ఘటిం
చు రయమున ధర్మహానియుఁ। బరునుతికి నిఘ్నమగుచు నఘహారణా. 49

క॥ ఒక గురువును నిందించిన। సకల గురూత్తముల నింద సల్పిన యటులౌఁ
బ్రకటముగ దానిచే ఘో। ర కలుషపుంజంబు పెరుఁగు బ్రవిమలచరితా. 50

చ॥ గురునొకనందు నేర మొనఁగూడినఁ దక్కినవారి నట్లుగా
నరయఁగఁగూడ దొక్కటగు హాటకముద్రిక చెల్లదేని యు
ర్వరనవి యెల్లఁ గాంచి యటువంటివె కాఁ దలపోయఁ బాడియే
పురుషుఁడు తద్గురుప్రవరు భూషణ చేసినఁ బుణ్యమబ్బదే. 51

వ॥ గురుదూషణంబుకంటె నధికంబగు పాపంబును గురుభూషణంబుకంటె ఘనంబగు
పుణ్యంబును గలుగనేర దాకర్ణింపుము. 52

గలవాడై। భువననాథుని ప్రార్థన చేసి=త్రైలోక్యాధిపతిని ప్రార్థించి। దగ్ధన + అమంద మహోయమున్ వదలి=దుష్టుల గొప్ప సమూహమునైనను విడచి। మాంద్యత్=సోమరితనము నీ। అప్రతిరప్రతాపము=శత్రుసమూహముల తేజమును। డిందగ త్రొక్కి=పోద్రొక్కి। దయాదర + ఉదధీ=దయాదర సముద్రమువంటివాడా।

46. లలిన్=సంతోషముతో। అల తేనెటీఁగ। ఆ తేనెటీఁగ ప్రసవమ్ముల=పువ్వులయొక్క। మాధురీక్రమంబు అలరగన్=తియ్యదనమును బాగుగ। కాంచుకైవడి=త్రాగునట్లు। జ్ఞానయుత=జ్ఞానముతో నిండిన। ప్రసంగరీతులన్=ప్రసంగములయందు। తగు=ఉండునట్టి

47. యతులను। (గురుపట్ట ఉన్నతి నతికిన=) గురుపట్ట భాగ్యము పొందిన సత్పురుషులను మహా పుణ్యులని వారిని స్తుతింపవలెను; (తత్ ప్రతతిమహిమ=) వారి మహిమను బలికెదను.

48. వార, అవారణ భక్తిన్=స్థిరమైన భక్తితో। జనుల పాపములకు సర్వేశ్వరుడు (కనలు=) కోపము చెందకుండునట్లు (జపరీతిన్ పరగెడు=) జపవిధానములచే ఒప్పునట్టి బుద్ధిమంతులు। (కలుషాంధకార సంకటము=) పాపచీకటి అను కష్టమును (అడపన్=) పోగొట్టుటకు దీపములవలె తగిరి। (పుణ్యనిధానులై=) పుణ్యరాసులై। పొడమినారు=పుట్టినారు। ఆర్యసంస్తుతి=గురువులను పూజించుట.

49. ఘోర ఆర్తి ఘటించు=గొప్ప కష్టమును గలిగించును। పరునుతికిన్=దేవుని స్తుతికి। అఘహారణా=పాపమును పోగొట్టువాడా!

50. ఘోరకలుషపుంజము=ఘనమైన పాపములు। ప్రవిమలచరితా=పరిశుద్ధుడా!

51 ఒక్కటగుహాటకముద్రిక=ఒకానొక బంగరునాణెము। ఉర్వరన్=భూమియందు। తత్ గురుప్రవరు=ఆ గురుశ్రేష్ఠుని। భూషణ చేసిన=గౌరవించిన।

ఆ॥ అధిప ధరణియందు దనాయాసమున ధర్మ । కార్యముల రచింపఁగాఁ దలంచు
వతఁడు సంతతంబు మితభుక్కుగా వలెఁ । జుమ్ము నేఁడు తద్విధమ్ము వినుము. 53

సీ॥ అవనియం దర్చ్యశిష్టాగమస్థితీశను । ఘనుఁ డానతిచ్చిన క్రమము తేట
గా రచించెద నిరాహారతపస్సు పా । తకములఁ ద్రోచి యాత్మను విశుద్ధ
ముగ నిల్పు నింద్రియములు మదం బణఁగించు । నంగంబు నాత్మవశ్యముగఁ జేయు
మోహతాపము నిర్మూలంబు గావించు । వైరాగ్యమును జాల్ప వర్ధిలంగ
తే॥ భావములనొందుచుఁ బుణ్యసంపదలఁ బెంచుఁ । గామినీపంచజనుల దీక్షలకు నిదియుఁ
గావలియగుచునుండు నిక్కంబటంచుఁ । బలికి రటులఁ బ్రవర్తింపవలయు నవఘ. 54

క॥ మితభుక్కుగాక పుణ్య । వ్రతతతుల నొనరింతు ననుట వ్యర్థముగా దే
యతఁడు దురాశల మోహా । న్వితకార్యములను జయింపఁ దెరువెఱుఁగునొకో. 55

సీ॥ ఉర్విని నొక్కప్రొద్దుండుట యారోగ్య । మంగనాత్మలకుఁ గల్గు నర్థమెల్ల
దుష్కార్యముల కీయఁ దోఁపక సత్కార్య । ముల కీయఁగాఁ దోఁచు ముఖ్యముగుచుఁ
బొఁగు యశంబును బహుమానమును జెందు । మానసము శరీర సంబంధ చింత
లను వీడి పరచింతలను గాంచు సర్వశా । స్త్రార్థములు దెల్పిన ట్లుపవాసముల
తే॥ నిగ్రహింపఁగవచ్చు సందియము లేక । ఘనుని సర్వేశ్వరుని భక్తిఁ గనఁగొనంగ
దైవసన్నిధి కేగయుఁగఁ దత్క్షణమునఁ । బక్షములు వచ్చునని గురుల్ పలికి రధిప. 56

తే॥ నయము లేనట్టి భోజనప్రియమువలన । నమితములుగాఁగ నేతెంచు నఘము లట్టి
భోజనములకు నార్వురు పుత్రికలు గ । లరు తదాత్మజ లెవరన వరుస వినుము. 57

సీ॥ అగ్రతనూజ మోహము మందబుద్ధి రెండవది దుష్కీర్తి మూఁడవది పరుల
నేరమ్ము లెన్నుచుఁ గ్రూరవాక్యము లాడుటయు నాలుగవది యైదవది మిగులఁ
బరిహాసకము చేయుపని యాఱవది మేరలేని సంతోష మిట్లైన వీరి
ధార్యసంగతి వీరి తల్లియౌ భోజనప్రియము దుర్గుణములరీతి నెంచ
తే॥ నగణితం బగుఁగాన మర్యాదలేని । భోజనమున శరీరంబు పూడ బలియు
నందుచే దుర్విచారంబు లప్పుడే పుట్టు । దాన నిజముగఁ జెడిపోవు జ్ఞానముదము 58

ఆ॥ అందువలన బుద్ధి మందమై జడమును । జేయుటతోఁ బరేశు న్యాయమలర
వేఁడుకొనఁగ బలిమి వెలితియై చెడిపోవు । నడఁగియుండు నాత్మ యచలధైర్య. 59

52. ఆకర్ణింపుము=వినుము.

53. మితభుక్కు=కొలదిగ తినువాడు

54. రచించెద=చెప్పెద । నిరాహారతపస్సు=ఆహారమును విడిచిచేయు తపము । విశుద్ధము=మిక్కిలి నిర్మలము । అంగంబు ఆత్మవశ్యముగ జేయు=శరీరమును లోబడియుండునట్లు చేయును; వైరాగ్యమున నుండుటకు మోహతాపమును పోగొట్టును । కామిని=స్త్రీలు । పంచజనులు=మనుష్యులు ।

55 మోహాన్విత కార్యములు=మోహముతో కూడిన కార్యములు । తెరువు=మార్గము ।

56. అర్థమెల్ల=ధనమంతయు । మనము=మనస్సు । పరచింతలు=మోక్షమందలి ఆశ । నిగ్రహింపగ వచ్చు=త్రోసివేయ వచ్చు । పక్షములు=రెక్కలు

57. తత్ ఆత్మజలు=ఆ కుమార్తెలు

58. అగ్రతనూజ=మొదటి బిడ్డ । దుష్కీర్తి=అపకీర్తి । వీరి ధార్య సంగతి=వీరి ధరింపదగిన విషయములు । ఇట్లైన=ఇట్లుండగ । అగణితంబు=లెక్కించుటకు వీలు కానిది అగును । పూడ=పూడునట్లు । దుర్విచారంబులు=చెడ్డఆశలు । జ్ఞానముదము=జ్ఞానసంబంధమగు సంతోషము.

తే॥ కపుడు శాంతిము గల్గి సత్యస్వరూపుఁ । డైన పరమేశ్వరుని చిత్తమనుచుఁ దలఁచి
యతఁ డొనర్చిన పనుల నిజాత్మలందు । మేలె యనుచును భావించి మెలఁగవలయు. 72

క॥ ఆ పగిది నుండువారల । నా పరుఁ డీ జనకుకంబె నధికతర కృపా
దీపిత హృదయుండగుచుఁ ద । దాపదలన్ సంహరించి యనిశముఁ బ్రోచున్. 73

వ॥ మఱియు నజపాలకుం డజసమూహంబు నెచటికి నడిపించు నచటికిం జని జీవించు నయ్య
జవ్రజంబు చందంబున సర్వేశ్వరాజ్ఞాప్రవర్తకులమగుట మేలని మానవులు నమ్మనం
యు వైద్యుం డొసంగిన యౌషధంబు తిక్తమాధుర్యాదిగుణ సంశయంబు నొందక గ్ర
హించు రోగిరీతి జనకుం డొనర్చు కోపకృపారసమ్ముల కల్గక భక్తియుక్తులై యుండు
తనూభవులవడువున దయాపరుండగు పరాత్పరుం డారోగ్యవ్యాధులయుం దెద్ది కట్టడ
గావించిన నదియె మేలని తాలిమితో నుండుట మర్త్యులకుఁ గర్తవ్యంబు శాంతంబునకు
విచారత్రయంబు కారణంబై యుండు నందుఁ బ్రథమవిచారంబు స్వయంకృత దురిత
పుంజమ్ములవలనఁ బ్రాప్తంబగు నరక దుఃఖంబు ననుభవింప సర్వేశ్వరుండు నిబంధనం
బు చేసె మేమేమి చేయువారమని యుండుట, ద్వితీయ విచారంబు జేసునాథగురుండు
మదర్థంబుగా నెంత శ్రమపడి రాక్రియ నేమును బరాత్పరమదర్థంబుగా నంత శ్రమపడుదు
మనుట, తృతీయ విచారంబు మేమీయీషద్దుఃఖానుభవంబున నోడక యోర్చిన తద
నంతరంబున విశ్వభర్త సంపూర్ణంబును సమానరహితంబును నగు మోక్షానందంబు నొ
సంగునని తలంచుట, యీ విచారత్రయంబునఁ దాలిమి బలవంతం బగుచునుండు. 74

క॥ మనుజన్ముఁడు తాలిమి గ । ల్గి నటించుచు నుండుకొఱకుఁ గృపచేసిను ద
జ్జనని యనఁదగిన జేసు । న్వినయప్రాంచిత విలాసు వినుతింపవలెన్. 75

వ॥ ఎట్లనిన. 76

సీ॥ ఓ జేసు గురుమిత్ర యోకదయారసపాత్ర । ననుఁగూర్చి యన్య లన్యాయకార్య
ముల నొనర్చెడు వేళ బలుదుఃఖములు వచ్చు । నప్పుడు మొఱయిడ నంగలార్వ
నధికములైన స్వయంకృతాఘములచే । నరక పాత్రుండనైతి ననుచుఁ దలఁపఁ
గడలేని కాలంబు గల్గి యుండెను ఘోర । నరక వేదనల కెన్నఁగ బదులుగఁ
తే॥ గొంచెమగు దుఃఖమును గడుఁ గొంచెమైన । కాలము ననుభవము చేయు క్రమము నీయ
ధీనమని తాల్మిచే సన్నుతింపఁ బ్రజ్ఞఁ । జెందఁ గావింపు మనఘ యమందమహిమ.77

---

కియై=సముద్రపు అలలవలెనయి । తరంగములకైవడ=అలలవలె । పరంపరలయి=ఒకటి వెంబడి నొకటియయి

73. ఆ పగిదిన్=ఆ మాదిరిగ । కృపాదీపిత హృదయుడు=దయచే ప్రకాశించు మనసుగలవాడు । తత్ + ఆపదలన్=ఆ కష్టములను । సంహరించి=నాశనము చేసి (పోగొట్టి) । అనిశము=ఎల్లప్పుడు.

74. అజపాలకుడు=గొఱ్ఱెలకాపరి । అజసమూహంబు=గొఱ్ఱెలమందను । అజవ్రజము=గొఱ్ఱెలమంద । సర్వేశ్వర ఆజ్ఞాప్రవర్తకులము=సర్వేశ్వరుని యిష్టప్రకారము నడచువారము । తిక్తమాధుర్య ఆదిగుణము=చేదు తీపు మొదలగు రుచుల । తనూభవులు=కొడుకులు । వడువున=మాదిరిగా । విచారత్రయము=మూడు విచారములు । స్వయంకృత=తాను చేసిన । దురితపుంజములవలన=పాపములవలన । మదర్థంబుగా=నా నిమిత్తమై । ఏమును=మేమును । పరాత్పరమదర్థంబుగా=సర్వేశ్వర ప్రీతికై । ఈషత్ దుఃఖానుభవము=ఈ కొంచెము దుఃఖమును అనుభవించుటకు । ఓడక=ఓడిపోక ।

75. మనుజన్ముడు=(మట్టిలో బుట్టినవాడు) మనుజుడు । వినయప్రాంచిత విలాసున్=వినయముచే పూజింపబడిన విలాసవంతుని (జేసునాథుని)

77. స్వయంకృత అఘములు=తాను చేసిన పాపములు । అమందమహిమ=గొప్ప మహిమతో

క॥ పరిశుద్ధులైన మీరలు । నరులరయఁగ స్త్రీప్రమాణున స్పంధనచేఁ
బరఁగుటకన్నను నేరము । లరచించిన నేనవస్థలను గనుటరుదే. 78

చ॥ తల కడుబాధలం గనఁగ దానికిఁ గ్రిందగు వంగసంచయం
బలఘు సుఖంబు నొందఁ దగవౌన మహిన్ సకలాంగకమ్ములం
గలిగిన తప్పులం దలఁచి కష్టిని శీఘ్రము చెంద నంగక
మ్ములు దగు కష్టిఁ గాంచకను మోదము నొందఁగ రాదొకప్పుడున్. 79

చ॥ అరయఁగ మీర లిమ్మహి మదర్థము కట్టడ చేసినట్టి దు
స్తరమగుచున్న దుఃఖములఁ దాఁ గడు తాలిమి గల్గి యోర్చినన్
వెలయు భవత్కరంబునను వేగమె దాని పణంచి నామదిన్
మెలఁగెడు మేటి తాలిమికి మెచ్చి ప్రమోదము నొందఁ జల్పరే. 80

చ॥ పరమత వాన గుర్వగతి నన్నిఁక నెన్ని యుపద్రవమ్ములై
వ రయమునం బెనంగుచు ఘనంబుగ బాధలఁ బెట్టినీ భవ
ద్గురుకరుణారసంబు మదిఁ గోరెదఁ దాలిమి సూత్రమిమ్ము నే
నఱకును వానికేను వెఱవన్ గురుశేఖర సత్కళాకరా. 81

క॥ అని వినుతించిన గురుఁడా । తని భక్తికి సంతసించి తాలిమి నొసఁగున్
విను సఖులు ధర్మములు గురు । ని నుతించెడి మనుజునందు నేర్పున నిలుచున్. 82

తే॥ వినుము సర్వేశ్వరుండు చేవిడువకుండు । నటులు కడు భయపడుచుండు నట్టి నరుని
యాత్మ కందున మేలుకార్యములు గలుగు । నవియు వివరింతుఁ దేటగా నధిపనీకు. 83

సీ॥ ఘన ధర్మవచఃముల్ వినుతింటి మానసం । బును గట్టి చేయుక యనుదినంబు
నుదరపూరణమే సదుద్యోగముగ నెంచి । యాత్మ నిర్దేర్పుట నపుడె మఱచి
చిత్తంబు కిల్బిషాయత్తంబుగ నొనర్చి । యుండఁగా నియుక నరుండు లోకు
లను నిర్వహింపఁ జల్పిన మేరను దలంచి । దుర్మార్గవర్తనఁ దొలఁగఁ ద్రోసి
తే॥ గురువు లాఁపతి యిచ్చిన స్థిరతర ప్ర । సంగమును దల్లిదండ్రులెసంగు ప్రేమఁ
జెప్పినటువంటి బుద్ధులఁ జెలఁగి వినుచు । నిలువఁగాఁ జేయు నిజమిది నిర్మలాత్మ. 84

క॥ నగువందు భయము నొందని । నరుఁ డతఁడు కరంబు విడువ నరకంబున ని
స్తుర బాధ లనుభవించుచుఁ । గరము నిలుచు నమితమైన కాలం బధిపా. 85

క॥ తనయందు భయము గల్గిన । మనుజుని పాపములఁ ద్రోసి మర్యాదకు మిం
చిన మోక్షభాగ్య మొసఁగున్ । ఘనుఁ డల సర్వేశ్వరుఁడు కారుణ్యమునన్. 86

78. నరులరయఁగ=జనులు చూచుచుండ । నేరములరచించిన=పాపములను చేసిన ।

79. అంగ పంచయము=అవయవముల మొత్తము । అలఘు=గొప్ప । తగవౌనె=న్యాయమగునా । కష్టిని శీఘ్రము చెంద=శిరము కష్టము నొందగా ।

80. మత్ + అర్థము=నాకొఱకు । దుస్తరము=భరింపరానిది । భవత్కరంబునను=నీ చేతిచే ।

81. ఉపద్రవమ్ములు=కష్టాలు । రయమునన్=శీఘ్రముగ । పెనంగుచు=చుట్టుకొనుచు । భవత్ గురు కరుణ=నీ గొప్పదయ । సత్కళాకరా=ప్రకాశవంతుడా ।

84. ఉదరపూరణమే=పొట్ట నింపుకొనుటయే । సత్ ఉద్యోగముగ=మంచి ఉద్యోగముగ । ఆత్మన్ తేర్చుట=ఆత్మను రక్షించుట । కిల్బిషాయత్తము=పాపముతో కూడినది । నిర్వహింపన్=(నెరవేర్చు) నడపుటకు చల్పిన మేరన=సల్పిన విధమును

85. అతడు=దేవుడు । అమితమైన కాలము=చాల కాలము.

ఆ॥ అవని నేను నాథుఁ డా పరాత్పరునకు । బలిగ నమితమైన బాధ కోర్చి
స్లీవప్రమానునందుఁ జిక్కి యుండెను నది । గాంచి నైన మతి గ్రహింపరాదె. 87

తే॥ అధిప తాఁ జేసినట్టి మహాఘములకుఁ । గా మనస్తాపమును గాంచఁగాఁ బరుండు
వాని దురితముల హరించి పరమ పదము । కరుణ నిడునంచుఁ బలికిరి గురువులెల్ల. 88

సీ॥ సత్యమై తగు మనస్తాపంబు లేక కొం । దఱు క్రియాసిద్ధులు ధరణి దురిత
సంకీర్తనము చేసి శ్రమపడి యుందురు । కలుషరాహిత్యంబు గాక పరుని
యిష్టప్రసాదంబు నెంతయుఁ బడయక । మరణాంతమున మోక్షమహిమ గనక
చనుదురు దృఢమనస్తాపకారణములు । మూఁడగుచుండు నా మూఁటి వినుము

ఆ॥ ప్రథమ కారణంబు పాతకసంగతో । ద్యోగ మెపుడు మానియుండు టరయఁ
బరులు తన కుపద్రవములు చేసిన నోర్చి । ప్రియము సల్పుటయ్యె రెండవదియు. 89

తే॥ దురితములఁ గొన్నిటిని బాయఁ ద్రోలి కొన్ని । పాపములఁ దగ మటకు సత్ప్రాయ మాత్మఁ
బొడమక సమస్తకల్మషపుంజముల న । ణంచుట మూఁడవదియగు న్యాయవిజ్ఞ 90

చ॥ అటులగుటం బరాత్పరు సహాయమున న్సకలాఘసంఘ ప
ర్యటనము నణంచి పుణ్యములనందఁ బ్రయాసము నందనొప్పు వి
స్ఫుటమతి యీ క్రియన్ స్థనెడఁ బుణ్యము లన్నియుఁ గల్గి పాపసం
ఘటనకు నోఁచ నేమిటికిఁ గ్రమ్మఱ వాఁడఖిలార్థభూషణా. 91

క॥ ఇలఁ బూజవలన వచ్చెడి । ఫలమునకుం దాను మొదలు పాత్రుఁడు గాకన్
ఖలమతిఁ దత్పూజావిధి । నేరఁగ విన సుకృతమబ్బునా విమలాత్మా. 92

క॥ జ్ఞానప్రసంగమున గురు । లానతి యిడినట్లు నడవ నఘములు విడకన్
దా నాదివారమున వినఁ । బూనిన కథవలన నేమి పుణ్యము గలుగున్. 93

చ॥ పలుకులచే నగణ్యమగు పాపముల రచియించి మాటికిన్
వెలయు నసత్యసాక్ష్య మిడి వేమఱుఁ బ్రత్యులఁ గిల్బిషంబులం
దలఁచుచు దుర్యశంబును ముదంబున వారలకున్ ఘటించుచుం
దెలియక చన్నవారలను దిట్టిన నేమి ఫలంబు నొందెదున్ 94

సీ॥ ఇల నొక్కప్రొద్దుండవలసిన దినమునఁ । జిత్తమెంతయు గట్టిసేయ లేక

88. మహా అఘములు=గొప్పపాపములు । దురితములు=పాపములు । పరమపదము=మోక్షము ।

89. దురితసంకీర్తనము=పాపసంకీర్తనము । కలుషరాహిత్యము=పాపపరిహారము । పరుని యిష్టప్రసాదము=దేవుని వరప్రసాదము । పాతక సంగత ఉద్యోగము=పాపములతో చేయు పనులను । ఉపద్రవములు=కష్టములు ।

90. ఆత్మఁ బొడమక=మనస్సున బుట్టక । కల్మషపుంజములన్=పాపములగుంపును । న్యాయవిజ్ఞ=న్యాయ మెఱిగినవాడా ।

91. సకల అఘసంఘపర్యటనము=సకల పాపముల నడతను । పుణ్యముల నందన్=పుణ్యములను బొందుటకు । ప్రయాసము నందనొప్పు=శ్రమ చేయదగును । విస్ఫుటమతి యీ క్రియన్ స్థ నెడన్=విశదమతిగల నేర్పరి యందు । పాపసంఘటన=పాపములు గల్గుటకు । అఖిలార్థభూషణా=సకలవిషయములలో అలంకారముగ గలవాడా ।

92. ఖలమతిన్=చెడ్డమనస్సుతో । తత్ పూజావిధిన్=ఆ పూజామాత్రములను । సుకృతము అబ్బునా=పుణ్యము దొరకునా । విమలాత్మా=పరిశుద్ధుడా ।

93. అఘముల విడకన్=పాపములను విడువక ।

94. అగణ్యము=లెక్కలేని । రచియించి=చేసి । వేమఱు=అనేకమాఱులు । ప్రత్యుల=ఇతరుల । కిల్బిషంబులన్=పాపములను । దుర్యశము=అపకీర్తి । ఘటించున్=చేయుచు । చన్నవారలన్=చనిపోయినవారలను ।

సర్వేశ్వరునకు నసహ్యమైన యఘంబు । లను జేయుచుండ భోజనము వదలి
యుపవసించిన దాన నొదవు ఫలంబేమి । బైటఁ దాలిమి గలవానివలెనె
మెలఁగి గృహంబున మృగరాజు రీతిఁ గో । పము గల్గి ధర్మకార్యములు నడుప
తే॥ బుద్ధిహీనుఁడగుచు నన్యపురుషవరుల । చే నుతింపఁగఁబడునందుచేత నేమి
ఫలము గలదు దయారసజలధి సదృశ । యాశ్రితావనకార్య హేమాద్రిధైర్య. 95

చ॥ తొలఁగని పాపబుద్ధిమెయి దొంగిలి తెచ్చిన సొమ్ము సొమ్మనా
గలికిడకన్ ఋణంబు గొని గ్రక్కునఁ దీర్పక దన్ను నెమ్మితోఁ
గొలిచెడి వారికి న్నిగులఁ గొంకక సంబళమీక యొండ్లకు
న్వలయఁగ నిచ్చుమీయఁ జలివెందరలం బనిపూని పెట్టినం
దుల ఫలమేమి గల్గు భవదూర నిరామయ లింగపాహ్వయా. 96

తే॥ తానొనర్చిన యఘములఁ దలఁచి వాని । దూరముగఁ దొలఁగింప దురితకీర్త
నంబు నన్యజన ప్రయత్నమునఁ జేయు । టను ఫలంబేమి వరునకు వినయ విభవ. 97

సీ॥ వాఁతిచే వెడలిన వంటకంబును మర । ల భుజింప నూహించులాగున గురు
వరులతోఁ జెప్పిన భవముల మగుడ నొ । నర్పఁ దలంచుట న్యాయమగునె
కాన క్రియాశాలియైన మర్త్యుం డాత్మ । నేత్రంబు దెఱచి సత్పాత్రమైన
నిజవర్తనమును బూనిననీతి వీక్షించి । వృజినబంధంబును విడువవలయు
తనయందుఁ గల సుకృతమ్ములు నఘములు । చేత నెప్పటికిని జెఱుపవలదు
గురితయుక్తమ్ములై పరఁగు పుణ్యమ్ములు । పుణ్యములగునె యా పుణ్యములకు
జగతి సర్వేశ్వరేష్టప్రసాదమ్మును । కైవల్య ఫలమును గలుగకుండఁ
బెడ్డ తెల్లెడలఁ గిల్బిషముల విడువంగ । బుద్ధి చెప్పిరిగాని పుణ్యములను
తే॥ విడువుమని చెప్ప రటుగాన విదితమైన । పుణ్యముల వీడకను బాపపుంజముల నొ
నర్పకుండఁగవలయుఁ దానన పరుండు । తన ప్రసాదంబు నొసఁగు నింతయు నిజంబు. 98

చ॥ మహిఁ దురితానుచారియగు మర్త్యుఁడు పాపతతిం జయింపఁ బ్ర
త్యహమును స్వాంతతాపమును దగ్గమి చేయుచు నెంతొ కుందినన్

---

95 అసహ్యమైన=సహింపరాని । ఉపవసించిన=ఉపవాసముండిన । దానన్ ఒదవు=దానివలన కలుగు । మృగరాజురీతి=సింహమువలె । అన్యపురుషవరులచే=ఇతర మనుష్యులచే । దయారస జలధి సదృశ=దయాసముద్రమువంటివాఁడా । ఆశ్రితావనకార్య=దగ్గఱ చేరిన వారిని రక్షించువాఁడా । హేమాద్రిధైర్య=హిమాలయమువంటి ధైర్యముగలవాఁడా ।

96. పాపబుద్ధిమెయి=పాపబుద్ధితో । కొంకక=సందేహించక । సంబళము=జీతము । ఒండ్లకున్=ఇతరులకు । చలివెందర=మార్గమధ్యమున మంచినీళ్ళిచ్చుటకై వేయు పందిళ్లు । భవదూర=పాపరహితుఁడా । నిరామయ=ఆరోగ్యవంతుఁడా ।

97. దురితకీర్తనము=పాపసంకీర్తనము । అన్యజన ప్రయత్నమున=ఇతరుల ప్రయత్నముచే ।

98. వంటకము=భోజనము । భవములన్=పాపములను । మగుడన్=తిరిగి । నిజవర్తనమును=తనచేష్టలను । పూనిననీతి=నీతిగలిగి । వీక్షించి=చూచి । వృజినబంధంబును=పాపకట్లను । కైవల్యఫలమును=మోక్షభాగ్యమును । కిల్బిషములన్=పాపములను । విదితమైన=తెలిసిన । దానన=దానిచేతనే । పరుఁడు=సర్వేశ్వరుఁడు ।

99. దురితానుచారి=పాపము ననుసరించువాఁడు । ప్రత్యహమును=ప్రతిదినమును । స్వాంతతాపమును=పశ్చాత్తాపమును (మనోవేదన) । కుందినన్=ఏడ్చినను । స్పృహన్=కోర్కెతో । గృహవిభవ ప్రసంగమున=సంసార భాగ్యవిషయములందు । ఎక్కుడుగా=ఎక్కువగా (పాపాత్ముడు పాపములను జయించుట కెంత మనోవేద

మితిలేని దురితసంగతి నుండు వానికిఁ । జావు కట్టడ చేసి త్రోవలేని
తే॥ నిరయమున నుంచుఁ గావున నిక్కమైన । జ్ఞానమును జెందవట్టి దుర్జనుల బోధ
వినక పుణ్యపథంబున వెలయుటొప్పు । నధిక ధర్మనిదాన లింగాభిదాన. 104

చ॥ మరణవిధిం దలంపకను మాంద్యము నొంది పరాకు నెమ్మదిం
బరఁగి చరింపఁ గూడదు శుభంబగు మోక్షమునుం బరాత్పరుం
దిరముగ మర్వఁ బాపము లుద్దీర్ణగతిం బెరుఁగు న్నజాగ్రతం
బురుషుఁడు నిల్పిన న్సకల పుణ్యములబ్బు నగణ్య వైభవా. 105

వ॥ అదియునుంగాక జనుండు ధర్మమార్గ ప్రవర్తనుండగుటకు నిమిత్తంబు గల దెట్లనినఁ దా నొనర్చిన సుకృతంబు స్వర్గప్రయోజనార్థంబుగా జరుగనీక యుండవలయు నందున నీశ్వరుం డుపకారకరణమనీషుండై స్వప్రసాదంబు నుదారంబుగా ననుసంధించు జ్ఞానసుఖానుభావంబును దత్పుణ్యంబునకు నవిఘ్నంబును జేయు నట్లుగాక తమోగుణగరిష్ఠుండగునేని వాని దురితమ్ముల నంతంబునఁ గర్తయగు పరుండు గణింపం దలంచు నయ్యెడ లెక్క చెప్ప నశక్తుండగుఁగాని శక్తుండు గాఁడు విశ్వభర్తకను గ్రహంబు రానీక యిపుడతని చిత్తంబున కర్హంబగు సద్వర్తనంబున నుండి తాలీయుక్తంబుగా మనస్తాపంబు నొనరింపవలయు నటులు నడచిన దేవుండు సముద్భావంబున మనంబున నొవ్వక యిష్టంబగు ఫలంబును స్పష్టంబుగ నిచ్చు మఱియును. 106

సీ॥ ఉర్వి క్రియాస్థాన కొరకు బుద్ధిఁ దెల్పిరి । సత్పాత్రులగు గురుస్వాములెల్ల
ఘనులు దెల్పినదాని విని యట్లు తాఁ బ్రవ । ర్తింపఁగాఁ జను దాని తీరు వినుము
బుణముగా నుండుట వృద్ధిస్థలి సమాఖ్య । యని విచారించి ప్రయాసమునను
బూనుట మాంద్యంబు బుద్ధిలేని నరుండు । బహుమానమున నాత్మ భ్రమయుటయును
తే॥ న్యాయమునకు నసహ్యంబు నొందుటయును । గేరి కోరికలను దొలఁగింపమియును
మట్టు సేయంగవలయు నేమమున ధాత్రి । వితరణకలాప రణరంగవిజయరూప. 107

(నిరయమునను=) నరకమందుంచును. వినక జ్ఞానములేని దుర్జనుల బోధ వినక (పుణ్యపథంబునన్=) పుణ్యమార్గమున నడచుటయే. అధిక ధర్మనిదాన=గొప్ప ధర్మములకు స్థానమైనవాఁడా । లింగాభిదాన=లింగారెడ్డి అను పేరు గలవాఁడా ।

105. మరణవిధిం దలంపకనున్=మరణ సమయమును తలఁచక । మాంద్యము నొంది=బుద్ధిహీనుఁడై । పరాకు నెమ్మదిం బరఁగి చరింపఁగూడదు=మనసున అజాగ్రత గలిగి మెలఁగరాదు । తిరముగ=పూర్తిగ (స్థిరముగ) మర్వన్=మరచిపోయిన । పాపములు ఉద్దీర్ణగతిన్=పాపములు ఎక్కువగా ॥

106. ధర్మమార్గప్రవర్తనుఁడు=పుణ్యమార్గమున నడచువాఁడు । నిమిత్తము=కారణము । సుకృతము=పుణ్యము । స్వర్గప్రయోజనార్థంబుగ=పనికిమాలిన భాగ్యములకై । ఉపకారకరణమనీషుఁడై=మేలు చేయు బుద్ధిగలవాఁడై । ఉదారంబుగాన్=గొప్పగా । అనుసంధించు=కూర్చును । జ్ఞానసుఖ అనుభావము=జ్ఞానసుఖముయొక్క ప్రభావము । అవిఘ్నము=అడ్డములేనిది । తమోగుణగరిష్ఠుఁడు=తమోగుణములుగలవాఁడు । దురితమ్ములన్=పాపములను । అంతంబునన్=అంత్యమున । ఆగ్రహంబు=కోపము । అర్హంబగు=తగిన । సద్వర్తనంబునన్=మంచి నడవడితో । సముద్భావంబునన్=మంచి మనసుతో । మనంబున నొవ్వక=మనస్సులో కష్టము సహింపక ।

107. ప్రవర్తింపఁగాఁ జనున్=నడువఁదగును । దాని తీరు=దాని విధము । సమాఖ్య=కీర్తి । ఆత్మ భ్రమయుటయున్=మనసున భ్రమ చెందుటయు । ఏరి=ఉత్సహించి । మట్టు సేయంగవలయును=అణచవలెను (న్యాయమును అసహ్యపడుటయును, కోర్కెలను తొలఁగింపకుండుటయును అణచవలెను) । నేమమునన్=నియమముతో । ధాత్రి=భూమియందు । వితరణకలాప=దానమునను భూషణమువంటివాఁడా । రణరంగవిజయరూప=యుద్ధమున అర్జునునివంటివాఁడా ।

క॥ తన సెలవును గనశక్తికి । నెనఁగా నొనుపఁదగు శక్తి కిరవగునట్లు లు
ర్విని సెలవు సేయవలె శ । క్తిని మించిన సెలవు సేయఁ దెరువదియగునే. 108

ఆ॥ పుడమి నిట్లు సెలవు నడిపించుకొను నంచ । జనుఁ డనేక పాపసంఘములకుఁ
దలఁగి దుఃఖములకుఁ దొలఁగి నిర్వహించు । మనుజుఁడు సంస్మరణము నొసఁగు నిజము. 109

ఆ॥ అధిప వినుము వ్యర్థమగు కోర్కెవలన మ । ర్త్యుఁ డనేక మిగుల నాజ్ఞ సేయు
నందువలన నప్పు లధికమై తనుఁ జెందు । నాజ్ఞ న్యాయసహితమైన మేలు. 110

క॥ న్యాయసహితాజ్ఞనొదవ వా । దాయమ్మగ్గమ్ము బహుళద్రవ్యేచ్ఛ మదిం
జేయక సత్యద్రవ్యము । నేయెడ వెదకింగవలయు నినసమతేజా. 111

తే॥ అని విదితముగ నాపోస్తులైన యార్యుఁ । డిష్ట పౌలోసు లోనఁ జెప్పిన వినఁబు
పగుఁడు కట్టడ చేసిన బ్రదుకువలన । నలరుటయు ముఖ్యమంతేస్తునందు నృప. 112

ఆ॥ ఆద్యుఁ డొసఁగినట్టి యంతస్తులకు మిక్కి । లగునఁ దనకు ననుచు నాసింపఁదగదు
పాపమూలమైన బహుమానమును గోరు । నతఁడు చేటు నొందు నమలచరిత. 113

క॥ ధీరనుత పరుల వార్తలు । వారల వర్తనము లెన్నఁ బోకు హితము లే
గారహిఁ దెలిసిన విన్నట । వారి యభిప్రాయము నఘనివాసం బనుచున్. 114

సీ॥ తలపోయవలదు వారలపై నెవండైన । నెపము నెంచిన నదే నిక్కమనుచు
నమ్మఁగావల దసత్యమ్మని యెంచుట । తగు నణంపక యున్నదాని నెపుడు
కర్ణామృతముగ వినఁగా నొప్పు విను నెడ । నింపుమీఱఁగ సంతసింపవలదు
పరుల పాపము లెన్న నరుఁ డధికంబైన । పాపియౌ నతఁడు తెల్లఁగ వినంగఁ

తే॥ చెవి యొసంగెడు వానికి భవము గలుగు । ననుచు వగదెంచవలయు నటంచు నొక్క
పెద్దగురువానతిచ్చె నా సుద్ది సత్య । వేదసమ్మత మగుచుండు విమలచరిత. 115

క॥ పాపాత్ముల రసనాగ్రము । పాపములకు మూలమగుచు బరునకుఁ దక్కన్
రూపింపఁగ నెవ్వఁడు గల । డే పురుషుఁ డొకని మనసు నెసఁగు సుకృతమున్. 116

చ॥ నిరయము దుర్జనౌఘముల నిష్ఠురబాధల పాలుసేయు న

---

108. తన సెలవును=తన ఖర్చును । తన శక్తికి నెనగా=తన శక్తికి తగినట్లు । ఒనుపదగు=ఒందదగును । శక్తికి ఇరవగునట్లు=శక్తికి తగినట్లు । తెరువు అది అగునా=మార్గము అది యగునా ।

109. తలఁగి=తొలఁగి ।

110. ఆజ్ఞసేయు=ఖర్చుచేయు

111. న్యాయసహితమగు (ఆజ్ఞనొదవ=) ఖర్చుచే వచ్చు (ఆదాయమ్ము అగ్గమ్ము=) గాబట్టియే తగిన ది. (బహుళద్రవ్యేచ్ఛను=) దబ్బున జలి గొప్ప ఆశను మనసున కలిగింపక ఇడని ద్రవ్యమును వెదుకవలెను । ఇనసమతేజా=సూర్యసమానమగు కాంతిగలవాడా!

112. అలరుటయు=(సంతోషించుటయు) బ్రదుకుటయు

113. ఆద్యుఁడు=సర్వేశ్వరుడు । తనరును అనుచు=ఒప్పును అనుచు ।

114. ధీరనుత=బుధులచే నుతింపబడినవాడా । అఘనివాసంబు అనుచున్=పాపమునకు తావు అనుచు ।

115. తలపోయవలదు=తలంచవలదు । నెపము నెంచిన=తప్పుమోపిన । కర్ణామృతముగ=బహుహితముగ ॥ ఇంపుమీరగ=ఇష్టముతో । భవము=పాపము । వగదెంచవలయు=తలంచవలయును । సుద్ది=మాట (నిజము)

116. రసన అగ్రము=నాలుక చివర । రూపింపగ=నిరూపింపగా (ఋజువు చేయగా) పాపాత్ముల నాలుక పాపములకు మూలమగును. ఇతరుల మనసులలోని పుణ్యములను నిరూపించుటకు పరమేశ్వరునికి తప్ప ఇతరులకు చేతఁగలదా?

కోపానలం బంటుకొని వచ్చుతతిని జా। గ్రత్సమేతమనీషఁ గాంచి న్యాయ
ఆ॥ జలముచేత నెల్లఁ జల్లార్పవలెఁగాక। యతఁడు జిహ్వకును శయంబునకును
గయునుతోడ నీయరా దాయుధద్వయం। బందువలన సత్యమణఁగి పోవు. 129
క॥ తపకుం బరులకుఁ గోపం। బున జగడము వచ్చెనేని బూనిక నన్యుల్
తన మనము నొవ్వనాడిన। వినయంబునఁ దాను వారి వేఁడఁగ నొప్పున్. 130
క॥ తామసము పూని వాగల। పై మత్సర మునుపఁదగదు బాంధవ్యము ని
ష్ఠా మహిమఁ జేయఁ జెల్లున। దేమనిన వచింతు వినుము హితముఖ్యనిధీ. 131
తే॥ పగకు వైరాగ్యమునకును బగుఁడు కలిన। మైన యానతి సేయు సమర్థుఁడధిప
కాన నొరు నేరమును మదిలోన నునిచి। వానిమీఁదను జలమూనవలదు సుమ్ము 132
క॥ అపకార మొరులు చేసిన। నుపకారము తాను జేయు టుచితంబగుఁ బ్ర
త్యపకారము గావించిన। విపరీతంబైన యల్పవిధమగుఁ జుమ్మీ. 133
క॥ ఇదిగాక పారుపత్తెము। ముదమునఁ జేయుటయుఁ బాపములఁ దీర్చుటయున్
మదిఁ దలఁపఁగఁ బనులకు స। త్యదయాపరమతికి యోగ్యమని యంద్రు ఘనుల్. 134
క॥ తమ కర్హతరంబగు కా। ర్యము నేరికినైన నీయమని నిజసత్యా
గమమున సర్వేశ్వరుఁడు। త్తమపద్ధతిమై నానతిడియె ధర్మవిచారా. 135
వ॥ దానం జేసి సర్వతంత్రస్వతంత్ర బిరుదాంకుఁడగు సర్వేశ్వరుండు జనవారమ్ముల
నేరమ్ముల వాదింపఁ బారుపత్తెంబు సహించియుండ నగుండు తదుద్యోగంబుఁ బూ
ను టహంకారంబు గాదె యహంకారయుక్తుండగు జనుండు సేయు నవలంబించు పారు
పత్తెం బన్యాయం బగుచుండుంగాని న్యాయసహితంబు గానేరదు బలవత్ప్రభుతా
విభవంబు కంటె స్వాంతంబున శాంతంబు గలిగి యుండుట యోగ్యంబని స్ఫురితుసాం
క్వవు సత్యవేదంబున శాసించుట విచారింపవలయు శాంతం బెట్టిదనిన సర్వేశ్వరున
కనర్హంబగు ద్రోహంబు నొనరించితి దురాచారాభ్యాసంబున పతితనికసహ్యంబుగాఁ

ఎడబాప్రుట = వంతోపమునను పోగొట్టుటను। బుద్ధిని బంధించుట = జ్ఞానమును కట్టివేయుటను। అఖిల దుశ్చేష్టలకు = అన్ని చెడ్డపనులకు। కోప అనలము = కోపమను నిప్పు। జాగ్రత్సమేతమనీష = జాగ్రత కలిగిన బుద్ధితో। జిహ్వకును = నాలుకకును। శయంబునకును = చేతికిని। ఈయరాదు ఆయుధద్వయంబు = రెండు ఆయుధములను నివ్వరాదు।

130. పూనిక = ప్రయత్నముతో। తన మనము నొవ్వనాడిన = తన మనస్సుకు కష్టము గలుగునట్లు మాటాడిన।

131. తామసము = తమోగుణము। మత్సరము = కోపము। ఉనుపదగదు = ఉంచదగదు। బాంధవ్యము = (చుట్టరికము) స్నేహము। నిష్ఠామహిమ = నియమపూర్వకముగ। హితముఖ్యనిధీ = ఉపకారములు పొందదలగువానికి నిధివంటివాడా।

132 మనుజుడు = దేవుడు। ఆనతి = ఆజ్ఞ। కాన ఒరు నేరము = కనుక ఇతరుల తప్పును। చలము ఊనవలదు = కోపపడ గూడదు।

133. ఉచితంబు అగు = న్యాయము అగును। ప్రత్యపకారము = బదులు కీడు। విపరీతమైన = ఆశ్చర్యమైన అల్పవిధమగును = నీచమగును।

134. పారుపత్తెము = అధికారము। సత్యదయాపరమతికి = సత్యమైన దయగలవానికి।

135. తమకు అర్హతరంబు అగు = తమకు తగినదియగు। ఏరికినైన = ఎవ్వరికైనను। ఈయము అని = ఇవ్వము అని। నిజసత్య ఆగమమున = తన సత్య వేదమున। ఉత్తమపద్ధతిమై = మిగుల గట్టిగా।

136. సర్వతంత్ర స్వతంత్ర బిరుదాంకుడు = అన్ని సిద్ధాంతములకు స్వతంత్రుడను బిరుదుగలవాడు। జనవారమ్ముల = మనుష్య సమూహములయొక్క। తత్ ఉద్యోగము = ఆ అధికారము। అహంకారయుక్తుడు = కోపముతో

ప్రవర్తించితిఁ బరాత్పరుం డధిక దయారసంబునఁ జేతనసంరక్షణార్థంబుగా మను
ష్యావతారంబు నొంది విజ్ఞానవచనప్రబంధమ్ము లనేకమ్ములు నిర్మించి నైచ్యల
క్ష్యంబుకొఱకు స్లీవమ్రానునందు బంధింపఁబడి ప్రాణప్రయాణం బొనరించుట
మదర్థంబుగదా యని యెల్లం జింతింపక యుష్మద్ద్రోహాత్ముని బోధావిరోధంబు నిర్లక్ష్యం
బు గావించి యతనికిఁ గోపంబు రా నమితమ్ములగు పాపమ్ములు ప్రత్యహమ్ము నొన
రించితి మత్కృతాపచారమ్ముల సహించి రక్షింపుమని యీ దయామయుని చరణమ్ముల
పయింబడి ప్రార్థింపనట్లయిన దేవుండు స్వేష్టప్రసాదంబు ననుసంధించు నను నివి
శాంతంబున గంగంబులై యుండు. 136

తే॥ మఱియు శాంతంబు లేనట్టి మానవుండు । తన కొరులు సేయు నేరమ్ములను సహింప
ననుచు నొరులను బాపాత్ములనుచుఁ బలుకు । నది వివేకంబుగాదు మహాత్ములవినుము. 137

క॥ తా సర్వేశ్వరుఁ గూఱిచి । చేసిన నేరములకన్న తృణమౌ దనకు నొరుల్
చేసిన నేరం బధికమె । యీ సరణి నెఱుంగవలయు హితనుతవిభవా. 138

సీ॥ తన నేరములఁ బరాత్పరుఁ డోర్చునటువలె । నొరుల నేరములఁ దా నోర్వవలదె
యెల్లప్పుడై యుండు తానధికుఁడౌ దేవుని । చే పనంబులు గొని చేయరాని
నేరముల్ స్వామికి నిరతంబుఁ జేయుచుఁ । బరుని చే క్షమియింపఁ బడుచునుండి
తనవలె మర్త్యుఁడై జననమందిన వాని । నేరమ్ములను నోర్వనిది నయంబె

ఆ॥ స్వాసువుల నొసంగి సదయుఁడై తనుఁ బ్రోచి । నట్టి జీసుగురుసన్నైన నడిసి
తెలిసి యెవరి నేరములైన నోర్వఁగా । వలయుఁ దక్కినట్టి వారికెల్ల. 139

క॥ పరులకుఁ బగగా నిలిచిన । వరదుండగు పరునితోడి పగఁ బూనిన వై
ఖరినుండు దానఁ దాని । ధరఁ జేసిన పుణ్యములు వృథా ఫలములగు౯. 140

మ॥ జగడం బెవ్వరితోడఁ జేయు వగఁ డిచ్ఛ న్వారితో సఖ్యమే
జగతిం జేయుట ముఖ్యమౌ నటులు సత్సాంగత్యహీనంబె విం
తగఁ దాఁ బూనినయంత కాలమున నే ధర్మంబు తాఁ జేసిన౯
విగతార్థంబయిపోవు దేవుఁ డతని స్వీక్షించి రక్షింపఁడు౯. 141

---

కూడినవాడు । సేయ నవలంబించు=చేయ మొదలు బెట్టు । బలవత్ప్రభుతా విభవంబు=బలవంతుడగు అధికారభాగ్యము । శాసించుట=ఆజ్ఞాపించుట । అనర్హంబు అగు=తగనిదైన । దురాచార అభ్యాసంబున=చెడుపనులను చేయుటచే । చేతన సంరక్షణార్థంబుగా=మనుష్యులను రక్షించుటకై । జ్ఞానవచన ప్రబంధమ్ములు=విజ్ఞానపూరితములగు ఏర్పాటులు । నైచ్యలక్ష్యముకొఱకు=భక్తి మొదలయినవానిచే గలుగు అధమభావమును పొందుటకై । ప్రాణప్రయాణము=మరణము । మదర్థంబు=నాకొఱకు । మత్కృతాపచారములు=నేను చేసిన పాపములు । స్వేష్టప్రసాదము=తన ఇష్టప్రసాదము । అనుసంధించు=ఇచ్చును

137. సహింపఙ=ఓర్వను ।

138. ఒరుల్=ఇతరులు । హితనుతవిభవా=స్నేహితుల స్తోత్రములుగొను సంపన్నుడా ।

139 క్షమింపబడుచు=క్షమింపబడుచు । నయంబె=న్యాయమా । స్వాసువులు=తన ప్రాణములను ।

140. వరదుండు=వరముల నిచ్చువాడు (సర్వేశ్వరుడు) వైఖరిఙ=విధమున । వృథాఫలములు=నిష్ఫలములు (వ్యర్థములు)

141. ఇచ్ఛఙ=ప్రేమతో । సఖ్యము=స్నేహము । సత్సాంగత్య హీనంబె=మంచిస్నేహము లేకుండుటయే । పూనిన యంతకాలమున=పూనినంతకాలము । విగతార్థంబయి=ప్రయోజనము లేనిదై । వీక్షించి=చూచి । రక్షింపడుఙ=రక్షింపడు ।

క॥ స్వామీ దయాకర నిర్ఝర। మే మాత్రముఁ బొరలదేని హితవినుతప్ర
జ్ఞా మోక్షఫలము దొరకదు। కా మనుజుఁడు మీఁదికేఁగఁ గావక తిరుగున్. 142

సీ॥ అందునఁ బగచేత నరుఁ డొంచు కీడులు। మది విచారించి ధర్మంబటంచు
సంగతులతో మైత్రిఁ జెంది యుండఁగ నొప్పు। సమ్మతి దేవుని సొమ్ముగాన
తాను సమ్మతి గల్గి భూనుతుండైన యే। సు గురూత్తముఁడు సత్యనిగమరీతి
బోధించి పరలోకమున కేఁగుటకు స్నేహ। మును పుణ్యసంచయమ్మును వహింప

తే॥ వల్మనగు సమ్మతముఁ జేసి యుపుడు మోక్ష। మునకు నేగిరటంచుఁ దా వినయమునను
గట్టిగా సర్వజనులతోఁ జుట్టరికము। కలసి యుండిన ముక్తి సౌఖ్యంబు గలుగు. 143

క॥ సమ్మతి యను పుణ్యము ని। త్యమ్ముఁ బిశాచమును జంపు నది నరకద్వా
రమ్మును మూయును ముక్తిద్వా। రమ్మును దెఱచుం బరుండు రయమునఁ దోఁచున్. 144

క॥ నరుఁ డందు నిలిచినను ద। త్కరుణాకరమున ఘటించు కడ నెఱుఁగని మేల్
కరముఁ బగ గల్గనేనియు। స్థిరముగను బిశాచమునండి చేటులు దెచ్చున్. 145

సీ॥ వరతపోధనులైన వారానతిచ్చిన। క్రమమును విని నిర్వికారమతివి
నుపవాసమఖిలపం బొనరింప నాతని। దురితసంఘము నోర్చుఁ బరుఁడు దాని
కంటె నన్యమనుజుల్ గావించినట్టి నే। రముల నోర్చుట ఘనం బమలచరిత
రహి నీవు పరుల నేరముల సహించిన। నీ నేరములనెల్ల నే సహింతు

తే॥ ననుచు సర్వేశ్వరుఁడు వేదమున విధించె। నది తెలిసి సత్క్రియాశాలి యగు నరుండు
పరుల నేరము లెన్నక పరఁగు నతఁడు। పాపముల నొంచవలె మనస్తాప విధిని. 146

ఉ॥ అందున మోక్షపట్టమున కర్హుఁడగు న్మదిలోన వైరముం
జెంది పరాపరాధములఁ జేకొని యోర్వక నిల్చనేని ని
ష్పంద! వికారమౌ నరకబాధల నొందు నతండు దీపికిన్
సందియ మింతలేదు మది జాగ్రత నిల్పినఁ జాల మేలగున్. 147

చ॥ పరుల వగఱు న్మనంబునను వైరము మానక యెంత పుణ్యమున్
ధరణి నొనర్చుతి న్మరుల ధర్మపథంబున నే గమించి తాం
చరయుఁగరా దెటన్నఁ గలయాం దతి దూరముగాఁగ నేగినం
బరువడి మేలు కాంచ నొక పాదముఁ బెట్టఁగలేడె యవ్వలన్. 148

142. స్వామి దయాకర నిర్ఝరమా=సర్వేశ్వరుని దయ అనెడు సెలయేరు। ఏ మాత్రము పొరలదేని=కొంచెమైనను పొరలనియెడల। హితవినుతప్రజ్ఞా=హితులచే నుతింపబడిన ప్రజ్ఞగలవాడా। దొరకదు కా=దొరకదు సుమా।

143. సమ్మతి=సమాధానము। భూనుతుఁడు=లోకపూజ్యుడు। సత్యనిగమరీతి=సత్యవేద విధులను। పుణ్యసంచయము=పుణ్యములరాశి।

144 ముక్తిద్వారము=మోక్షద్వారము। రయమున దోఁచున్=శీఘ్రముగ గన్పించును।

145. ఘటించు=కూర్చును। కడ నెఱుఁగని మేల్=అంత్యము లేని మేలును (మోక్షములో నిలిచినచో సర్వేశ్వరుడు తన దయాకరముచే మితిలేని సౌఖ్యమును గూర్చును)

146. వర తపోధనులు=శ్రేష్ఠులగు తపమే ధనముగ గలవారు। నిర్వికారమతిన్=వికారములేని మనస్సుతో। ఉపవాసమఖిలపము=ఒక్కప్రొద్దు మొదలైన తపములు। దురిత సంఘమును=పాపముల సమూహమును।

147. మోక్షపట్టము=మోక్షపదవి। పరాపరాధములు=ఇతరుల తప్పులను। జేకొని=తీసికొని। నిష్పంద=పిఱికితనము లేనివాడా।

148. నే గమించితి అంచు=నేను నడచితిననుచు। బరువడి=మరల। మేలు కాంచన్=మేలొందనగా।

తనయులలోన నొక్కనికిఁ దద్దయు నెంచితి వీవు స్లీవ్రమా
తునను మదర్థమై యెదను గొంకక ప్రాణము లిచ్చినట్టి ని
న్ననఘుని న్యాయపద్ధతి నహంకృతి మాని నుతింపఁ జెల్లదే. 157

ఉ॥ కొంచక మిమ్ము స్లీవనిడి కొట్టిన వారల ఘోరపాతకం
బెంచక యోర్చి దేవుని నహీనమనీషను వేఁడుకొంటిరే
మంచన మీర లేనును బరాపకృతి క్షమియించు టొప్పదే
యించుక మీ కృపాబ్ధి నెనయించినఁ గాంచనె మోక్షసంపదన్. 158

సీ॥ ధరణిపై నేను దేవరవారి బిడ్డనై । పరఁగిన, మీర లీనరుల నేలు
విధమున నన్ను భావించి ప్రోతురు గాదె । రాతిరి పగలు దుర్జన వితతికి
సజ్జనౌఘమున కెంచఁగరాని మేలు నొ । సంగు మీ కరుణ నెఱింగియేను
పరులపై నేగతిఁ గరుణ గల్గక యుందుఁ । నాకు నేరము సేయు నరుఁడు మీకు

తే॥ భక్తుఁడై యున్న నతనిపైఁ బగను బూన । నేర్తునే నేను, బాపము నేను జేసి
యొరుల పావము నాత్మలో నుంచుకొట్లు భక్తరక్షక సర్వేశ భవవినాశ. 159

చ॥ సదయ పరేశ నేనిపుడు సల్పిన నేరము లన్నిటిన్ భవ
త్పదములయందుఁ బెట్టితి ధృవంబుగ మిమ్ములఁ జూచి యంతయున్
మదిని సహించితిం బరులు నాకొనరించిన చేటు నెంచకన్
వదలక మేలు వారలకు వాంఛ నొసంగము తండ్రిపోలికన్ 160

సీ॥ అనిశంబు మీకును నేనొనరించినట్టి నే । రముల సహించి న్యాయమున వాని
కాజ్ఞఁ బ్రసాదింప నవధరింపుఁడి నా మ । నంబులోఁ గల్గు కోపంబు నుడిపి
కేరి తాలిమియను కేడెముచే దాని । క్షమియించుఁడేని సమర్షంబు నణఁప
విమలమౌ సద్విచారము నొసంగుఁడు మర । ణ సమయమున నోర్వ వసములేని

తే॥ యట్టివారికిఁ గఠినమైనట్టి యాజ్ఞ । వచ్చునని దయయును దాల్మి వదలకుండు 161
వారలకుఁ గల్గు ఫలమును వరుసఁ దెలిసి । యేనుఁ దాలిమిచే మిమ్ము నెపుడు దలఁతు.

క॥ శాంతియుత స్వాంతుఁడనై । సంతతము భవన్మనమున సంతస మొదవన్
వంతునకు నెక్కు నతి గా । వింతు ననుచు వేఁడుకొనిన వేగమ ప్రోచున్. 162

157. అనయుఁడనైన నన్=దుర్మార్గుఁడనైన నన్ను । నయ అన్వితుఁ గాన్=న్యాయముతో కూడినవానిగ । తద్దయున్=మిక్కిలి । మదర్థమై=నా కొఱకై । ఎదను గొంకక=మనసున సందేహింపక । నిన్ను అనఘుని=పాపరహితుఁడవైన నిన్ను । అహంకృతిమాని=గర్వమును విడచి ।

158. కొంచక=సందేహింపక । అహీనమనీషన్=గొప్ప బుద్ధితో । మీరలు వేడుకొంటిరి ఏమంచు అనన్=మీరు వేడుకొంటిరి, ఏమని యనఁగను । ఏనును=నేనును । పరాపకృతిన్=ఇతరుల తప్పును । ఇంచుక=కొంచెము । మీ కృపాబ్ధిన్=మీ దయా సముద్రమును । ఎనయించిన=పొందించిన ।

159. దుర్జనవితతికిన్=దుష్టుల మూకకు । ఓఘము=సమూహము । భవవినాశ=పాపమును పోగొట్టువాడా ।

160. సదయ=దయగలవాడా । ధృవంబుగ=గట్టిగ । వాంఛన్=ఇష్టముతో ।

161. అనిశము=ఎల్లప్పుడు । ఆజ్ఞన్=శిక్షను । ఉడిపి=పోగొట్టి । కేరి=ఉత్సహించి । కేడెము=డాలు (యుద్ధమున దెబ్బ తగులకుండ అడ్డము పెట్టుకొను ఆయుధము) అమర్షంబును అణపన్=కోపమును అణచుటకు । వసము లేని=వశము లేని ।

162. శాంతియుత స్వాంతుఁడనై=శాంతముతో కూడిన మనసుగలవాడనై । భవత్ మనమున=నీ మనసున । వంతునకు నెక్కన్=పేరు నకెక్కునట్లు ।

శా॥ ఈ పాపంబున లేసిసజ్జనుఁ డమోఘేచ్ఛాన్వితుండైనను దు
ర్వ్యాపారమ్ములఁ ద్రోయు చేటుగములం బాటింగఁ ద్రోలుం గ్రియం
దీపించు న్సువిచార ఖడ్గమున ఛేదించు న్మహాఘాటవిన్
లోపం బించుక లేని జ్ఞానఫలము న్మోక్షంబునుం జెందెడున్. 169

శా॥ భూలోకంబున నుండు మేలుగములం బొందంగ వాంఛింపఁడు
ద్వేలాన్యప్రతిమానశూన్య పదవి న్వేమారు మెచ్చున్మది
న్వాలాయంబుగ జ్ఞానసంగతము నా భావంబుచే మించుఁ దా
వ్రీలన్లేని పరేశు సత్కరుణచేఁ బెంపొందు నెల్లప్పుడున్. 170

ఆ॥ ధరణి లోభమనెడు ద్రవ్యంబుపైఁ గ్రమ । రహితమైన యాశ బహుళమగుచు
నుండెనేని దాని నురుపాపకారణం । బండ్రు దాన వాంఛ లమరు రెండు. 171

క॥ న్యాయాన్యాయములను గుఱి । సేయక ద్రవ్యమును వెదకి చెందుట యొకటౌ
నేయెడ సమయమున సెలవు । సేయమి రెండవది యయ్యెఁ జేకొని దాఁపన్. 172

సీ॥ పరుస నీరీతి పాపంబు గల్గినవాఁడు । పిసిని లోభి యటన్న పేర్లు గాంచు
నిది మానవులయొక్క మదిని గల్గిన దయా । ధర్మమ్ములను ద్రోసి దుర్మదంపు
మృగముల గుణములు మిగులఁ బుట్టించు నీ । ధర్మేతరంబను తల్లివలన
నొగిని నాల్గురు బిడ్డలు దయింతు రనుకం । పాత్మయుఁ బరులను భంగపెట్టు
టన్నృతోక్తులాడుట యన్యులకును ద్రోహ । మును రచించు టసత్యమున నె యాన
పెట్టుట నెమ్మది నెట్టన చంచలం । బాదవుట యివి వారి కాదవినట్టి
యాఖ్యలిల్లాటచే నా జేసునాథుని । యాపోస్తులరయఁ దామానతిడిన
యది ధనంబునుగూర్చి యధికార్థవంతుఁడై । యుండ నుద్యోగంబు నిండఁజేయు
తే॥ మనుజుఁడుగ్ర పిశాచ శోధనలయందు । నురులఁ బడి చేటులను గూడియుండు వ్యర్థ
వాంఛలను జెందునది నరవర్గమునకు । జావు కీడులఁ దెచ్చు నిచ్చట నటంచు. 173

169. అమోఘ ఇచ్ఛ అన్వితుడు=వ్యర్థము కాని కోర్కెతో గూడుకొన్నవాడు । దుర్వ్యాపారమ్ములన్=చెడు పనులను । ద్రోయున్=విడిచిపెట్టును । చేటుగములన్=కష్టముల సమూహములను । క్రియం దీపించున్=పనులలో ప్రకాశించును । సువిచారఖడ్గమున=మంచి విచారములనే ఖడ్గముచే । ఛేదించున్ మహా అఘ అటవిన్=మహా పాపములనెడు అడవిని నఱకివేయును.

170. మేలుంగములు=ఉపకార సమూహములు । ఈ ద్వే॰ అన్యప్రతిమానశూన్య పదవిన్=ఎక్కువయైన ఇతర సాటిలేని పదవిని (మోక్షమును) । వాలాయంబుగ=నిరంతరమును (ఎల్లప్పుడును) జ్ఞానసంగతము నా భావంబుచే=జ్ఞానముతో కూడుకొనిన మనసుతో । వ్రీలన్ లేని=విచ్ఛేదము కాని (చెడని) పరేశు సత్ కరుణచే=సర్వేశ్వరుని యనుగ్రహముచే ।

171. క్రమరహితమైన=క్రమము లేని । బహుళము అగుచు=ఎక్కువగుచు । ఉరుపాపకారణము అండ్రు=గొప్ప పాపమునకు కారణమందురు । వాంఛలు=కోర్కెలు । రెండు అమరు=రెండు కల్గును ।

172. గుఱిసేయక=చూడక । ఏయెడ=ఎప్పుడైనను । సెలవుసేయమి=ఖర్చుపెట్టనిది । చేకొని దాపన్=తీసికొని దాచిపెట్టగా ।

173. ధర్మ ఇతరంబు=ధర్మము కానిది । ఒగిని=క్రమముగ । బిడ్డలుదయింతురు=బిడ్డలు పుట్టుదురు । అనుకంప ఆత్మ=దయలేని ఆత్మ । అనృతోక్తులు ఆడుట=అసత్య వాక్యములు పలుకుట । రచించుట=చేయుట । అసత్యమునని యాన పెట్టుట=అబద్ధమునందే ఒట్టుపెట్టుట । నెమ్మది=నిండు మనమున । నెట్టన=అనివార్యముగ । ఆఖ్యలు=పేరులు । అధిక అర్థవంతుడై=గొప్ప భాగ్యవంతుడై । నరవర్గమునకు=మనుష్యజాతికి ।

కరము లలర్ బయల్పఱచు గ్రక్కున సస్యలతోడి స్నేహమున్
వరమతి నిచ్చుఁ బ్రత్యుల మనంబునకున్ ఘనవైభవం బిఁకన్. 176

క॥ పరదేశు లిక్కట్టగు । నరులకు జనకుండులేని నారంబులకు ని
ర్ధన జననియునఁగఁదగు నం । దఱి కుపకారంబు సల్పు న్యాయముతోడన్. 177

ఆ॥ వసుధ సకలమైన వారలచే బహు । మాన మొసఁగఁ జేయు మానవులకు
నందఱకును మోద మధికమై పెంపొందుఁ । బ్రత్యర్థులకును మేలుపఱఁగఁగూర్చు 178

క॥ క్రమతి దరిద్రులు తప్పు । న్యాయమునకు నాచారములు ప్రియంబునఁ జేయన్
దొరకొందు రందువలన వి । తరణమునకు సాటి గలదె ధర్మజ్ఞనిధీ. 179

సీ॥ వినుము మట్టి యౌదార్యమును విఫలంబుగా । వ్యయము గానీయఁగవలదు సుమ్ము
వెసనట్లు చేసిన పిసినితనంబుపై । నెపుడు నసహ్యత నిడఁగఁబోలు
నది యెట్టిదన హీనమైయుండు పిసినిత । నం బయశోవమానంబులకును
నిలయమైయుండు నఖిలజనములు దాని । దూషణం బొనరించి తొలఁగఁ జూతు
ఆ॥ గరయ లోభియైన నరుఁడు మనుష్యత్వ । భావమైన దయను బాసి దుష్ట
మృగమువలెన యుండి తగు పేదలకు నేమి । మేలు చేయలేక మెలఁగు మఱియు 180

తే॥ అనిశ మందఱి కన్యాయమును ఘటించు । నందఱిని దబ్బఱల భ్రమనందఁ జేయు
మనసుని దాలిమిలేక యున్నదియుఁగాక । యొదవుఁ బరిపరి చింతలు కొదవలేక. 181

ఆ॥ జనము నీకు సుఖము ఘనమైన ద్రవ్యంబు । నిడదమనిన బుద్ధి నడఁపలేఁడు
తనకు సుఖము నీక తగనట్టి కస్తిని । నిచ్చుచుండ నేల యెఱుఁగఁడొక్కొ. 182

సీ॥ అర్థంబునకుఁ గర్తమై యుండనోపక । దానికిఁ దా దీనదాసుఁడయ్యెఁ
బూని యాద్రవ్యంబుతో నెన్ని కీడులు । వచ్చునో తెలియలేఁ డిచ్చకొలఁది
దానిపై మది నాశ మానియుఁ దద్ధనం । బును పద్దసేయక యునికి దగును
బంగారమును వెండి రంగైన మణులు న । త్యంబుగాఁ దగిన ద్రవ్యములు గావు
తే॥ విమల మానసమునఁ జేయు పుణ్యములు సత్య । మైన ద్రవ్యంబులగుఁ జుమ్ము వానివలన
నాత్మ సద్ద్రవ్యములు గల్గవై మెలఁగు । ఘనతరోదార క్షీరసాగరగభీర. 183

ధర్మబృందమున్=పుణ్యములను । కరము అలర్ బయల్పఱచు=మిక్కిలి ఒప్పునట్లు వెల్లడిచేయును । వరమతి=మంచి మనసుతో ।

177. ఇక్కట్టగు నరులకు=కష్టములోనుండు మనుష్యులకు । నారంబులకు=జనులకు ।

178. వసుధన్=భూమియందు । అందఱిచే గౌరవమిప్పించుచు, అందఱకును సంతోషము పెంపగును, విరోధులను (=ప్రత్యర్థులను) గూడ మేలు చేయును.

179. క్రమతి=క్రమముగ । దొరకొందురు=ప్రయత్నింతురు । వితరణము=(దాన) ధర్మగుణము ।

180. వ్యయము గానీయవలదు=ఖర్చు కానీయరాదు । వెసన్ అట్లు=శీఘ్రముగ ఆ విధమున । అసహ్యతన్ ఇడగఁబోలు=అయిష్టమును చూపదగును । అయశోవమానములకు=అపకీర్తికి, అవమానమునకు । నిలయము=స్థానము ।

181. అనిశము=ఎల్లప్పుడు । ఘటించు=కల్పించును । దబ్బఱలన్=అబద్ధములచే । పరిపరి చింతలు ఒదవు=పలువిధములగు చింతలు కల్గును.

182. బుద్ధిన్ అడపలేడు=మనసును అణపలేడు ।

183. అర్థంబునకు=ధనమునకు । పద్దసేయక యునికి దగును=లెక్కసేయకుండుట మంచిది । విమల మానసమున్=పరిశుద్ధ మనసుతో । ఘనతరోదార=గొప్ప ధర్మాత్ముడా! క్షీరసాగరగభీర=పాలసముద్రమువంటి గాంభీర్యము గలవాడా ।

దివ్యమై తోఁచు పుణ్యంబు లేదైన నీ పుణ్యంబునై యగణ్యంబుగ ననేక స్తోత్రమ్ములఁ బురుషులు కల్పించియుండినను దత్పుణ్యంబు నన్వేషింప నాయాసంబున కోర్చు మానవు లసదు గావున జనకుండగు పరాత్పరుని కుమారుండగు ఘనుండు తత్పుణ్యాన్వేషణార్థంబు భూలోకంబునకు డిగి యా పుణ్యంబును దెలిసి తన్మహామహిమాతిశయంబును మనకు బోధ గావించిరి కాదె, విశ్వభర్తయగు సర్వేశ్వర ప్రసాద సిద్ధ్యర్థంబుగా నస్తమిత సమస్త వస్తునిచయుండై దారిద్ర్యంబు స్థిరంబుగాఁ దాల్చి యాద్దేవునిపై లక్ష్యంబు నిల్పుట యక్షీణ మహిమాన్వితంబగు పుణ్యమ్మగు నయ్యది, సమార్ద్ర స్వాంతంబున నీ పుణ్యంబు ననుభవించు క్రైస్తవులే తత్పుణ్యానుకూలంబులగు మేలుల ననుభవింతు రిదియునుంగాక. 8

తే॥ పరుని కొఱకు దరిద్రంబునై మనంబు । నమర నిల్పిన జ్ఞానదరిద్ర్యంబులందు
నెన్ని నలుఁగై వసించిన యీ దరిద్ర । పుణ్యమహిమను నెఱుఁగ నీ పుడమిఁ దరమె 9

సీ॥ వసుధ లోభంబను పిసినితనంబున । వచ్చు చేటులు నెల్ల గుర్తెఱిఁగియుఁ
దమ నమ్మియున్న వస్తువ్రజము మనంబున నిల్ప । లేనట్టి కాఁపురుషులందు
ధనవాంఛ తన మనంబునఁ జొరకుండ హృ । త్సరణి నిలిపి సతతంబు మాయ
నరుఁడు దేవునకు సామ్యంబైన భాగ్యమం । దుండని యేసుక్రీస్తు వచించెఁ

తే॥ నాదు భూలోకమున నుండు నరులకెల్ల । గట్టి మనసుండి విజ్ఞాన కౌతుకమున 10
బహు దరిద్రంబుచే వచ్చు భాగ్యము నిజ । మనుచు సర్వేశ్వరుని వేఁడుకొనఁగవలయు.

మ॥ నను రక్షించెడు జేసు సద్గురుమణీ నా పాలి దైవంబ లో
కనుతోదారచరిత్ర కన్పడుచుం గారుణ్యవారాశివ
య్యున్, సర్వేశ్వర నామధేయమును సత్యోదంచిత ప్రజ్ఞయుం
గను నీవిట్లు మదర్థమై పొడమితే గాదే దరిద్రంబునన్. 11

చ॥ మనుజుఁడవై జనించి యసమాన దరిద్రముచేత నన్ను ద్ర
వ్యనిధిగఁ జేయ వచ్చితి రవార్యతరంబగు సంతసంబు గ
ల్గును దమ కేసునాథ గురులోక శిఖామణులైన మీరలే
పని వెదకంగఁ బంచితిరి స్వామి ధరాస్థలిఁ గంటి రే క్రియన్ 12

ల్పము । తత్ పుణ్య అన్వేషణ అర్థంబు=ఆ పుణ్యమును వెదకుటకొఱకు । తత్ మహామహిమాతిశయమును=దాని గొప్ప ప్రభావమును । సర్వేశ్వరప్రసాదసిద్ధి అర్థంబుగా=సర్వేశ్వరుని ప్రసాదము కలుగుటకై । అస్తమితసమస్త వస్తునిచయుండై=సమస్తవస్తువులను విడిచినవాడై । స్థిరంబుగా=స్థిరముగా । అద్దేవునిపై లక్ష్యంబు నిలుపుట=ఆ దేవునిమీద గురి నిలుపుట । అక్షీణ=తక్కువ కాని । మహిమ అన్వితము=మహిమతో కూడినది । సమార్ద్ర స్వాంతంబున=సంతోషముగల మనసుతో । తత్పుణ్య అనుకూలములగు=ఆ పుణ్యమువలన కలుగు ।

9. మనంబున్ అమర నిల్పిన=మనసును బాగుగ నిల్పిన । నలుఁగై వసించినవి=నలుదిక్కుల ఉన్నవి ।

10. హృత్ సరణి=హృదయమార్గమును । విజ్ఞానకౌతుకమున=మంచి విజ్ఞానసంతోషముతో ।

11. లోకనుత ఉదారచరిత్ర=లోకముచే స్తుతింపబడిన గొప్ప చరిత్రుడా । కారుణ్య వారాశివయ్యున్=కరుణా సముద్రుడవయ్యును । సత్య ఉదంచితప్రజ్ఞయుంగను నీవు=నిజమైన గొప్ప ప్రజ్ఞయు గలవాడవైననీవు । మత్ అర్థమై=నా కొఱకై । పొడమితే గాదె=పుట్టితివి గదా ।

12. అసమాన=సాటిలేని । ద్రవ్యనిధిగ=భాగ్యవంతునిగ । అవార్యతరంబగు=నివారింపరాని । గురులోకశిఖామణులు=గురువులలో శ్రేష్ఠులగువారు । స్వామి పంచితిరి=సర్వేశ్వరుడు పంపెను । ధరాస్థలిగంటిరి ఏక్రియన్=భూమికి ఎట్లు వచ్చితిరి ।

ఆ॥ ఏమి చెప్పికొంటి రెనలేని దారిద్ర్య। మును గదా దలంప మొదలు పేద
నగుచు నొక్క పశుగణాలయంబునఁ బుట్టి। జగతి నెల్లదిశల సంచరించి. 13

సీ॥ స్త్రీవస్త్రమానున నొక్క చేలమైనను లేక। దారిద్ర్యమునవె బంధనము నొంది
ప్రాణపంచకమును బాసితి రింతయుఁ। దనర విజ్ఞాన విధంబు నాకు
బోధింప నేరదా; పూనెదనింతయు। స్థిరమైన గురుఁడ యీ దినమునుండి
యీ లోక సౌఖ్యంబు నీ ద్రవ్యమును వీడి। సంసారమున కవశ్యముగవలయు
తే॥ మాత్రమును బూర్ణమనుగాఁగ మదిఁ దలంచి। యుండుఁ గొదవగు కాలమునందు దాని
వినయమును శాంతమును గల్గి యనుభవింప। నాకనుగ్రహ మొసఁగు మనాదిదేవ! 14

క॥ అని సన్నుతి గావించిన। ఘన దారిద్ర్యంపుఁ బుణ్యాగరిమను దేవుం
డనిశంబు నొసఁగు నవ్విధి। దనరెడు మోక్షంబు గల్గు ధర్మవిచారా. 15

క॥ దీనార్థులు తను వేఁడినఁ। బోనాడక భిక్ష మొసఁగ పొదిపినధర్మం
బౌ నెన్న సకల పుణ్యాని। ధానంబది పరుని హృదయ దర్పణము చుమీ. 16

సీ॥ మర్మంబులేని యీ ధర్మంబుమీఁదను। సర్వేశ్వరుని వేదచయమునందు
సర్వఋషిష్టులు వ్రాసినట్టి పుస్తకముల। స్తవములు గలిగియున్నవి సతంబు
సర్వేశ్వరుఁడు పంచజనుల కిల్బిషముల। నోర్వను మోక్షభాగ్యోన్నతి నిడఁ
దక్కిన పుణ్యముల్ దనరుచుండినన్నైన। భిక్ష మొసంగెడి విదితమైన
తే॥ ధర్మమెన్న విశేషమై తొలఁగకుండు। మగిడి పాపమ్ములను జేయు మనసు పుట్ట 17
నీకుకను దాని చెలఁవొందునివ్విధమున। నిటులుగ్రహియింపుమిదిశత్రుపటలహరణ.

వ॥ తత్పుస్తక వ్రాతమ్ములయం దనేక విశేషంబులు గల వవి యెల్ల వినుము. 18

తే॥ ఆగమమునందు మొదటిదైనట్టి వచన। మునను దెల్పెడి యర్థ మంబువు మహాగ్ని 19
వణఁచు క్రియ భిక్షమును ధర్మమధికమైన। కోపమును నాశనము చేయుఁ గుధర ధైర్య.

తే॥ అందు రెండవయది రహస్యమున మనుజుఁ। డొసఁగు భిక్షంబు భిక్షుకు నొడిని డాఁగి
యుండి సర్వేశ్వరుని మది నుండు కోప। మును విదారించు నిజముగఁ బ్రణుతశీల. 20

13. ఎనలేని=సాటిలేని। పశుగణ ఆలయము=పశువుల కొట్టము।

14. చేలము=బట్ట (వస్త్రము)। బంధనము నొంది=కొట్టుబడి। తనరన్=ఒప్పునట్లు। పూనెద నింతయు=ఇది యంతయు పూనెదను। అందున్ కొదవ అగు కాలమునందు=అందులోను తక్కువయైనప్పుడు।

15. పుణ్యాగరిమను=పుణ్యముయొక్క గొప్పను। తనరెడు=ఒప్పునట్టి।

16. దీన అర్థులు=దరిద్రులైన భిక్షకులు। పోనాడక=తిట్టక। పొదిపిన ధర్మము=వృద్ధియయిన పుణ్యము। పుణ్యనిధానము=పుణ్యముల రాశి। పరుని హృదయదర్పణము=దేవుని మనసు అను అద్దము।

17. వేదచయమునందు=వేదసంగ్రహమునందు। స్తవములు=స్తోత్రములు। పంచజనుల=మనుష్యుల। కిల్బిషములు=పాపములను। మోక్షభాగ్యోన్నతిన్=మోక్షభాగ్యముయొక్క గొప్పతనమును। ఇడన్=ఇచ్చుటకు। విదితమైన=స్పష్టమైన। తొలఁగకుండు=తగ్గిపోకుండును। చెలువొందున=ఒప్పుచుండును। శత్రుపటలహరణ=శత్రుసమూహమును హరించువాఁడా।

18. తత్ పుస్తక వ్రాతమ్ములయందు=ఆ పుస్తక సమూహమునందు।

19. ఆగమము=దైవగ్రంథము (మతగ్రంథము)। అంబువు=నీరు। మహా అగ్నిన్=గొప్ప నిప్పును। కుధర ధైర్య=పర్వత సమాన ధైర్యముగలవాఁడా।

20. భిక్షుకుని ఒడిని=యాచకుని ఒడిలో। విదారించు=పోగొట్టును। ప్రణుతశీల=మిక్కిలి పొగడదగిన గుణముగలవాఁడా।

మీరు భిక్షము నిచ్చి మెలఁగినందున మోక్ష । మునమందుఁ డని పల్కరనుచు సత్య

తే॥ వేదమునఁ జెప్పియున్న దీయాశలేక । ధర్మమును జల్పకుండినఁ దగని నరక 28
మునకుఁ బోవుట కృతధర్మమునను మోక్ష । మునకుఁ బోవుట తప్పదు సనయశీల.

క॥ కర మిల నాగమార్హమగు కార్యము నేటికిఁ జేయరొక్కొ యీ
నరులకు భిక్షమిచ్చిన ఘనంబగు సత్ఫల మబ్బుఁగాదె యీ
కరణి గురూత్తముల్ పలుకఁగా వినరాదె మనంబు శాంతితో
సరియగునే తలంపఁగను శాశ్వత కీర్తిని జెందరాదొకో. 29

చ॥ ఇవి వినఁ బల్కుతి స్మృతియు నిందుక వేదమునం బ్రసిద్ధమై
న వచనముల్ తెలంగు నవి న్యాయముతో వివరించి చెప్పెదన్
సవినయబుద్ధిమై వినుము సర్వ జగత్పితఁ గూర్చి యర్చ్యశి
ష్టవరులు వ్రాసినట్టిదగు చందము డెందమునందు నిల్పుచున్. 30

ఉ॥ అందున నాద్యమై వినఁగ నర్హమునై తగు భిక్షమీయఁగా
డెందము గల్గువానికి గణింపఁగ నించుకయైన నర్థముం
జెంది యొసంగు జేసుగురుచిత్తము రా వినుతించువాఁడు ధా
త్రిం దయఁ జూడఁగాఁదగు దరిద్రుల బాధితులైన మర్త్యులన్. 31

ఉ॥ తానిల నేమనుష్యుఁ డురుధర్మము సల్పిన వారిఁ గూడి మో
క్షానుభవంబు సేయుటకు నాత్మఁ దలంచు నతండు భిక్షము
న్మానుగ నిచ్చి పేదలగు మర్త్యులఁ బ్రోవ నుదారభావముం
బూనఁగ నొప్పుఁ జుమ్మి గురుపుంగవబోధిత సత్యభావనా. 32

ఆ॥ ఘన పిశాచ శోధనను విదారింప ద । యారసమునకంటె నధిక సఖ్య
యుతమునై తెలంగు వితరణంబునకంటెఁ । గలదె యొండుపాయ మిలఁ దలంప. 33

క॥ ఇందువలన దురితౌఘము । క్రిందుపడున్ సామ్ములను నకిల్బిషమతి ధా

---

...తిన వారిని=మంచి ఆశతో నుండినవారిని । కృతధర్మమునను=చేసిన ధర్మమునకు సనయశీల=మంచి గుణముగలవాఁడా।

29. కరము=మిక్కిలి । ఇల=భూమియందు । ఆగమ అర్హమగు=వేదమునకు తగినదైన । అబ్బున్ గాదె=...గునుకదా । ఈ కరణి=ఈ విధమున ।

30. ప్రసిద్ధమై వచనముల్ తెలంగు=పేరుపొందిన వాక్యములు గలవు । సవినయ బుద్ధిమై=వినయముగల బుద్ధితో ।

31. అందున అద్యమై=అందులో మొదటిదై । వినగన్ అర్హమునై=వినుటకు తగినదై । భిక్షమీయఁగా డెందము గల్గువానికి=భిక్షమిచ్చుటకు మనసుగలవానికి । గణింపఁగ=విచారింపగ । ఇంచుకయైన అర్థముం జెంది యొసంగు=కొంచెమైనను ధనము ఉండును । జేసుగురు చిత్తము రా వినుతించువాఁడు=జేసునాథుని దయ రావలెనని ప్రార్థించువాఁడు । బాధితులైన మర్త్యులన్=బాధ నొందు మనుష్యులను ।

32. తాన్ ఇల=తాను భూమియందు । ఉరుధర్మము సల్పినవారి గూడి=గొప్ప పుణ్యములను చేసినవారిని గూడి । మోక్ష అనుభవము=మోక్షము పొందుట । సేయుటకు ఆత్మ దలంచున్ అతండు=చేయవలెనని మనస్సులో దలఁచునో అతఁడు । భిక్షమున్ మానుగన్ ఇచ్చి=ధర్మమును బాగుగ నిచ్చి । ఉదారభావమున్ బూనగ నొప్పు=గొప్ప ధర్మభావమును పొందతగును । గురుపుంగవబోధిత=గురుశ్రేష్ఠులచే బోధింపబడిన । సత్యభావనా=సత్యమునే పలుకు వాఁడా ।

33. విదారింప=చీల్చి వేయుటకు । సఖ్యయుతమునై=చెలిమితో కూడినదై । వితరణము=ఈవి (ధర్మము) ఒండు ఉపాయము=మరియొక ఉపాయము ।

34. దురిత ఓఘము=పాపముల సమూహము । క్రిందుపడున్=నాశనమగును । అకిల్బిషమతి=పాపరహి

చ॥ వరమతియై దరిద్రునకు వస్త్రము నొసంగిన మోక్షభాగ్యాలం
కరణము నొందఁగాఁ గలుగు గ్రక్కునఁ బేదగువానితోడ మ
త్సరహార్యమైన జ్ఞానమున స్నానము చేసి నిజాశనంబునం
దిరవుగ నొక్కపాలతని కిచ్చిన దానన సన్మనస్కులం
దు రహిని నూఱడింపు నొగిఁ దోడనె కాంచఁగ యోగ్యుఁడై తగున్. 42

సీ॥ నేర్పుమై సర్వేశ్వరార్పణంబుగఁ దన । సొమ్ము పేదలకీయు సమ్మదమున
నఖిలేశ్వరుఁడు తన యందుంచు నతని ద । రింపఁ జేసెడు భార మింపు మిగుల
వసుధ దరిద్రుల కొసఁగిన ద్రవ్యంబు । దలఁచిన శతగుణితంబటంచు
ముఖ్యంబుగా వేదమునఁ బల్కుచున్నది । యూరక యుండెడి భూరిధనము
తే॥ నెల్లఁ బేదల కిడినఁ బరేశ్వర ప్ర । సాదమును బొందు మఱియును బేద కిడిన 43
యర్థ మాత్మఁ దలంపఁగా వ్యర్థమగుచుఁ । జనదు దేవుని దయను గాంచఁగ ఘటించు.

సీ॥ అవనిపై మిగుల ద్రవ్యంబు గల్గిన జనుం । డిక్కట్టుపడు పేద కీయుమియును
బ్రతుకుల సొమ్ముల నత్యపేక్షను గాంచి । దొంగిలుటయు సరి దురితదూర
తన కెక్కుడగు ప్రసాదము క్షుత్పిపాసితునకు । నర్హమౌ, తను దాఁచి నట్టి వస్త్ర
ములు నిర్వసనులకు వలయు భిక్షం బిచ్చు । ధర్మంబు మైత్రిని గూర్మి తల్లి
ఆ॥ వలెనె యుంచు ఘోరపాతకామయముల । కౌషధంబుమాడ్కి నమరు నట్టి
ధర్మ మాత్మ నధిక నిర్మలమ్ముగఁ జేయుఁ । బరము కెక్కు మెట్లపగిది నమరు. 44

తే॥ ఎలమి రక్షకుఁడగునట్టి జేసునాథు । సన్నిధిఁ దానె తోడ్కొని చనును జనుని 45
కలుషమను వహ్ని నణఁపఁ బిక్షమ్మునొసఁగు । ధర్మమును బోలు పుణ్య మీధరణిఁ గలదె.

క॥ నయమైన యదియె దురిత । క్షయ కృత్స్నానమగుచుండు జనులకు దీనన్
జయమును మఱి సర్వేశ్వరు । నయి నమ్మికయును గలుగును బరఁగఁగ నెప్డున్. 46

42. వరమతియై=మంచిబుద్ధిగలవాఁడై । మోక్షభాగ్య అలంకరణము=మోక్షభాగ్యముయొక్క అలంకారము । ఒందఁగాఁగలుగు=పొందఁగలుగును । గ్రక్కునన్=శీఘ్రముగ । పేదఅగువానితోడ=బీదవానితో । మత్సరహార్యమైన=లోపములేని । నిజఅశనంబునన్=తన అన్నములో । ఇరవుగ=స్థిరముగ । ఒక్కపాలు=ఒక్కభాగము । దానన=దానిచేతనే । రహిని=ఆనందమును । నూఱడింపును=ఓదార్పును । ఒగిన్=వరుసగా । తోడనె=వెంటనె । కాంచగ యోగ్యుఁడై తగున్=పొందుటకు తగినవాఁడై యుండును ।

43. నేర్పుమై=తెలివితో । సర్వేశ్వర అర్పణముగ=సర్వేశ్వరునకు చెందునట్లు । సమ్మదమున=సంతోషమున । అఖిలఈశ్వరుఁడు=సర్వేశ్వరుఁడు । తనయందుంచు=తనపై ఉంచుకొనును । అతని తరింపజేసెడు భారము=ధర్మము చేయువానిని మోక్షమునకు బంపుభారము । ఇంపుమిగులన్=మిక్కిలి ప్రేమతో । శతగుణితంబు=నూరురెట్లు । భూరిధనము=గొప్పధనము । పరేశ్వరప్రసాదమును బొందు=దైవయిష్టప్రసాదమును పొందును । దేవునిదయను గాంచగ ఘటించు=సర్వేశ్వరుని అనుగ్రహమును పొందజేయును ।

44. ఇక్కట్టుపడు పేదకు=కష్టములో నుండు బీదవానికి । ఈయుమియును=ఇవ్వకుండుటయును । అతిఅపేక్షన్=ఎక్కువ ఆశతో । దురితదూర=పాపము లేనివాఁడా । తనకు ఎక్కుడగు ప్రసాదము=తనకెక్కువయైన భోజనమును । క్షుత్ పిపాసితునకు అర్హమౌ=ఆకలిగలవానికి తగును । నిర్వసనులకు=బట్టలేనివానికి । భిక్షంబిచ్చు ధర్మంబు=భిక్షమిచ్చుటచే గల్గుపుణ్యము । మైత్రిని=స్నేహమును । కూర్మిన్=ప్రేమతో । ఘోరపాతక ఆమయములకు=ఘోర పాపరోగములకు । ఔషధంబుమాడ్కిన్ అమరు=మందువలె నుండును ।

45. ఎలమి=సంతోషముతో । కలుషము అను వహ్ని=పాపము అను నిప్పును ।

46. నయమైన యదియె=న్యాయమైన ఆ ధర్మమే । దురితక్షయకృత్ స్నానము=పాపమును నాశనము చేయు స్నానము ।

బాపఁ దొడఁగుఁ బ్రాణములు బాయువెనుక । నాత్మ నుల్లసిలఁగఁ జేయు నాప్తురీతి. 53

చ॥ వినయుత దేహము న్వదలి వేఱొకలోకముఁ జేర నేగునా
తనికి సహాయమౌ ధనముఁ దక్కఁగ నెమ్మును దరిద్రకోటి కి
చ్చిన ధనమే సహాయమును జెన్నగు ద్రవ్యముగాక, యా పరే
శుని వినుతింప నాతఁ డిడు శుద్ధమునైన తగు మోక్షభాగ్యముల్. 54

సీ॥ ఘనతర స్నేహసంగతి నే క్రియార్థుని । వలన సన్నుతిగాంచు నరుఁ డవంతుఁ
డతఁడు పేదల కిల హితవుగా భిక్ష మి । చ్చిన వస్తువులగు నస్మదనుభవునకు
మోక్షభాగ్యము నిచ్చు మున్నీవ దశనంబు । పెట్టినందువకుఁగాఁ బ్రేమతోడ
సన్మనస్కులకైన సద్భోజనంబును । నిడు నొక చిన్న చెంబెడు జలంబు
తే॥ నీయు సంపూర్ణమై ప్రవహించునట్టి । యేటితీర్థము లెల్లఁ దా నీయఁ జూచు
పొసఁగ జనుఁ డిచ్చు చెడు వస్తువులకుఁగాను । నవనవోన్మేషమైన వస్తువుల నిచ్చు. 55

చ॥ అవని దరిద్రకోటికి సహాయము చేసినవారు సుస్థిరం
బవు విభవంబు గల్గి చెలువందుచునుందు రటెట్టులన్న ని
చ్చు వెలయుచుండు వారికిని జచ్చినవారికి రక్షకుండు నా
ప్రవరుఁడునైన జేసు తిరువాక్కునఁ బిల్వఁబడున్ సుధోక్తులన్. 56

వ॥ అది యెట్లంటేని. 57

సీ॥ అస్మజ్జనకుచేత నాశీర్వచనమును । బొందిన యట్టి సత్పురుషులార
జననంబు మొదలుగా జగతిస్థి మీకు సి । ద్ధంబైన మోక్షరాజ్యంబు నెలమి
ననుభవింపఁగ శీఘ్రమరుదెందు క్షుధగొన్న । తఱి నన్న మిడితిరి దయను మీరు
నేను దాహముగొన్న నీరంబు నొసఁగితి । రేఁబరదేశినై యేగుదేర
తే॥ స్థలము నిచ్చితి రింటిలోపలను నేను । వ్యాధి నొందినతఱిఁ జెఱఁబడిన యపుడుఁ
గనఁగఁ బఱతెంచితిరి దరిద్రునకుఁ జేసి । నట్టి యుపకృతిఁ జేసితి రమర నాకు. 58

53 ఆయువు విడుచు సమయములయందు=ప్రాణము పోవునప్పుడు । ఏతెంచు సంకటములు=వచ్చుకష్టములను । పాపఁ దొడగున=పోగొట్టుటకు తోడ్పడును । ప్రాణముల్ బాయు వెనుక=చనిపోయినతర్వాత । ఆప్తురీతి=స్నేహితునివలె । ఆత్మన్ ఉల్లసిలఁగ జేయున్=ఆత్మను సంతోషపెట్టును ।

54 వినయుతన్=వినయముతో । వేఱొకలోకము=పరలోకము । దరిద్రకోటికి=బీదగుంపులకు । చెన్నగు ద్రవ్యము=అందమైన భాగ్యము । ఆ పరేశుని=ఆ సర్వేశ్వరుని । అతఁడిడు=అతడిచ్చును ।

55 ఘనతర స్నేహసంగతిన్=గొప్పస్నేహముతో । ఏ క్రియార్థుని........ మోక్షభాగ్యము నిచ్చు=ఎవనివలన దేవుడు స్తుతింపబడునో అతనియొక్కనరుని (=అస్మదనుభవునకు) ముందు అతడు పేదవారికి ధర్మమిచ్చిన వస్తువులకై దేవుడు మోక్షమిచ్చును. మున్ను=పూర్వము । ఈవతో అశనంబు=కొంచెము అన్నము । సన్మనస్కులకైన=సన్మనస్కులకిచ్చెడు । సద్భోజనంబు=సత్ప్రసాదము । నవనవోన్మేషమైన=క్రొత్త క్రొత్త ప్రకాశముగల ।

56. సుస్థిరంబవు విభవంబు=శాశ్వతమైన భాగ్యము । చెలువు అందుచునుందురు=అందమును పొందుచుందురు । వెలయుచుండువారికి=బ్రతికియున్నవారికిని । రక్షకుండున్=రక్షించువాడును । ఆ ప్రవరుడునైన=ఆ శ్రేష్ఠుడైన । సుధోక్తులన్=అమృతమువంటి తియ్యని మాటలతో ।

57. అస్మత్ జనకు చేత=నా పితచేత । ఎలమి=ప్రీతితో । క్షుధగొన్న తఱిన్=ఆకలిగొన్నప్పుడు । ఏన్ పరదేశినైన=నేను పరదేశస్థుడనై । ఏగుదేరన్=రాగ । చెఱన్ బడినయపుడు=చెరసాలలో పడినపుడు । కనఁగన్=చూచుటకు । బఱతెంచితిరి=వచ్చితిరి ।

58. అనుమతి నిడన్=ఆజ్ఞాపించుచు । పుణ్యులెల్లన్ ఆకర్ణింపన్=పుణ్యాత్ములందఱు వినునట్లు ।

క॥ క్షమపై దరిద్రులకు భి। క్షము నిచ్చినవాని నెపుడు సర్వేశ్వరుఁ డు
త్తమపథమున నుంచునుగా। క మహా నరకమునఁ ద్రోయఁ గాంక్షింపఁ డొగిన్. 66

ఆ॥ ధర్మనిరతులకు సతంబుగా నరకంబు। లేదటంచుఁ జెప్పలేదు నరులు
స్వామి ధార్మికులకు సారెసారెకు నడి। పించినట్టి విధము నెంచిరిట్లు. 67

ఉ॥ ఈ గతిఁ జేసి మానవులు కిచ్చెడి ధర్మము నిత్యముక్తికిం
బోగతి నేర్పఱించునని పూర్వులు పెద్దలు చెప్పి రీక్రియన్
వేగ మనంబు ధర్మమున నిల్పఁగ దేవుని వేఁడుకోఁదగున్
నైగమవేద్యుఁ డట్లయిన నమ్మికతోఁ దదభీష్ట మీయఁడే. 68

వ॥ సర్వేశ్వరుని బ్రార్థించుటెట్లనిన. 69

రగడ॥ సకలభువనాధార సత్పురుషమందార
అకపయోధసమీర యనుపమ నిరాకార
ధర దరిద్రులఁ గాంచి దయ వారిపైఁ బెంచి
పర ధర్మమున మించి పరఁగు వారికి మంచి
కరుణ మేలు నొసంగి కరమునఁ బ్రోవ నెఱింగి
యురవుగను నేఁబొంగి యీ లోకము నెసంగి
విసివి చెడు ద్రవ్యమును వేమాఱు నీయఁగను
పిసినిఁగా నుండుదును బృథివి నటులయిన నను
బొలయువలె మేలుగను బుణ్యములు మీ కృపను
వెలిచి పేదలు చాలఁ బెద్దలను బడువేళ
వారి కుపకారమును నైనముగఁ జేయఁగను
భూరి కారుణ్యమును బూని మది నిల్పఁగను
జెలఁగి మీ రహరహముఁ జేయుం డనుగ్రహము
నలుపేదలకు దినము నర్పింపఁగా నాకు
ధనము లేకుండినను దయ వారిపై నిడను
మనస్సైన నేటుగను మరలఁ జేయుఁడు తగను
అవనిపై దీనులకు నల్పార్థ మిడుకోలకు
సవినయామోదము నరకు నల్పకిమ్మనలకు

66. క్షమపై=భూమియందు। ఉత్తమపథమున=ఉత్తరించెడు స్థలమున। కాంక్షింపఁడు ఒగిన్=క్రమముగ ఆశింపఁడు।

67. ధర్మనిరతులకు=పుణ్యమందు ఆసక్తిగలవారికి। సతంబుగా=ఎల్లప్పుడు। ధార్మికులకు=పుణ్యాత్ములకు। సారెసారెకు=అనేకమారులు।

68. నిత్యముక్తికిం బోగతిన్=నిత్యమోక్షమునకు పోవు మార్గమును। నైగమవేద్యుడు=వేదములందు తెలియఁబడువాఁడైన సర్వేశ్వరుడు। తత్ అభీష్టము ఈయఁడే=ఆ కోర్కెను నెరవేర్చఁడా?

70. సకల భువన ఆధార=ప్రపంచమంతటికి ఆధారమైనవాఁడా। సత్పురుషమందార=మంచివారలకు కల్పవృక్షమువంటివాఁడా। అకపయోధసమీర=కష్టములనెడు మేఘములకు గాలివంటివాఁడా। అనుపమ నిరాకార=సాటిలేని అశరీరుఁడా। విసివి=విసిగి। వేమాఱు=పలుమారులు। నను పొలయువలెన్=నాకు కలుగవలెను। భూరి కారుణ్యమును=గొప్ప కరుణను। అహరహము=రాత్రింబగళ్లు। మనసు ఐన నేటుగను=మనసునైన దృఢముగ। అల్ప అర్థము=స్వల్ప ధనమును। సవినయమోదము=వినయసహితమగు సంతోషము। నరకు నల్పకి ఇమ్మ=తె

ఫలములకుఁ బాత్రముగురీతి సిలువఁ జేసి।సంస్మృతిని మోక్షమును జెందఁ జల్పవలయు.

సీ॥ సర్వేశ్వరార్చ్యశిష్టాంబికా భవదీయ । తనయుండు స్లీవమ్రాఁకునను గొట్టఁ
బడి యుండునప్పుడు వారి దివ్యాత్మయు । వారి సద్విమల శరీరవసతి
నెడఁబాయుటను గాంచి మిడిగొన్న దుఃఖంబు । ననుభవించితిరి మీ యధిక దుఃఖ
మును గని సుమరణంబును వారు పొందిన । తదనంతరంబునఁ దచ్ఛరీర
తే॥ మును దగిన మీ యొడిని బెట్టుకొని తదంగ । మును నిరీక్షించి పొందిన పెను వగపును
జూచి నేఁ జచ్చువేళ సత్యోచితముగ । మనవి సేయఁగవలయు దేవునిగుఱించి. 94

వ॥ మదర్థంబుగా సర్వేశ్వర సన్నిధానంబున మనవి యొనరింపవలయునని యపేక్షాహృదయంబున మిమ్ము ఘనమ్ముగా వినుతించెదఁ దదవసరంబున నుదార కృపారసంబున మద్విరచిత దురిత ప్రకరమ్ముల నణుంగున కరుగఁ జేసి విశ్వాసంబును బ్రకాశంబు గావించి మామకామిత దుర్బలమ్ము నడఁగించి మనంబును నిశ్చలంబుగా నొనర్చి శాత్రవబృందంబును జయింప నధిక బలంబును ఘటియించి యుష్మత్ప్రార్థనావశంబున నఖిలేశ్వరుం డస్మత్కలుష వ్రాతంబు నోర్చి మోక్షభాగధేయంబుఁ బ్రసాదింప నొనరింపవలయు. 95

సీ॥ అఘహరులై మోక్షభాగ్యంబును గాంచిన । యట్టి సదర్చ్యశిష్టార్యులార
మీరభయాత్ములై మించి మోక్షంబున । నక్షయ మోక్షమ్ము ననుభవించు
చున్నారలిహమునం దున్న సంకటముల । దుర్మరణమ్ములఁ దోఁచినారు
నే నీ ధరాస్థలిలో నన్ని చేటుల । భయపడుచున్నాఁడ దయను మీరు
తే॥ మన్నిమిత్తంబు దేవుని సన్నుతించి । యేను బంచత్వమొందు తఱిని సహాయ 96
ముగుచు నేతెంచి యాత్మలో నఖిలభర్త । మీఁద భయభక్తులను గల్గి మెలఁగఁ జేసి.
తే॥ పదిలమైనట్టి యటువంటి భక్తితోడ । సకల సర్వేశ్వరేష్ట ప్రసాదములను
గలసి యీ దేహమును వీడి కదలి మీర । లనుభవించెడి మోక్షరాజ్యంబునవుడు.97

సిలువ చేసి=ప్రార్థనలో నిల్పి ।

94 సర్వేశ్వర అర్చ్యశిష్టాంబిక=సర్వేశ్వరుని పరిశుద్ధమాత । భవదీయతనయుండు=నీ కుమారుడు । వారి సద్విమలశరీరవసతిని ఎడబాయుట గాంచి=వారి దివ్యశరీరము అను చోటునుండి వేరైపోవుటను చూచి । మిడిగొన్న దుఃఖము=గొప్పదుఃఖము । తచ్ఛరీరమును=వారి శరీరమును । తదంగమును=వారిశరీరమును । నిరీక్షించి=చూచి । పొందిన పెనువగపును=అనుభవించిన గొప్ప దుఃఖమును । సత్యోచితముగ=న్యాయమునకు తగినట్లు ।

95. మదర్థంబుగా=నా కొఱకై । సన్నిధానమున=ఎదుట । అపేక్షాహృదయంబున=ఆశగలిగిన మనసుతో । తత్ అవసరంబున=ఆ సమయమున । ఉదార కృపారసంబున=గొప్ప కరుణతో । మద్విరచిత=నేను చేసిన । దురిత ప్రకరమ్ముల=పాపముల సమూహమును । నణుంగున కరుగ జేసి=చాటునను పో జేసి । మామక=మా యొక్క । అమిత దుర్బలమ్ము నడంగించి=గొప్ప బలహీనతను పోగొట్టి । శాత్రవబృందంబును=శత్రుసమూహమును । ఘటియించి=చేకూర్చి । యుష్మత్ ప్రార్థనావశంబున=నీ ప్రార్థనవలన । అఖిలేశ్వరుడు=సర్వేశ్వరుడు । అస్మత్ కలుష వ్రాతంబు ఓర్చి=నా పాపములను ఓర్చి । మోక్ష భాగధేయము=మోక్ష భాగ్యము । ప్రసాదింప నొనరింపవలయు=ఇచ్చునట్లు చేయవలయును ।

96. సదర్చ్యశిష్టార్యులార=మంచి అర్చ్యశిష్టులైన జ్ఞానులార । అభయఆత్ములై=భయములేనివారై । అక్షయమోక్షము=తరుగని మోక్షమును । మన్నిమిత్తంబు=నా కొఱకు । యేను పంచత్వమొందు తఱిని=నేను చనిపోవు సమయమున ।

97. పదిలమైనట్టి=భద్రమైన । సర్వేశ్వరేష్టప్రసాదములను=దేవుని వరప్రసాదములను ।

మర్యాద గలిగి సమ్మతి నుండఁ గావించు । నగు ఫలంబును గూడి పరఁగియుండు
తే॥ నట్టి బహుమానమునఁ జిత్తమానపడక । స్వచ్ఛమగు భావమును గూర్చు సకలమైన 115
వార్తలను గ్రియలను బరాత్పరుని స్తోత్ర । ములు గలిగియుండ నొనరించు ముదితహృదయ
క॥ పరనవకృతాపరాధో । త్కరములు సహింపఁజేయుఁ గరమరుదగు ధ
ర్మరతి నొదవించు కీర్తి । స్ఫురణము సంధించుఁ జువ్వె భూరివివేకా. 116
సీ॥ వ్రణమును మిక్కిలి బలిమితో గిల్లిన । నొప్పియు శోణితం బుప్పతిల్లు
నట్టుగా నదిమిన మాను బాధయును లే । దటువలెఁ బాపాత్ములైన వాని
మనసు నొప్పింపక మవిన బుద్ధి చెప్పిన । వాఁడు పాపమ్ములఁ బాయఁ ద్రోసి
యారూఢిగా నిజాత్మారోగ్యమును బొందుఁ । గఠినంబుగా బుద్ధి గఱప నతని
తే॥ యాత్మరోగంబు గుణము గాదట్టులగుటఁ । బరుల యాత్మామయంబును బరవివేక
మున నణంపఁగా వలయును బుద్ధిగతవి । వేకపుణ్యంబు గల క్రియావిదుఁడు జగతి. 117
క॥ తన పాపము నజ్ఞానం । బును బుణ్యపుఁ దక్కువలను భూరి దురాశం
దన దుర్గుణములు దెలియఁగ । నొనరించు ఘృణాకలాప యుచితాలాపా. 118
ఆ॥ మును వివేక పుణ్యములను జెందఁగా రెండు । పుణ్యములను జనుఁడు పొందవలెను
మొదటిదయ్యె శాంతి విదితమయ్యెను జప । ప్రియము రెండవది యభిన్నలీల. 119
క॥ ధరఁ దాంతి గలిగి యుండెడి । పురుషుని హృదయంబునందుఁ బూర్ణజ్ఞాన
బరుదుగఁ గల్గు నటంచును । వెరవుగ విలసిల్లె సత్యవేదములోన. 120
సీ॥ కావున సద్వివేకంబను పుణ్యంబు । నొంద సులభమగు చందు వాఁకియు
స్పిరితుసాంక్త్వవుల సద్వితరణమ్ములు నివి । యగుచునుండు విశేషమైన యూవి
శాంతితో వేఁడెను ధర్మాత్ములగువారి । కిట్టుగ దానిఁ దానింత దెలిసి
విజ్ఞానమని యెడు వితరణంబును బూని । మెండైన కోరిక నుండవలయు
ఆ॥ మహి దరిద్రులైన మనుజులు శాంతితో । భిక్షమడుగునట్లు ప్రియముతోడఁ
బేదలకును దండ్రియై దేవుఁడన నొప్పు । స్పిరితుసాంక్త్వవులను వేఁడవలయు. 121
క॥ ఎంచఁగఁ గార్యమ్ముల నడి । పించెడు నా సమయమున వివేకముతో జం
హాంచలమును సతముగ నడి । పించఁగవలె మొదల నరుఁడు విమలవిధిజ్ఞా. 122

ను । ముదితహృదయ=సంతోషముగు మనసుగలవాఁడా ।

116. పరనవకృత అపరాధ ఉత్కరములు=గొప్పవారు క్రొత్తగా చేయబడిన పాపసమూహముల । సహింపజేయు=ఓర్పు చేయును । కరము అరుదగు=మిక్కిలి ఆశ్చర్యమగు । ధర్మరతి=ధర్మమందు ఇష్టమును । ఒదవించుక=కలిగించును । కీర్తి స్ఫురణము=ఘనత దోచుటను । సంధించును=కలిగించును ।

117 శోణితంబు=రక్తము । ఉప్పతిల్లు=ఎక్కువగును । ఆరూఢిగ=గట్టిగ । నిజఆత్మ ఆరోగ్యముబొంద=తన యాత్మకు ఆరోగ్యమును బొందును । ఆత్మ ఆమయంబును=ఆత్మరోగమును । పరవివేకముచే=మంచి వివేకముతో । బుద్ధిగత వివేకపుణ్యంబుగల క్రియావిదుడు=మనసున వివేకము పుణ్యముగల కార్యకుశలుడు ।

118. పుణ్యపు దక్కువలను=పుణ్యమందలి కొఱతలను । భూరిదురాశ=ఎక్కువగు చెడ్డఆశతో । ఘృణాకలాప=కనికరమే భూషణముగ గలవాఁడా । ఉచితఆలాపా=మంచిమాటలాడువాఁడా ।

119. శాంతి=ఓర్పు । విదితమయ్యెను=తేటగా తెలిసెను । అభిన్నలీల=చెదరిపోని ఉత్సాహముగలవాఁడా ।

120. అరుదుగ=ఆశ్చర్యముగ । వెరవుగ=ఉపాయముగ ।

121. సత్ వితరణమ్ములు=మంచి వరప్రసాదములచే ।

122. జంహా అంచలము=నాలుక చివరను । సతముగ=ఎల్లప్పుడు ।

ఉ॥ చెప్పఁగరాని వార్తలను జెప్పక చెప్పఁగఁ దగ్గ వార్తలం
జెప్పుచు వాని నంతయును జెప్పఁగ యోగ్యములైన వేళలం
దప్పక యెంచఁగావలయుఁ దద్విధ మెట్టిదటంటె వార్తలం
జెప్పెడి వేళ గల్గు మఱి చెప్పని వేళయుఁ గల్గు సంచితా. 123

వ॥ సర్వేశ్వరు వేదంబునం జెప్పియుండు నదియునుగాక. 124

క॥ నమ్మఁదగదండ్రను మది । నమ్మఁగ నాప్తులగువారి నమ్మఁగఁ జెల్లున్
నెమ్మది నుండెడి ధర్మము । నిమ్మనుజులకెల్ల నఘము నీఁ దగదనుచున్. 125

తే॥ సత్యవేదంబులోపల నిత్యముగను । వ్రాసియున్నది సత్క్రియా వైభవుండు
వదర కేతెంచుపనులను విదితముగను । మది విచారింపఁగాఁ దగు నదియుఁగాక. 126

చ॥ ఘనముగ బుద్ధిమంతుఁ డనఁగాఁ దగు పుణ్యుఁడు న్యాయరీతి గ
ల్గిన పనితోఁ దపంబును ఫలింపఁగ జేయఁగఁగూర్చి శరీర మి
ష్టము సుఖియింపనీయక తపోభరరీతిఁ గృశింపనీక బు
ద్ధిని దమమాచరింపవలె ధీరనుతా వినిపింతు నవ్విధిన్. 127

తే॥ క్రమము శోభిల్ల ధర్మమార్గమున నడువ । బలిమి నెయ్యెడ సంచరా దలఘుమతిని
గార్యముల నడిపించెడు కాలమునను । వదరఁ డీల బుద్ధిమంతుఁడు పావరహిత. 128

క॥ మదిఁ దలఁచి తత్క్రమంబును । వదలక కార్యమును జేయఁ బ్రారంభించున్
గొదవపడక యుండ దానికి । మొదలఁ బనులు నాల్గు చేయు మోదమునఁ జెల్లున్. 129

క॥ ధర నందు మొదటిదగు పరా । త్పరు విజ్ఞానోజ్జ్వలతకు వరమతిచే స
త్కరుణా దగు నర్చ్యవిశిష్టో । త్కరములఁ బ్రార్థింప నొప్పు ఘననీతియుతా. 130

క॥ చలుపఁగఁ బోయెడి కార్యం । బుల వచ్చెడి మేలు దార్ఢ్యముగ నెమ్మదిలో
నలర విచారింపుట భూ । వలయంబున నయ్యె రెండవది వినయాత్మా. 131

ఆ॥ బుద్ధిమంతులంచుఁ బుణ్యసంచయమును । జెలువుచుండునట్టి సత్పురుషుల
నరసి వారితోడి యాలోచనము సేయు । నదియుఁ దల్ప మూఁడవది మహాత్మ. 132

123. చెప్పగ యోగ్యములైన=చెప్పదగిన । ఎంచగావలయును=చూడవలయును ।

125. ఆప్తులగువారి=తగినవారిని । నెమ్మదినుండెడి ధర్మము=నీ మనసులోని ధర్మగుణములను । ఈ దగదు=చెప్పగాదు ।

126. సత్క్రియా వైభవుండు=మంచి పనులే భాగ్యముగ గలవాడు । వదరక=ఎల్లప్పుడు వ్యర్థమాటలను చెప్పక । ఏతెంచుపనులను=వచ్చుపనులను ।

127. తపోభరరీతి గృశింపనీక=తపస్సుయొక్క కఠినములచే చిక్కిపోనీయక । ధీరనుతా=బుద్ధిమంతులచే నుతింపబడినవాఁడా ।

128. క్రమము శోభిల్ల=వ్యాపకము అగపడునట్టుగా । ఎయ్యెడన్=ఎప్పుడును । అలఘుమతిని=గొప్ప వివేకముతో । వదరడు=గొప్పగా చెప్పడు ।

129. తత్క్రమంబును=అక్రమమును । కొదవపడక=తక్కువపడకుండ । మోదమున=సంతోషముతో .

130. పరాత్పరు విజ్ఞాన ఉజ్జ్వలతకు=సర్వేశ్వరుని జ్ఞానప్రకాశమునకు । వరమతిచే=మంచి మనస్సుతో । సత్కరుణాదగు=కరుణగలవారైన । అర్చ్యవిశిష్టోత్కరములన్=అర్చ్యవిశిష్టుల సమూహమును । ఘననీతియుతా=గొప్ప నీతిగలవాఁడా ।

131. చలుపగ బోయెడి కార్యంబుల వచ్చెడి మేలు=చేయబోవు పనులవలన వచ్చెడి ఉపకారము । దార్ఢ్యముగ=దృఢముగ । భూవలయమునన్=లోకమున ।

132. పుణ్య సంచయమునన్=సత్కర్మములను । అరసి=వెదకి । వారితోడి యాలోచనము=వారితో ప్రసంగము ।

క॥ అదరక పరివరి విధములఁ । బదరక తా మనముమీఁదఁ బదిలముగా ము
న్నుఁ దలంచిన కార్యమ్ములను । వదలక నడిపింప నాలవది యగు నధిపా. 133

వ॥ ఈ చందంబున నొనరించుట ముఖ్యంబని పెద్దలు తద్దయుం బలుకుదు రదియునుంగాక
స్వాత్మశోధన క్రమంబు నాలింపుము. 134

క॥ ప్రతి నిశయందును శయనిం । చుతఱి మొదలాత్మ నొగిని శోధించుట స
న్మతియనుచుఁ దెల్పి జ్ఞానాం । చితు లేపారంగ బుద్ధి చెప్పుదు రనఘా. 135

సీ॥ దుష్కృతమ్ముల విడఁద్రోసి ధర్మంబున । మెల్లఁగా ధ్యానయోగంబు గల్గు జనుఁడు
ప్రత్యహంబును రాత్రి పదపడి యాత్మశో । ధనమును గావించి మానసముచేత
వాక్కుచేతను గ్రియావలన నొనర్చిన । కలుషబృందంబులఁ దలఁపవలయు
నే పాపమధికమ్మై యెసఁగునంచుఁ దలంచి । యది జ్ఞాపకము వచ్చునట్లుగాఁగ

ఆ॥ కల్పనలఁ బదింటఁ గడు విచారముచేసి । వాని స్వామి సన్నిధానమునను
బెట్టి తాను విశ్వవిభునకు ద్రోహిగా । నుంటి ననుచుఁ దాల్మి నుచితముగను. 136

తే॥ విన్నపము చేసి యా పాప విసరమును స । హింప నఖిలాధిపతిని బ్రార్థింపవలయు
నప్పుడప్పుడె కోపమింతైన లేక । యఘహృదర్థంబు తపము చేయంగఁ దగును. 137

క॥ క్షమ నఘమర్షుని గతిఁ గా । లము గడపక స్వాగచితాఘ లయము పొసఁగింపం
గ్రమ మెఱుఁగవలయు నిటువలెఁ । జుమి విదితంబయ్యె నాత్మశోధన మధిపా. 138

వ॥ ఇట్లు తమ శోధనంబును ఘనంబుగ నొనర్చి పాపమ్ముల జ్ఞాపకమ్మున నుంచి తత్సమ
యంబున నధిక మనస్తాపంబున నర్హంబగు తపంబును వెంటనె యొనరింప నా ఘోర
దురితవారం బల్పకాలంబున నిర్మూలంబై చను నిట్లహరహంబును నాత్మశోధనం బొ
నర్పని వాని యాత్మ యప్రయోజనంబగు ధరిత్రిచందంబునఁ బాపసంగతంబై దురా
శాపూర్ణంబై యుండు వెండియు నుషఃకాలంబునఁ జేయు నర్హంబగు జపధ్యాన విధం
బు నాకర్ణింపుము. 139

133. అదరక=గర్వపడక । పరివరి విధముల బెదరక=అనేక విధముల మాటాడక । పదిలముగా=జాగ్రత్తగా

134. తద్దయున్=మిక్కిలిగా । స్వాత్మశోధన=తన ఆత్మశోధన

135. ప్రతినిశయందున=ప్రతి రాత్రియందును । శయనించుతఱిన్=పడుకొనునపుడు । మొదలు ఆత్మన్ ఒగి శోధించుట=మొదట ఆత్మను క్రమముగా శోధించుట । జ్ఞాన అంచితులు=జ్ఞానముచే ఒప్పినవారు ।

136. దుష్కృతమ్ములన్=పాపములను । విడద్రోసి=విడిచిపెట్టి । ప్రత్యహంబును రాత్రి=ప్రతి పగలును రాత్రియు । పదపడి=మరియు । కలుషబృందంబులన్=పాప సమూహములను । ఎసగునంచు=ఉండుననుచు । వానిన్=ఆ పాపములను । స్వామి సన్నిధానమునన్=స్వామి యెదుట । విశ్వవిభునకు=సర్వేశ్వరునకు । తాల్మిన్ ఉచితముగన్=ఓర్పుతో తగినట్లు.

137. విన్నపము చేసి=చెప్పి । పాపవిసరమును సహింపన్=పాపముల సమూహమును ఓర్చుటకు । అఖిల అధిపతిన్=సర్వేశ్వరుని । అఘహృత్ అర్థంబు=పాపమును పోగొట్టుటకై ।

138. క్షమన్=భూమియందు । అఘమర్షునిగతిగా=అఘమర్షణ చేసినవానివలె । స్వాగచిత అఘలయము పొసఁగింపన్=తాను చేసిన పాపములను పోగొట్టుకొనను । విదితంబయ్యె=తెలియబడెను ।

139 తత్ సమయంబున=ఆ సమయమున । అర్హంబగు=తగిన । ఒనరింపన్=చేయుటగా । ఆ ఘోర దురితవారంబు=ఆ చాలైన పాపసమూహము । అల్పకాలంబున నిర్మూలంబై చను=కొద్దికాలములో నశించిపోవును । ఇట్లు అహరహంబును=ఇట్లు దినదినమును । అప్రయోజనంబగు=పనికిరానిదైన । ధరిత్రిచందంబున=పొలమువలె । పాపసంగతంబై=పాపముతో కూడుకొన్నదై । దురాశాపూర్ణంబై=పెద్ద ఆశలతో నిండినదై । వెండియు=మఱియు । ఉషఃకాలంబునన్=ఉదయకాలమున । ఆకర్ణింపుము=వినుము ।

సీ॥ అఖిల జగద్భర్తవై దయాపరుఁడవై । పరఁగు సర్వేశ యీ వఱకు నన్ను
దేవర వారతి స్థిరముగాఁ జల్పిన । సంపూర్ణ కరుణారసంబుచేత
బ్రతికి యుండంగఁ జేసితి రిదిపర్యంత । మును దాన మిమ్మును ననఘులగుచుఁ
దనరి మోక్షమును గాంచిన సన్మనస్కులఁ । బెనుపొందు భక్తిచే వినుతిసేతు
ఆ॥ నిది మొదలుగ భవదహీనకల్పనరీతి । నడతుననుచు మీకుఁ బడసియుక్తి
పనులు చేయుననుచు ననిశంబు మీయూడి । గమున నుండు ననుచు గట్టిమైన. 140
క॥ మఱిని బ్రతిజ్ఞ వహించెద । నిది మొదలుగ నస్మదాత్మ నీ దేహమునుం
బొదలెడు విచార వాక్క్రియ । లదనుగ మీకేను దగఁగ నర్పించు దొగిన్. 141
తే॥ వాని నన్నిటి దేవరవారి మదికిఁ । బొందియుండ ననుగ్రహంబును రచింప 142
వలయు స్మృతిపాప మాదిగాఁ గలుగు దురిత । ములను విడఁద్రోసి రక్షింపవలయు నన్ను.
క॥ విను శ్రీ సర్వేశునిపై । ఘనమగు సద్భక్తి నుండఁగా నతనికి నె
మ్మనమున వెఱచెడివారల । కనిశంబును ధర్మపథమునం దతి నియతిన్. 143
తే॥ భూరి భయవినయభక్తులఁ బూని నడువ । వారికీ లోకమున నేమి వచ్చిన నది
చావయిన పాపమును నెంచఁగవలవ । దనుచు నిజమైన మనముతో వలరి నడిచి. 144
తే॥ నమ్మునంతటిలో పల వారలకును । గలుగ నల్పంబుగను బూని కలిగెనేని
దాన శోకించి కవవద్ధ్యధైర్యమును మ । హాధృతిని బుణ్యతతుల యందధికముగ. 145
వ॥ ప్రవర్తింప సాహసంబుఁ బూని తన్నిమిత్తంబు తాళ్మిసమేతంబుగా సర్వేశ్వరుని ప్రార్థించి స్వబలానుగుణంబగు కార్యంబు నౌదార్యంబుగా నొనర్పఁ బ్రయాసంబు నొంద వలయు మానవమనోవైకల్యంబు నొదవింపఁ బిశాచంబు లనేక విధంబులఁ గను గలిగి యుండు నది యెట్లనినఁ గొందఱకు సాధ్వసంబుగలుగ నీకుండుటంజేసి వార లభయంబునఁ ద్వరితమ్ముగ దోషము లొనర్తురు. మఱియుఁ గొందఱకు భయంబు సి

140. అఖిలజగద్భర్తవై=సమస్త లోకములను భరించువాడవై । ఈ వఱకు=ఇంతవఱకు । ఇది పర్యంతము=ఇప్పటివఱకును । దానన్=అందుచే । అనఘులగు చుదనరి=పాపరహితులై ఒప్పుచు । పెనుపొందు భక్తిచే=ఎక్కువగు భక్తితో । భవత్ అహీన కల్పనరీతి=మీ యొక్క గొప్ప కట్టడ ప్రకారము । మీకు బడయని యుక్తి=మీకు సరిపడని యుక్తి । అనిశంబు=ఎల్లప్పుడు । మీ ఊడిగమున=మీ సేవలో ।

141. మఱిని ప్రతిజ్ఞ వహించెద=మనసున నొట్టుపెట్టుకొందును । అస్మత్ ఆత్మన్=నా యాత్మలోను । ఈ దేహమును=ఈ నా శరీరమును । పొదలెడు=కలుగుచుండెడు । విచార వాక్క్రియలను=ఆలోచనలను మాటలను పనులను । అదనుగ=సమయములోనె । మీకు ఏను తగఁగ అర్పించుదు ఒగిన్=మీకు నేను తగినట్లు క్రమముగ ఒప్పగింతును ।

142. వాని నన్నిటిని=నేను సమర్పించినవన్నియు । దేవర వారి మదికి బొందియుండ=మీకు పొందినవిగా నుండుటకు । అనుగ్రహంబును రచింపవలయు=దయ చేయవలయును । స్మృతిపాపము=చాటైన పాపము । ఆదిగా గలుగు=మొదలుగాగల ।

143. ధర్మపథమునందు=ధర్మమార్గమునందు । అతినియతిన్=మిక్కిలి నియమముతో ।

144. భూరిభయవినయభక్తులన్=గొప్ప భయము వినయము భక్తి మొదలగు గుణములతో ।

145. కలుగ నల్పంబుగను=కొద్దిగా పాపము । దాన శోకించి కవవద్దు అధైర్యమును=ఆ పాపము గలిగినందున దుఃఖించి భయపడవలదు । మహా ధృతిని=మిక్కిలి ధైర్యముతో । పుణ్యతతులయందు=పుణ్యముల సమూహములందు ।

146. తన్నిమిత్తంబు=దానికొఱకు । తాళ్మి సమేతంబుగా=ఓర్పుతో । స్వబల అనుగుణంబగు కార్యంబు=తన బలమునకు సరిపోవు కార్యమును । ఔదార్యము గా=ఎక్కువగా । మానవమనోవైకల్యంబు నొదవింప=మనసు

ర్థింపజేసిన ధర్మపథంబునం దాయాసంబు నొంది తదాయాసంబునఁ దద్ధర్మత్యాగంబు గావింతురు. సర్వేశ్వరుని యందు దహరహంబు నఖండభక్తిని వహించి మించు పంచజనుల కల్పంబులగు కల్మషంబులు సిద్ధింపకుండునట్లు విశేషంబైన సహాయంబేల చేయఁడనినఁ దత్ప్రయోజనంబు గావించువానికి సామర్థ్యం బసదు గావున నఖిలేశ్వరుండు వారల కహంకారంబును దుర్మార్గంబునం దోఁచు పారవశ్యంబును నేతద్విధంబువలన సమాగతములగు కష్టములు నష్టమ్ము సేయు నటియు. 146

ఆ॥ దాని నెఱిఁగియుండి ధర్మపథంబున । నమర నడుచు జనులు గమనిఁ గొద్ది
నేరమబ్బెనేని నెఱిఁగంగలార్చుచు । నుండవలెఁ దనిత్యమిదియె వినుము. 147

సీ॥ క్రమముప్ప మోక్షఘట్టము నెక్కఁ బర్యంత । ములఁ ధర్మపథమునం దలముఁలీల
వర్తింపుచును దనవలన నయ్యెడి కార్య । ములను జేయుఁ దాఁ నేరములను ద్రోయు
సర్వేశ్వరుని భక్తి సన్నుతింపఁగ వొప్పు । నటులు చేసిన వారి యథగ భక్తి
స్థిరధర్మమును గల్గు దృఢమును గని విశే । షానుగ్రహంబుగ నా మోక్షపురికిఁ
తే॥ జనిసి యల్పాఘములవిడఁ ద్రోసివేయు । నతని విజ్ఞానమార్గంబు కందఁజేసి 148
పిమ్మట నఖండమై విదితమ్మునైన । మోక్షసంతోషమును నొసంగు ముదితహృదయ.

ఆ॥ మనుజుఁడధిక భక్తిఁ దన యాత్మలోఁ గల్గి । యుండుటకును గుణములు లోపించుండు
వానినెల్ల నివుడు వరుసతోఁ దెల్పెద । వినుము ప్రేమగదుర విమలహృదయ. 149

ఆ॥ తాను బుణ్యములను దగిలియుంటినో లేదో । ధర్మపథమునందుఁ దప్పి నడతు
నేమొ యని మనంబు నెఱుఁగంగఁ దలఁచినఁ । జిత్తమున విమర్శ సేయవలయు. 150

క॥ తనయందుఁ దాల్మి మిక్కిలి । జనియించునో లేదో యని విచారింపవలెన్
తనకొరకు లోనరుచు నేరము । లను క్షమియించెదనో లేదో యని తెలియఁ దగున్. 151

క॥ పగలపయిఁ నా మనంబున । విరసంబున నుంటినో వివేకము గలదో
పరుల దురవస్థలను గని । కరుణ దలంచితినో లేదో కను మదిలోనన్ 152

క॥ కన నా జిహ్వను న్యాయం । బున నడిపించితినో లేదో పూనికతో దు
ర్వినయ విచారములకు నెడ । ము నొసంగక యుంటినో ప్రమోదముతోడన్. 153

---

ష్యుల మనసులను చెఱచుటకు । కను గఱగించుచుండును=మోచుచుండును । సాధ్వసంబు గలుగ నీకుండుటంజేసి=భయము కలుగనీయకుండుటచే । వారలు అభయంబున=వారు భయము లేకుండుటచే । తద్ధర్మత్యాగంబు గావింతురు=ఆ ధర్మమును విడిచిపెట్టుదురు । అహరహంబు=ఎల్లప్పుడు । కల్మషంబులు=పాపములు । సామర్థ్యంబు అసదు గావున=శక్తి స్వల్పముగావున । అహంకారంబును=లోభమును । పారవశ్యంబున=పరవశత్వమును । సమాగతమ్ములు=వచ్చునట్టివి ।

147. నేరము అబ్బెనేని=పాపము కలిగెనేని । నెఱిఁగ అంగలార్చుచు=ఎక్కువగా ఏడ్చుచు ।

148. ధర్మపథమునందు అలముఁలీల=ధర్మమార్గమునందుండునట్లు । అల్ప అఘములను=స్వల్పపాపములను అఖండమై=గొప్పదై ।

149. ప్రేమగదుర=ప్రేమ పుట్టునట్టు ।

150. చిత్తమున విమర్శ సేయవలయు=మనసున తర్కింపవలయును.

151. తన కొరకు లోనరుచు నేరములు=తన కొరకుఁ జేయు తప్పులు । క్షమియించెదనో=క్షమింతునో ।

152. విరసంబున=విరోధము । దురవస్థలను=కష్టములను ।

153. జిహ్వను=నాలుకను । పూనికతో=ప్రయత్నముతో । దుర్వినయ విచారములకు=అన్యాయమైన యాలోచనలకు । ప్రమోదముతోడన్=సంతోషముతో ।

క॥ ధరణి దురాశలచేతను । దురితములకుఁ బోవు మదిని దోడని మగుడన్
దిరుగంగఁ జేసితినో ని । ష్ఠురముగ నొంచితినో యనుచు శోధింపఁ దగున్. 154

క॥ ఈరీతిఁ బనుల నన్నిటి । నారసి సత్సరణి నడుతు నని తన మదిలోఁ
గోరికలు వెలయునట్లు వి । చారించి కొనంగవలయు సత్యసమేతా. 155

సీ॥ సర్వేశ్వరేష్టప్రసాదమ్ము ననుభవిం । పఁగ నడియాలమ్ములగును గొన్ని
తన మానసంబునఁ దత్ప్రసాదంబు గ । ద్దని నిశ్చయింపఁగాఁ జనదటంచు
నఖిలేశు వేదంబునందుఁ బ్రసిద్ధమై । కనుపట్టుచున్నది ఘనుని యిష్ట
మగు ప్రసాదమ్ము గల్గఁగఁ గొన్ని లక్షణ । ముల నర్వశిష్టవారలు వచించి

ఆ॥ రందుచేతనైన నతని ప్రసాదంబు । గలుగు ననుచు మదిని దలఁపరాక
యున్ననైన వేత్త యొక ప్రకారంబుగా । బుద్ధిచేత నెఱుఁగఁబోలు ననఘ. 156

వ॥ అది యెట్లనిన. 157

క॥ కనక సముద్భవమగు పృ । థ్విని తృణమున నెఱిఁగి త్రవ్వి వెదకిన నచటం
గనకము గన్పడు చందం । బున ఘనమగుఁ గొన్ని కార్యములచేత నిలన్. 158

తే॥ జ్ఞానసంగతినుండు సజ్జనులొకానొ । కని మనంబున సర్వేశ్వరుని ప్రసాద
మున్నదనుచు నెఱుంగుదురు కాదనైన । భక్తి గలిగిన వారలు స్వాంతమునను. 159

మ॥ హితవై మించుచు నుండు నా భువననాథేష్టప్రసాదంబు నీ
క్షితి నా రీతిఁ దెలంగఁ బుణ్యులు పరీక్షింపం గ్రమం బొప్ప సం
చితులై యుర్వర సంగమించుదురు సంతోషంబుగా వారి సం
గతులం దెల్పెదఁ జిత్తగింపు మిది వీక్షింపం జిదానంద సం
గత చిత్తాంబుజ సత్యవాఙ్నిపుణ కింగా సద్ఘృణాంచిద్గుణా. 160

క॥ ధర్మమున నడుచువారును । ధర్మములో వర్తనంబు దప్పని వారున్
ధర్మమునఁ గొదవలేకను । నిర్మలమగు పుణ్యమందు నిలిచెడి వారున్. 161

వ॥ ఈ క్రమంబులం బ్రవర్తించు మర్త్యశ్రేష్ఠులకుఁ బ్రత్యేకంబుగా నడియాలమ్ముల వేదం
బున లిఖియించియున్న ప్రకారంబున వినిపించెదన. 162

సీ॥ అవి క్రమమ్మున విను మైదడియాలమ్ము । లందులో మొదటిది యనఁగఁ దాము

---

154. దురితములకు బోవుమదిని=పాపములకు పోవు మనసును । మగుడన్=తిరిగి ।

155. ఆరసి=చూచి । సత్సరణిన్=మంచి మార్గమున ।

156. అడియాలమ్ములు=గుఱుతులు ।

158. కనక సముద్భవమగు పృథ్విని=బంగారము పుట్టునట్టిచోటును । తృణమునన్=(అచ్చట మొలచు) గడ్డివలన ।

159. జ్ఞానసంగతినుండు సజ్జనులు=తెలివిగలిగిన మంచివారు ।

160. హితవై=మంచిదై । భువననాథ ఇష్టప్రసాదంబు=సర్వేశ్వరుని యిష్టప్రసాదము । సంచితులై=కూడబెట్టినవారై । ఉర్వర=భూమియందు । సంగమించుదురు=నడచుదురు । వీక్షింపన్=చూడగా । చిత్ ఆనంద సంగతి=సర్వేశ్వరునితో కూడిన । చిత్తాంబుజ=పద్మమువంటి మనసుగలవాడా । సత్యవాక్ నిపుణ । సత్యమాడుటయందు నిపుణుడా । సత్ ఘృణ అంచితగుణా=మంచి కరుణయను ఒప్పిదమైన గుణముగలవాడా ।

161. వర్తనంబు=ప్రవర్తన । కొదవలేకను=తక్కువలేకుండ ।

162. మర్త్యశ్రేష్ఠులకు=మంచి మనుష్యులకు ।

163. అవి క్రమమ్మున వినుము ఐదు అడియాలములు=అవి ఐదు గుఱుతులు వరుసగా వినుము । త్రో

క॥ అరులకు మిత్రుండై మహిఁ। బరఁగుచు వారిపయిఁ జాల పక్షముచే నా
నరుల నిమిత్తము సర్వే। శ్వరు వేఁడుట రెండవదియు సౌమ్యచరిత్రా. 169

క॥ వినుపరులు దనువయిం జే। సిన నిందలఁ జేటులను బ్రసిద్ధముగా వ
చ్చిన వ్యాధులఁ సంతోషం। బున నోర్చుట మూఁడవదియు ముదితస్వాంతా. 170

తే॥ ధరణి సర్వేశ్వరునకుఁ గాఁ దాము నిరత। మనుభవించెడు ద్రవ్యంబునంత విడువ
నాయతంబగుచుండుట యధిప యదియు। నాల్గవదియని నొప్పు దీనప్రసన్న. 171

తే॥ అధిప సర్వేశునకు మాత్ర మాత్మయందు। భయపడుచు వీని క్రమములోపలనె యుండి
దేహసంబంధ సుఖములం దాశలేక। యతనిఁ బూజించి వేఁడుట యైదవదియు 172

క॥ పరధర్మంబున నడిచెడి। పురుషుం డా ధర్మమార్గమును విడకుండం
గర మాత్మకు వచ్చెడి బహు। తరములయిన చేటుగములఁ దప్పెడికొఱకున్ 173

క॥ ధర దుష్టాత్ములతో మై। త్రి రచింపక వారిఁ గూడి తిరుగక యుండన్
నిరతమును దలఁపవలె నె। ట్లరయంగ నన నదియు విను మహాత్మ దయాబ్ధీ. 174

తే॥ మనుజుల స్వభావ మఘముల మరుగుఁగాని। ముఖ్యతరమై తగిన పుణ్యములను మరుగ
దటులగుట దుర్జనులఁ గూడి యుండువలనఁ। బాపములు వచ్చుఁ దత్సహవాసమునను. 175

క॥ అని మున్ను సత్యవేదం। బునఁ బలికెంగాన ధరణి బుద్ధి గలుగు స
జ్జనులను గూడి చరించిన। మనుజుఁడు పుణ్యుండు బుద్ధిమంతుండునగున్. 176

సీ॥ పుణ్యవంతుఁ డగుచు పురుషుండు చీని చీనాంబరంబులపయి నాసఁ జెందఁ
దగ దాల్మిగా నుండుమది కడియాలంబు। గాదిల మోహాహంకారములకుఁ
గారణంబయి మహాకలుషాప్తి కడియాల। మగు నందువలన న్యాయార్హమైన
వస్త్రాభరణముల వహియింపఁ దగునాత్మ। సతులకు యోగ్యమా చందనాది
తే॥ పరిమళముల ధరించుట పరమ పుణ్య। భంగకరమును బుణ్యులౌ పంచజనుల
కవిహితంబగుఁ గాన మానవులు వాని। పూసికొనుటది దుర్గంధమూలమధిప. 177

ఆ॥ వసుధఁ బుణ్యములఁ బ్రవర్తింపఁగా జప। ధ్యాన మొవుడుఁ జేయఁ బూను జనుఁడు
వ్యర్థమగుచు ననర్హమగు బ్రసంగంబుల వినఁగ శ్రుతుల నియ్యఁ జనదు వినుము. 178

వ॥ అది యెట్లనిన. 179

---

169. పక్షముచే=ప్రీతితో। సౌమ్యచరిత్రా=మంచి నడవడి కలవాఁడా।

170. ముదితస్వాంతా=సంతోషముయిన మనస్సుగలవాఁడా।

171. నిరతము=ఎల్లప్పుడు। ఆయతంబగుచుండుట=సిద్ధముగా నగుచుండుట। దీనప్రసన్న=దీనులయందు దయగలవాఁడా।

172. దేహసంబంధసుఖములందు నాశలేక=శరీర సంబంధమైన సుఖములందు ఇష్టములేక।

173. విడకుండన్=విడిచిపెట్టకుండ। బహుతరములైన=అనేకములైన। చేటుగములన్=కష్టసమూహములను।

174. మైత్రి రచింపక=స్నేహము చేయక।

175. మనుజుల స్వభావము అఘముల మరుగున్=మనుష్యుల బుద్ధి పాపములనే మరుగును। తత్సహవాసమునను=ఆ స్నేహమువలన।

177. తాల్మిగా నుండుమది=ఓర్పుగల మనసునకు। మోహాహంకారములకు=మోహమునకు అహంకారమునకు। మహాకలుషాప్తి=చాలైన పాపములు గలుగుటకు। చందన ఆది=గంధము మొదలైన। పరిమళములు=సువాసన ద్రవ్యములను। అవిహితము=పనికిరానిది। దుర్గంధమూలము=పాపకారణము।

178. వ్యర్థమగుచు=నిష్ప్రయోజనమగుచు। అనర్హమగు=పనికిరాని। శ్రుతులన్=చెవులను।

సీ॥ అనిశంబు నా రీతి విను ప్రసంగంబున । నస్వచ్ఛమాత్మయుం దతిశయించు
నదిలేక యుండిన నా ప్రసంగమునఁ । బూనిన యీ జపధ్యానమునకు
భంగంబు వాటిల్లు వ్యర్థ విచారమ్ము । లేతెంచు నీ విధంబెల్లఁ దెలిసి
సర్వేశ్వరునిమీఁది సద్భక్తి గలిగిన । యతఁడు భంగం బొకింతైన లేక
తే॥ యల జపధ్యానమును జేయు నాత్మ నుంచు । నట్టి యస్వచ్ఛమును ద్రోయు నధిక పుణ్య
ములను వర్తింప ఘనమైన బలముఁ గలిగి । యుండవలెఁ జుమ్మ సత్యధర్మానుచితముగ. 180
ఆ॥ వారు వారుఁ బలుకు పనికి గల్పించిన । నేరములను మోహకారణమ్ము
లైన వాక్యములను వ్యర్థ శోకవిచార । ములను వినక నిలువవలయును నెపుడు. 181
క॥ ఈ కానివిచారమ్ములఁ । సాకల్యముగాఁగ వినని జపధ్యా
నాకలితుండగుట యవని నా । హా కష్టము సుమ్మదెట్టులైన వినుమధిపా. 182
తే॥ తొడరి మున్ను విన్న దుష్ప్రసంగంబున । నమరియుండు జ్ఞాపకము పరేశు
నెన్న నీక మనము నెంతయుఁ గదిసినై । యుండఁ జేయు సత్యమ్మయ్యయుండు. 183
క॥ జగతిపయిఁ గలహములు గలు । గఁగఁ జేసిన కొండెమునకు గలమంబు క్రియం
బగు నల పుణ్యాలంకా । రగతిం జెరుచుటయుఁగాక రాతిరి పగలు. 184
తే॥ వీరు చెప్పిన వార్తలు వారితోడ । వారు చెప్పిన వార్తలు వీరితోడఁ
దెల్పి గ్రామంబులోన నిత్తెఱఁగున బలు । మైన మానవతతుల స్నేహమును జెఱచు 185
తే॥ చెరిచి వారల దృఢతర చిత్తములను । విఱుగఁ గలహంబులను బొడమించునట్టి
ఘనతరాఘంబు సర్వేశ్వరునికి నధిక । కోప మొదవించుఁ జుమ్మ దయాపరాత్మ. 186
క॥ నానా విధములను సమా । ధానంబును నేర్పినట్టి ధర్మగురుని స
న్మానసమునకు విరోధం । బై నిలుపఁగఁ జేయునది సదాత్మవిచారా. 187
వ॥ అది పిశాచోద్యోగంబునకు సంబంధంబగు కార్యంబై దుర్గుణములయం దభివృద్ధి నొందు చుండు నింతయు మనంబున ఘనంబుగాఁ దలంచి యీ పాపంబుపయిం గోపంబు గావించి పరజనాపవాదాన్వేషణంబగు భాషణంబు నాకర్ణింప నది హృదయంబునను గూఢంబుగా నుంచవలయు నిరయంబుననుండి చనుదెంచు గూఢచారులపగిదినుండు కొండీఁడుల వృత్తాంతంబుల నూఁకొనక యుండువలనఁ గలుషంబును గలహంబును బగయును దుర్యశంబును లభించునని విచారించి యీ మహోగ్రపాపంబునకు భయంబు నొందవలయుఁ గొండెం బరణ్యంబునం గలుగు కంటకంబునకుం దరికొన్న వహ్నిం

180. అనిశంబు=ఎల్లప్పుడు । అస్వచ్ఛము=మలినము । సత్యధర్మానుచితముగ=నిజమైన ధర్మమునకు తగినట్టు।

181. మోహకారణమ్ములైన వాక్యములను=కామసంబంధములగు మాటలను ।

182 ఈ కానివిచారమ్ములఁ=ఈ చెడ్డ ఆలోచనలను । సాకల్యము గాఁగ=పూర్తిగా । జపధ్యానకలితుఁడు=జపమును ధ్యానమును గలవాడు ।

183. తొడరి=హత్తించి । పరేశు నెన్ననీక=సర్వేశ్వరుని ప్రార్థింపనీయక ।

184. పుణ్య అలంకారగతిన్=పుణ్యముల నెడి ఆభరణములను ।

185. ఈ తెఱగున=ఈ విధమున । మానవతతుల=మనుష్య సమూహముల ।

186. ఘనతర అఘంబు=గొప్ప పాపము । దయాపర ఆత్మ=దయగలవాడా ।

187. సదాత్మ విచార=శాశ్వతమైన ఆలోచనలుగలవాడా ।

188. పిశాచ ఉద్యోగంబునకు=పిశాచ కృత్యమునకు । పరజన అపవాద అన్వేషణంబు=ఇతరుల తప్పుల వెదకుట । ఆకర్ణింప=వినిన । నిరయము=నరకము । కొండీఁడులు=కొండెములు చెప్పువారు । ఊఁకొనక=వినక ।

బోలినదని సత్యవేదంబున లిఖియించియున్న దట్లగుటఁ గొండీఁడు కొండలు కన్యో
న్య కృతాపరాధంబుల నెఱింగించినందున నుదయించిన విరోధంబను నగ్నివలన గ్రా
మంబంతయు భస్మంబగుఁగాన దీని నెఱింగిన క్రియాన్వితుం డధిక వివేకశాలి యనం 188
బరఁగు మఱియును.

॥ విదితాసామాన్యకళా మహోవిభవ ముక్తివిత్తప్రదా నిర్వికా
ర దయాసార కృపారిభీకర విచారా సత్యవేదార్థభా
స్వదుదారా స్ఫురదర్చ్యశిష్ట జనతా సంస్తోత్రితాచార పా
పరజోదగ్ర ఘనాఘనా గగన సత్ప్రాకార సర్వేశ్వరా. 189

॥ జ్ఞానానందప్రపూరిత । నానా జనదోషపాలనాకృద్విభవా.
దీనాశ్రితజనరక్షణ । భూనుత నిగమాంతశరణ భూరివితరణా. 190

మాలిని॥ నిరుపమ ఘనలీలా నిర్జితాప్తారి జాలా । దురితహరణశీలా దుర్జనోన్మత్త హారా
భరితభువనవేషా పాలనాజ్ఞాభిలాషా । సుగుహిత మృదుభాషా గోప మత్యన్న పోషా. 191

గద్యము॥ ఇది శ్రీమద్గురు సార్వభౌమ కృపాసంప్రాప్త కవితావిలాసపాత్ర కాశ్యపగోత్ర
పవిత్ర మల్లెల వేంకటకృష్ణామాత్యపుత్ర విద్వజ్జన విధేయ తిమ్మరాజ నామధేయ
విరచితంబైన జ్ఞానచింతామణి ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము. 192

న్యశము=అపకీర్తి । కొండెము=చాడీ । కుంజము=పొదరిల్లు । దరికొన్న=మండుచున్న । వహ్నింబోలినదని=నిప్పు
సమానమయినదని । అన్యోన్యకృతాపరాధంబుల=ఒకరికొకరు చేసిన తప్పులను ।

189. విదిత=తెలియబడిన । అసామాన్య=సాటిలేని । కళా మహోవిభవ=ప్రభావముగల గొప్ప ఐశ్వర్యవంతు
డా । ముక్తి విత్తప్రదా=మోక్షధనము నిచ్చువాడా । నిర్వికార=వికారములులేనివాడా । దయాసార=దయా
సముగలవాడా । కృపా అరిభీకర విచారా=ఆత్మ విరోధులకు భయమును కలిగించు ఆలోచనలుగలవాడా ।
సత్యవేద అర్థభాస్వత్ ఉదారా=సత్యవేదార్థమునందు ప్రకాశించు గొప్పవాడా । స్ఫురత్=ప్రకాశించుచున్న ।
అర్చ్యశిష్ట జనతా=అర్చ్యశిష్టులయొక్క । సంస్తోత్రితాచార=సన్నుతులను గొను ఆచారముగలవాడా । పాపరజ
ఉదగ్ర=పాపధూళియొక్క భయంకరమైన । ఘనాఘన=మేఘములకు । గగన సత్ప్రాకార=ఆకాశమంతటి ప్రా
కారిగోడవంటివాడా ।

190. జ్ఞాన ఆనందప్రపూరిత=జ్ఞానముయొక్క ఆనందముతో కూడుకొనినవాడా । నానా జనదోషపాల
నాకృద్విభవా=అనేక నరుల పాపములను పోగొట్టి పాలించు వైభవముగలవాడా । దీన ఆశ్రిత జనరక్షణ=దీనులై
ఆశ్రయించిన జనులను రక్షించువాడా । భూనుత=లోకముచే నుతింపబడిన । నిగమాంతశరణ=వేదాంతములకు
శరణ్యమైనవాడా । భూరివితరణా=గొప్ప ధర్మబుద్ధిగలవాడా ।

191. నిరుపమ ఘనలీలా=సాటిలేని గొప్ప సంతోషముగలవాడా । నిర్జిత ఆప్త అరిజాలా=స్నేహితుల
విరోధివర్గమును జయించినవాడా । దురితహరణశీల=పాపములను పోగొట్టు గుణముగలవాడా । దుర్జన ఉన్మత్త
హారా=దుష్టుల కట్టిని పోగొట్టువాడా । భరితభువనవేషా=ప్రపంచమంతటను వ్యాపించినవాడా । పాలన ఆజ్ఞ
అభిలాషా=ఆజ్ఞలను పాలించుటకు ఇష్టము గలవాడా ।

# చతుర్థాశ్వాసము.

క॥ శ్రీ విదిత గోపువంశన । దీవర మృగధర మరన్న ధీవర వినుతా
ప్రావీణ్య సత్యవిదిత మ । హా వైభవ నిర్వికార ప్రాంచదుదారా. 1

ఆ॥ వినుము మరవపల్లె ననఘుఁడై విజ్ఞాన । లీల మెఱయుచుండు లింగవిభున
కానతిచ్చెఁ బ్రేమ నవ్వాలి కథను సం । జీవనాథ గురుఁడు భావములర. 2

సీ॥ చేతంబు నిద్రాత్రిఁ జెడిపోవు వస్తువు । లందుఁ బట్టుగ నుంచ నధప తగదు
భువనాధినేత కింపొంద వర్తించి యు । నేక పాతకములు నెడము సేయుఁ
బుణ్యావర్తనమును బూన మనంబు గ । ల్గిన జనుం డీలోకమునను గలుగు
వస్తుజాలముమీఁద భావంబు నిడక ప్ర । వర్తించునది యెటువలెనటన్న

తే॥ నట్టి వస్తువులందు నిజాత్మనిడుట । సకల దురితములకును బిశాచ శోధ
నలకుఁ గారణమై యుండునట్టి చిత్త । ముకు దురాశలు నఘములు నొసరఁ బెనఁగి. 3

క॥ పరలోక వస్తునికర । స్థిర ఫలములకోర్కి నదలఁ జేయున్ దీనిన్
వరమతి నెఱిఁగి క్రియాశ । త్వరుఁ డనఁదగు మానవుండు స్వాంతములోనన్. 4

క॥ కలపత్నము న్యాయార్జ్వమొ । వలవనిదో యని తలంచి వలపని దానిన్
వెలయంగ నీకద్రోయ । న్వలె వలసిన వస్తుతతులపై న్యాయమునన్. 5

సీ॥ పట్టుగా మది నుంచవలయుఁ గొంచెంబునై । బహు దినంబులు నిలువనిదియైన
ఫలము నాశింవక బహుళమై శాశ్వత । మున్నై సుఖంబునై తనరునట్టి
మేలుపై మనమును మిక్కిలి కోర్కెనై । నుంచఁగావలయు నిట్లుండు మనుజుఁ
డీ భూభువనమునం దెసఁగు వస్తువుల నా । సించి తత్ప్రాప్తికిఁ జేయఁ దగును.

తే॥ తనకుఁగల వస్తువులు చెడి తఱిఁగినందు । చేతఁ జింతింపఁ డింకైనఁ జిత్తమునను
బావకర్ముఁడుగాఁ డందువలనఁ దగులఁ । డురు పిశాచంబు నెట్టిడి యుగులలోన. 6

క॥ ఈ లోక వస్తువులఁ గన । నాలోచన మొనరఁ జేయు నతఁ డుర్విని దాఁ
జాలఁడల జేసునాథుని । లీలం బ్రార్థింపఁగా ఫలితవిజ్ఞానా. 7

వ॥ అది యెట్లనిన. 8

---

1. శ్రీ విదిత గోపువంశ నదీవరమృగధర=సంపదలచే తెలియబడిన గోపువంశము నెడు నదికి శ్రేష్ఠమైన చంద్రునివంటివాఁడా । ధీవర వినుతా=బుద్ధిమంతులచే పొగడబడినవాఁడా । ప్రావీణ్య=ప్రవీణత చెందిన । సత్యవిదిత మహా వైభవ=సత్యముచే తెలిసిన ఐశ్వర్యము గలవాఁడా । నిర్వికారా=వికారములు లేనివాఁడా । ప్రాంచదుదారా=గొప్ప ధర్మాత్ముఁడా ।

2. అనఘుఁడై=పాపరహితుఁడై । భావములరన్=మనమున సంతోషము గలుగునట్లుగా ।

3. చేతంబున్=మనస్సును । భువన అధినేత=సర్వేశ్వరుఁడు । ఇంపొందన్=ఇష్టమగునట్లు । దురాశలు=చెడ్డ ఆశలు । పెనగి=చుట్టుకొని ।

4. వస్తునికర స్థిరఫలముల కోర్కి=వస్తువు సమూహముయొక్క శాశ్వత ఫలములమీఁది ఆశను । స్వాంతములోనన్=మనమునందు ।

5. కలపత్నము=తనకున్న ఆపేక్ష । వలవనిదో=తగనిదో ।

6. బహుళమై=ఎక్కువయై । కోర్కెనై=ఆశతో । తత్ప్రాప్తికి=వానిని పొందుటకు । దగులఁడు=తగుల్కొనఁడు । ఉరు=గొప్ప ।

7. ఈలోకవస్తువులఁగనన్=లోకవస్తువులను బొందుటకు । ఫలిత విజ్ఞానా=ఫలవంతమైన జ్ఞానముగలవాఁడా ।

తే॥ స్వామి యీ లోక వస్తుసంపదలమీఁదఁ । బరఁగు పక్షంబు విడువని నరుఁడు వారి
శిష్యుఁడుగ నుండ నోపఁడు స్థిర వివేక । మున నటంచానతిచ్చెఁ గావున మహాత్మ. 9
సీ॥ తనకు దేవుఁడు నిబంధనము గావించిన । యవియె చాలునటంచు నాత్మఁ దలఁచి
మంచి క్రియార్హ్యఁ జే మహీపదార్థములపైఁ । బక్షంబు ఘనముగాఁ బాదు కొలుపఁ
డాత్మపక్షంబును వలఁదు నమ్మికయును । దేవునిమీఁదనే తిరము పఱచు
నీ రీతి నిలువని వారలాశను గోరి । నట్టి కార్యము నొంద రదియుఁ గలుగ
ఆ॥ నమితమైన దినము లనుభవింపక యుండు । రదియుఁగాక బహువిధాఘములను
బడుదు రెట్టులనినఁ బుడమి మేలులనాస । వడెడు వాఁడు గాంచుఁ బాపములను. 10
వ॥ దానం జేసి. 11
తే॥ ఐహికంబగు నాశలవన్ని విడిచి । స్వహృదయంబున దేవునిపై విశేష 12
భక్తి పుణ్యంబుమీఁద నిర్వాణముపయి । నధిక మగు వాంఛ మెయి నుండ నర్హమెపుడు
చ॥ అనిశము గానిపక్షము దురాశయుఁ బాసి మహాత్ముఁడైన యే
జనుని మనంబు స్వచ్ఛత నసంశయ రీతి నెసంగుచుండు నా
జనుని మనంబునం దెపుడు స్వామి తిరంబుగ నుండి వాని కిం
పెనయ నిజప్రసాదముల నిచ్చియుఁ గట్టడ చేయు మోక్షమున్. 13
చ॥ అలరఁగ నుత్తరింపఁ దగునట్టి స్థలంబుననుండినట్టి యా
త్మలను దలంప బుద్ధి విదితంబుగఁ జెప్పఁగ నర్హమౌను తత్
స్థలవసతి న్వసించి మతి దప్పని యాత్మ లవార్యమైన వే
ధలఁగను దాన నా పరుని దర్శనమబ్బని యందుచేనొగిన్ 14
తే॥ అధిక దుఃఖంబు నొందిన యట్టి దానిఁ । దలఁచి యీ రీతిఁ దగిన యాత్మలకుఁ గాఁగ
నెనరుఁ బూని పరేశుఁ డాజనుల పాప । ముల వణఁచి వారు పడెడు బెడ్డలను ద్రోసి. 15
క॥ వారలకు మోక్షభాగ్యము । గారవమున నివ్వ వారి కధిక తరంబై
కేరెడి భక్తిని దప్పక । యారూఢిగ వేఁడుకొనఁగ నగు విమలాత్మా. 16
సీ॥ మరణ సిద్ధుండైన పురుషుండు ప్రేమచే । దాయాది వానికి ధనము నిచ్చి
తనకు ధర్మము చేయుమని తాను జేసిన । యప్పులు దీర్పు మటంచుఁ జెప్పి
చనిన నా సొమ్ములఁ గొని వాఁడు తద్ధర్మ । విముఖుఁడుగాక సద్వినయ మెసఁగ

9. పరగు పక్షంబు=ఉండునట్టి ప్రేమను ।

10. నిబంధనము=ఏర్పాటు । పాదుకొలుపదు=ఉంచదు । ఆత్మ పక్షమును=తన ప్రేమను । తిరము పఱచు=స్థిరపఱచును । బహువిధ అఘములను=అనేక విధములైన పాపములను ।

12. ఐహికంబగు=లోకసంబంధమైన । నిర్వాణముపయి=మోక్షముమీద । వాంఛ మెయి=ఇష్టముతో ।

13. అనిశము=ఎల్లప్పుడు । కానిపక్షము=వ్యర్థప్రేమను । స్వచ్ఛతన్=పరిశుద్ధముగ । అసంశయరీతిన్=సందేహము లేకుండ । ఎసంగుచుండున్=ఒప్పుచుండునో । వానికి ఇంపు ఎనయన్=వానికి ప్రేమ అతిశయించగా ।

14. బుద్ధి విదితంబుగ జెప్పగ నర్హమౌను=బుద్ధికి దోచినట్లు చెప్పవచ్చును । తత్ స్థలవసతిన్ వసించి=ఆ స్థలవసతిలో నివసించి । అవార్యమైన వేధలన్ గనుదానన్=వారింపరాని బాధలను పొందుటవలనను । పరుని దర్శన మబ్బని యందుచే నొగిన్=దేవుని దర్శనము కలుగనందుచేతను క్రమముగా ।

15. ఈ రీతి దగిన=ఈ విధమున నుండెడు । నెనరు బూని=దయగలిగి । బెడ్డలను=కష్టములను ।

16. గారవమున=కరుణతో । కేరెడి భక్తిని=ఎక్కువయగు భక్తిని ।

17. దాయాది=వారసుడు । చనినన్=చనిపోగా । తద్ధర్మ విముఖుడు=ఆ ధర్మము చేయుటకు ఇష్టములేని

ధర్మంబునొనరింపఁ దగుఁ జేయకుండిన । నుత్తరించెదు చోటనుండు మనుజుఁ
తే॥ డధిక కాలంబు వేదన నందుచుండు । నధిప కొందఱు దాయాదు లట్టి యర్థ
ములను జేకొని వారి యాత్మలకు ధర్మ । మును నొనర్పరు దాన మృతిఁ జనినవారు. 17
క॥ తమ దాయాదులు ఘనముగఁ । దమ సొమ్ములు పుచ్చుకొని ముదంబున నెపుడున్
దమ మేలెఱుంగకుండిన । గమనించియుఁ జూచి మిగులఁ గష్టిని బడుదుర్. 18
క॥ కరుణాపహుఁడగు సర్వే । శ్వరు మాత్రము నమ్మి యునని సతతముగ వినుతిం
తు రిపుడు బ్రదికెడు మనుజులు । కరమెన్నఁగఁ దగు సుబుద్ధి గలిగినవార్గ. 19
క॥ మృతులైన వారి సొమ్ములఁ । దగ ముదముగఁ దీసి వారి యాత్మల స్వప్న
స్థితినైనఁ దలఁపనోపని । యతిహీనులఁ గాంచి జాగ్రదంచితమతులై. 20
చ॥ మునుకొని తాము మోసమును బొందక జీవములందియుండు వే
ళనె తమ యప్పులన్ని పదిలంబుగఁ దీర్చియు వీరు సోదరుల్
తనయు లటంచు వారికి ముదంబున నీయక ధర్మ మప్పుడే
చను నొనరించుకో నిల నిజప్రకటాత్మలతో దయానిధీ 21
చ॥ తమకయి దోడఁబుట్టువులు దల్లులు దండ్రులు నాత్మసంభవుల్
భ్రమయును సత్కృపారసము పక్షము గల్గిన వారలంచుఁ దా
ము మనమునందు నమ్మిటగు మోస మదెట్లనఁ జచ్చువెన్కఁ ద
మ్ము మఱచిపోదురంచు మనుమున్న సతమ్ముగ నెంచఁగాఁ దగున్. 22
సీ॥ అది యెట్టులనిన దాయాదులు మృతులైన । వారలు దాఁచిన భూరిధనము
నెల్లను వెదకి యదెల్లను బదిలంబు । చేయ విచారంబు చేయుటయును
దక్కఁ దద్రవ్య కర్తల యాత్మలను స్వప్న । మునైనఁ దల్పరు ఘనతరాఘ
సంకీర్తనమున నెంచఁగఁ దాపమవ్వగా । నుండ ధర్మములఁ జేయుటకుఁ దాము
తే॥ సమునసుండిన దానికిఁ గ్రమత లేని । న్యాయములనెల్ల గురువులతో నయముగా వ
చించుదురు వారితో మాయ చేసినట్లు । దేవునికి మాయచేయ లేరా విధమున. 23
క॥ ఇలపైఁ గోపేక్షం । జెలఁగెడి వారలకు బుద్ధి చెప్పెడి వివరం
బలరఁగ వ్రాసిరి దగు పె । ద్దలు తత్క్రమమెల్ల వినుము ధర్మవిచారా. 24

వాడు । దాన మృతిఁ జనినవారు=అందుచే ముందు చనిపోయినవారు ।

18. ముదంబున=సంతోషముతో । కష్టి=కష్టము ।

19. సతముగ=ఎల్లపుడు । వినుతింతురు=స్తోత్రము చేయుదురు । ఇపుడు బ్రదికెడు మనుజులు=ఇప్పుడు బ్రదికియున్న నరులు ।

20. స్వప్నస్థితినైన=కలలోనైన । తలఁపనోపని=తలంచజాలని । అతిహీనులన్=మిక్కిలి నీచులను । జాగ్రదంచితమతులై=జాగ్రత గలిగిన బుద్ధితో ।

21. మునుకొని=ముందు పడి । జీవములందియుండు వేళనె=బ్రదికియున్నపుడే । పదిలంబుగ=భద్రముగ । చనున్ ఒనరించుకోన్=చేసికొనదగను ।

22. ఆత్మసంభవుల్=తన బిడ్డలు । భ్రమయును=భ్రాంతియును । సత్కృపారసమును=మంచి దయారసమును । పక్షము=ప్రేమయును ।

23. తద్రవ్య కర్తల=ఆ ధనమున కధికర్తలైనవారి । ఘనతర అఘ సంకీర్తనమున=గొప్పదైన పాపసంకీర్తనములో । తామసమున నుండినదానికి=ఉపేక్షతో నుండినందులకు ।

24. కోపాపేక్షన్ జెలఁగెడివారలకు=కోపముందు ఇష్టముతో నుండువారికి ।

క॥ వరదుఁ డనమించు సర్వే । శ్వరుఁ డమిత దయారస ప్రసన్నుఁడగుచు స
త్పురుషుల దుర్జనులను సా । దరముగ రక్షించు నెపుడు నుదారమనీషన్. 25

క॥ రవివలన సత్పురుషులకు । నవగుణులగు పంచజనుల కాతపము నొసం
గి వరంబగు వర్షంబును । వివరంబుగ నిర్ణయించు విజ్ఞాననిధీ. 26

క॥ ఆ వరణి సత్క్రియాప్తులు । వే సర్వజగన్నివేశు ప్రియసుతులై త
ద్భాసుర భువన విదితరగు । నాసముచిత భావమునకు నయ మొనరంగన్. 27

సీ॥ అర్హామై యుండిన ట్లహితులపై విరో । ధముఁ బూనియుండక తనకు మేలు
చేసిన వారికి వాసిగా నుపకార । మును జల్పుచును సర్వ జనులతోఁ బాటు
వినయులై సర్వేశ్వరుని వేఁడుకొనఁ దగు । నీరీతిఁ దమపైన హితవు గల్గు
వారల స్నేహింపవలయును దను నవ । మానం బొనర్చిన మానవులకు

తే॥ నధిక బహుమాన మొనరించుటయు ముఖ్య । మన్నిటి నెఱింగు వరగురుఁడైన యేసు
నాథుఁ డిటువంటి మైత్రిని నయముగాను । నేర్పి యుపదేశించు పుణ్యంబనిరి మహాత్మ 28

తే॥ ఉపవసించుటయును దేహ మాతురముగఁ । గష్టపఱుచుట మొదలుగాఁ గలిగినట్టి
యీ తపంబుల నెల్ల నహీనమైన । పుణ్యము లనంగ లేదు నేర్పిన గురుండు 29

క॥ వైరమ్ములచేఁ దనదు శ । రీరమ్మును నాత్మ నపరరీతిఁ జెరచ న
ద్దానయు నెటువలెనఁ బగ । నారూఢిగఁ గలుగు మనుజుఁ డవనీస్థలిపై. 30

వ॥ విరోధం బనెడు ఘోరతరదురితమ్మున నాత్మాత్మను జెడఁజేయుటయేగాక తద్దురిత సమాగతంబగు వితతదుఃఖంబున నిజ ప్రతీకంబునుం జెఱచి సతతంబును మనంబునం గలిగిన ఘనమనస్తాప వేదనం గాంచియుండు నందున జగత్ప్రశస్త ప్రభావులై యాపోస్తులై యుండెడి యర్ప్యశిష్ట పౌలుఁడను మహానుభావులు విధించి యెఱింగించిన యుపాయంబును దలంపవలయు నెట్లనిన. 31

మ॥ తన కోపంబుపయి న్సరోజహితుఁ డస్తక్ష్మాధరాగ్రస్థలం
బున కేగన్వల దెట్లనంగఁ గలహంబుం గోప మేవేళఁ గ
ల్గిన నావేళనె మాని పూనఁదగు బాలిన్ మైత్రినిం గాక త
క్కిన యుం దీర్ఘ విరోధ మన్నిటను గ్రుంగించుం దనున్మిక్కిలిన్. 32

25. దయారస ప్రసన్నుడు=కరుణచే సంతుష్టుడైనవాడు । ఉదారమనీషన్=సద్బుద్ధితో ।

26. రవివలన=సూర్యునివలన । అవగుణులగు=చెడ్డవారగు । పంచజనులకు=మనుష్యులకు । ఆతపము=ఎండ ।

27. సర్వజగన్నివేశుప్రియసుతులై=సర్వేశ్వరునకు ప్రియమైన కుమారులై । తద్భాసుర భువనవిదిత=ఆ ప్రకాశించుచు లోకమున వెల్లడియైన । ఆసముచిత భావమునకు=నయముగలిగిన బుద్ధికి ।

28. అహితులపై=విరోధులపై । హితవు గల్గువారలన్=ప్రేమగలవారిని ।

29. ఆతురముగ=ఎక్కువగ । అహీనమైన=గొప్పదైన ।

30. అపరరీతిన్=పై విధముగా । పగన్ ఆరూఢిగ=విరోధమును ఎక్కువగా ।

31. ఘోరతర దురితమ్మునన్=ఘనమైన పాపముచే । ఆత్మాత్మనన్=తన ఆత్మను । తద్దురిత సమాగతంబగు=ఆ పాపమువలన కలుగునట్టి । వితత దుఃఖంబునన్=ఎడతెగని దుఃఖమును । నిజప్రతీకంబునున్=తన శరీరమును । జగత్ప్రశస్తప్రభావులై=లోకమున ప్రసిద్ధికెక్కిన ప్రభావము గలవారై ।

32. సరోజహితుడు=తామరలకు స్నేహితుడైన సూర్యుడు । అస్తక్ష్మాధర అగ్రస్థలంబునకు=అస్తమించు పర్వత శిఖరమునకు । ఏగన్వలదు=పోకూడదు (సూర్యుడు అస్తమించక పూర్వమే కోపమును విడువవలయును) దీర్ఘవిరోధము=చిరకాలముండునట్టి పగ । గ్రుంగించున్ తనున్ మిక్కిలిన్=తన్ను మిక్కిలి కృశింపచేయును ।

సీ॥ అదిగాక యుర్వ్యశిష్టాపోస్తులావతి । చ్చిన చందమున నొక్క మనుజునకును
బగఁ గల్గియుండక మిగుల నందఱకును । స్నేహంబు గల్గి వసింపవలయు
నొక్కఁడు తనకు నేదొక కీడు సల్పిన । నరిగ వానికిఁ గీడు సల్పవలదు
వానిపైఁ బక్షంబుఁ బూని తాలిమియును । సాధుగుణంబును జాల గలిగి
తే॥ యాత్మలను బ్రోచుకొనవలె నటులు సేయు । నగులు స్వామికి శిష్యులై పరఁగి యతని
మోక్షరాజ్యంబునందు నిమ్మగ వసించి । యనుభవింతురు సౌఖ్యంబు ననవరతము. ౩౩
ఆ॥ జగతి ననృతములగు సాక్ష్యముఁ బెట్టెడి । మానవులకు నెల్ల మంచి బుద్ధి
చెప్పవలయు దాని నొప్పుగా నాలింపు । మధిక నయనిధాన యమితదాన. 34
సీ॥ క్షితినరుఁ డొక వార్తఁ జెప్పఁ దలంచిన । సత్యసమేతమై సకల పుణ్య
ఫల సమూహముల నేర్పడఁ జెప్పి తన యనృ । తోక్తులు నిజము సేయుటకుఁగాఁగ
సర్వేశ్వరునిమీఁద సాక్ష్య మూనఁగవద్దు । వెఱవక వేఱొక విధముచేత
నైన దబ్బఱలైన యానఁ బెట్టఁగఁగూడ । దది యెటులున్న మహాత్ములైన
ఆ॥ పరుని పాత్రమైన తిరునామమును గొని । యాన యిడిన నమ్మహానుభావు
వలనఁ బుట్టినట్టి వస్తువులను గొని । సాక్ష్య మిడినఁగాని తప్పు గాంచు. 35
క॥ ఘనముగ నా యానలు దే । వునిపైఁ బడు నరుఁడు స్వానృతోక్తులకుఁ బరే
శుని సాక్షిగఁ బెట్టినయెడ । లను స్వామికి నదియె భూరి యవమానమగున్. 36
చ॥ సారిదిఁ బరాత్పరుండు దమ స్తోత్రము సేయఁగఁ దానొనర్చు స
త్కృగుణ మనారతంబు విదితంబుగ నెంచఁగఁ గాదె జిహ్వను
స్థిరముగఁ గల్గఁ జేయుట హసింపుచుఁ జూదము నాడువేళ సం
గరములయం దసత్యములఁ గ్రమ్మిన దొంగతనంబునందు ద
బ్బఱలగు నొట్టులెల్లఁ దనపై నిడ నిల్పెన మానవాళికిన్. 37
సీ॥ ఘనమైన మేలెఱుంగక పరేశునిమీఁద । వగమైత్రి నునుచఁగఁ బరుఁడు తమకుఁ
గట్టడ చేసిన కార్యంబులను జేయ । కుండుట గాక యనుచితరీతి
పదపదంబునకు దబ్బఱలగు సాక్ష్యపు । వాక్యమ్ములను దగ స్వామి కిటులు
నవమాన మొనరింప నర్హంబుగా దట్లు । గావించుకొంటె సిక్కుముగ మూఁగ
తే॥ యగుచునుండుట మేలు జిహ్వాంచలమున । నాత్మలకుఁ జేటు గల్పింపనగునె యిట్టి
యనృత సాక్ష్యముఁ బెట్టిన యందువలన । నీ మనుష్యుల కేల ఫలంబేమి గలుగు 38
ఆ॥ అందువలనఁ దమకుఁ జెందదనే పెద్దతి । కంబు సామ్ములును సుఖం బసత్య
సాక్ష్య మిడినఁ గల్మషంబును గీడును । వచ్చు సత్యముగను వరమనీష 39

---

33. ఇమ్ముగ=సుఖముగ । అనవరతము=ఎల్లపుడు ।

34. ఒప్పుగా=బాగుగా । ఆలింపుము=వినుము । నయనిధాన=న్యాయమునకు నిలయమా ।

35. అనృతోక్తులు=అబద్ధపుమాటలు । సాక్ష్యమూనగవద్దు=అనపెట్టరాదు । వెఱవక=భయపడక ।

36. స్వ అనృతోక్తులకు=తన అసత్యవాక్యములకు । భూరి=గొప్ప ।

37. సారిదిన్=క్రమముగా । అనారతంబు=ఎల్లపుడు । విదితంబుగ=స్పష్టముగ । హసింపుచు=ఎగతాళి చేయుచు । సంగరములయందు=యుద్ధములందు ।

38. అనుచితరీతి=తగని విధముగా । జిహ్వాంచలమున=నాలుక చివరతో ।

39. కల్మషంబును=పాపమును । వరమనీష=శ్రేష్ఠమగు జ్ఞానము గలవాడా ।

క॥ నరులు ధరిత్రిని సర్వే । శ్వరునకు భయపడక యుండి వ్యర్థము గాఁ ద
బ్బఱసాక్ష్య మిచ్చుచుందురు । దురితము లభియించు దీనఁ దోరముగాఁగన్. 40

సీ॥ ఇటమీఁద నైన సర్వేశ్వరు నాజ్ఞకుఁ । బాత్రంబుగాని యీ పాతకములఁ
దొలఁగి తమ్మున్మను బ్రేమ గలిగించు సర్వేశు । తిరునామముపయి దబ్బఱలునైన
యాన లెంతయుఁ బెట్టి యాతనికి నవమాన । మును ఘటింప నొనర్చక నవరతము
సకలేశ్వరుఁడు తమ కలరంగఁ జప్పిన । యుపకారము నెల్ల నొగిఁ దలంచి 41
తే॥ స్వామిని నుతించి యనృతంపు సాక్ష్య మిడక । మనువు పుణ్యాత్ము లగు వార లనుభవించి
నట్టి బహుమాన విభవంబు నమితమైన । మోక్షసుఖమును గనఁదగు ముఖ్యులగుచు.

ఆ॥ పాప రహితులగుచుఁ బరఁగు సాక్ష్యముఁ బెట్టు । నధిక పుణ్యమయ్యె నదియు వినుము
వెలఁగి మూఁడు కార్యములు దాని నిడుటకు । సమరరిపువిదార సత్యచార. 42

క॥ ధర నిజమునఁ బట్టియు నవ । సాయంబులోనైన గాని సనయంబగు నా
వ రహితిఁ బెట్టఁగవలయును । వెరవగు తద్విధము నెల్ల వినుము మహాత్మా. 43

ఆ॥ అనృతసాక్షిఁ బెట్టినందున నది స్వల్ప । కార్యమైన దొడ్డ కలుషమగుర్వి
నసమయమున సత్యమైన సాక్షిని నిడ । నదియె యల్పపాపమగు మహాత్మా. 44

చ॥ వసుమతి నిట్లు సారెకును వ్యర్థపు సాక్ష్యము వెట్టువాఁడు దు
ర్వ్యసనముచే నసత్య విదితాధిక సాక్ష్యములందు నిల్చురిం
పెసఁగ నఘాప్తికిన్ మనము నెంతయు భీతిలువార లౌనలన్
వెసఁ బడకుండఁగావలయు విద్వదభిస్తుత సత్యభాషణా. 45

వ॥ నీతిరహితంబుగా సాక్ష్య మిచ్చుటెట్లనిన. 46

సీ॥ అఘము నొనర్చెదనని యాన వెట్టుట । నయహీనమగు సాక్షి నాఁ బొసంగు
నట్టియానలు బెట్టునవ్వేళ మనమునఁ । గపటంబుఁ దలఁచి నిక్కంబుగాను
నానపెట్టిన నది యధిక పాతకమగుఁ । గలుషంబు నొనగింపవలయున నెడి
స్వాంతంబుచేత నీ పాపంబు చేసెద । నని యానవెట్టిన నది నిబద్ధ
తే॥ మైనయానగ నెంచినదైనఁ బెద్ద । పాప మదియగు నది పెద్ద పాపమగునొ
చిన్నపాపంబగునొ యనఁ బెద్ద పాప । మును రచింపఁగ సత్యమై మొనసినట్టి. 47

క॥ ఆన యిడిన నది యధికం । బైన యఘంబగు మనుజులు నఘములకొఱకుఁగా
నానలఁ జెల్లింపఁగఁ దగ । దీనరులకు సత్యసాక్ష్య మిడు పాపములన్. 48

40. తోరముగాఁగన్=అధికముగా ।

41. ఘటింప నొనర్చక=కలుగఁజేయక । అలరంగన్=ఒప్పునట్లుగా । ఒగిన్=క్రమముగా ।

42. సమరరిపువిదార=సందించిన శత్రువులను నాశనము చేయువాఁడా ।

43. సనయంబగు=న్యాయముతోఁ గూడినదైన । రహితి=ఆసక్తితో । వెరవగు=యుక్తమైన ।

44. అసమయమున=సమయము కానప్పుడు (అనవసరముగా)

45. వసుమతిన్=భూమియందు । దుర్వ్యసనముచే=చెడ్డ తలంపుతో । అసత్యవిదితాధిక=దబ్బఱలైన గొప్ప । ఇంపు ఎసఁగన్=ఇష్టముతో । అఘాప్తికిన్=పాపమును బొందుటకు । భీతిలువారలు=భయపడువారలు । వెసన్=తొందరగా । విద్వత్ అభిస్తుత=విద్వాంసులచే స్తుతింపబడువాఁడా ।

46. నీతి రహితంబుగా=నీతిలేకుండ ।

47. నయహీనమ్మగు సాక్షి నాఁ బొసంగు=నీతిలేని ఆన యనఁబడును । పాతకము=పాపము । స్వాంతంబుచే
=తలంపుచే । రచింపఁగ=చేయుటకు ।

ఆ॥ మొదల నాలుగవది తుది పదియవ దిట్లు । గలుగు సప్తకల్పనలను మీఱి
వట్టి యఘములకంటె నన్యతంబుగా నిడు । సాక్ష్యము కడు కల్మషంబు సుమ్ము. 49

క॥ ధరపై సర్వేశ్వరునకు । వెలుచు క్రియాభాసితులకు విదిత గురుండై
పరఁగిన జేసువరేణ్యుం! డరయ నిబంధనము చేసినది వినుమనఘా. 50

తే॥ ఆనవెట్టక లేని కార్యంబు లేదు । కలిగియున్నట్టి కార్యంబు గలదటంచు 51
నిల స్వభావంబుగాఁ జెప్పవలె ననత్య । సాక్ష్య మీఁద వాంఛ గలిగిన జనులు నెపుడు.

క॥ ఉరు కలుషంబునఁ బడి ద । బ్బఱసాక్ష్యము వెట్టినట్టి వారలకెఁ బరే
శ్వరుఁ డిడు దండనలోఁ బడి । విరతము నుండరు సుమ్ము నిత్యవిలాసా. 52

ఉ॥ కావునఁ బుణ్యవంతులనఁగాఁ దగినట్టి నరుల్ పరేశ్వరుం
డా విధి సత్యవేదమున నానతి యిచ్చిన దాని నేటుగా
భావమునం దలంచుకొని ప్రస్తుతి కెక్కఁగఁ జెల్లు నట్టులం
టే విను మానవెట్టు నరుఁడే శ్రమలన్ స్థిరంగాంచు నుండెడున్ 53

క॥ దేవునివలనన్ దార్ఢ్యం । బై వచ్చెడి యాజ్ఞలతని యాలయమునఁ బా
దై వసియించునటంచును । వేవిధముల నుండు సత్యవేదమునందున్. 54

ఆ॥ ఆనవెట్టవలసినా మున్ను చెప్పిన । సరణి నీతితోడ సత్యముగను
గావలసిన వేళ భావించి యిడఁదగు । గురు పదాబ్జభృంగ దురితభంగ. 55

తే॥ పాపసంఘము నెల్లను బరిహరింప । ధర్మకార్యవ్రజమును బెద్దలయినట్టి
వారలు దయారసంబున వ్రాసినట్టి । పగిది వినుపింతు వినుము పావనచరిత్ర. 56

సీ॥ ధరఁ గ్రియావిదులు ముందరఁ దా మొనర్చిన । దురితౌఘములకుఁగాఁ దోడులోడ
నొనరు ప్రాయశ్చిత్తమును జేయఁ దలఁచిన । వందుకు ధర్మకార్యత్రయంబు
నొగి విశేషముగఁ జూపెంగ నొప్పు ఘన జపం । బును జేయుటయు నొక్కప్రొద్దునికియు
భిక్షమిచ్చుటయును విదితంబుగానివి । గావింపఁ గలుష సంఘము నణంప
తే॥ నధిక పుణ్యంబులై యుండు వదియుగింటె । భిక్షమిచ్చుట తన సొమ్ము వేదవేద్య
నకుఁ గరం బిచ్చునట్లగు సుకము వదలి । యొక్కప్రొద్దులు నద్భక్తి నుండు టెపుడు 57

49. తుది=చివర । సప్తకల్పనలను=ఏడు కల్పనలను ।

50. క్రియాభాసితులకు=పనులచే ప్రకాశించువారికి । విదితగురుండై=తెలిసిన గురువై । జేసువరేణ్యుండు=జేసు అను శ్రేష్ఠుడు । నిబంధనము చేసినది=ఏర్పాటు చేసినది ।

51. ఆనవెట్టక=ఒట్టు పెట్టుకొనక । అసత్యసాక్ష్యమిద వాంఛగలిగిన=అబద్ధపు సాక్ష్యము పెట్ట నిష్టము గలిగిన ।

52. ఉరు కలుషంబునన్=గొప్ప పాపముతో । నిరతము=ఎల్లప్పుడు ।

53. నేటుగా=దృఢముగా । ప్రస్తుతికెక్కఁగన్ చెల్లు=ప్రఖ్యాతి చెందదగును ।

54. దార్ఢ్యంబై వచ్చెడి=గట్టివై వచ్చునట్టి । ఆలయమున=ఇంటియందు । పాదువై=స్థిరమై । వేవిధముల=అనేక విధముల ।

55. మున్ను చెప్పిన సరణిన్=ముందు చెప్పిన విధముగా । గురుపద అబ్జ భృంగ=జేసు నాథుని పాదముల నెడు పద్మమందుండు తుమ్మెదవంటివాడా । దురితభంగ=పాపము లేనివాడా ।

56. పరిహారింపన్=పోగొట్టుటకు । ధర్మకార్యవ్రజమును=పుణ్యకార్య సమూహములను ।

57. క్రియావిదులు=తెలిసినవారు । దురితౌఘములకుఁగా=పాపసమూహములకొఱకు । ధర్మకార్యత్రయంబు నొగిన్=మూడు ధర్మకార్యములను క్రమముగా । ఒక్కప్రొద్దునికియు=ఉపవాసముండుటయు । వేదవేద్యనకు=వేదముచే తెలిసికొనదగువానికి (సర్వేశ్వరునికి) సుకము వదలి=సౌఖ్యమును విడచి ।

క॥ తన దేహమును బరేశున । కనిశము గానుక నొసంగు పట్లగును జపం
బును జేయుట తన యాత్మను । వినయత సర్వేశు కిడిన విధమగుచుండున్. 58
క॥ నయమలరఁగ నీ ధర్మ । క్రియమును గొనలేక సల్పు ధన్యాత్ములకున్
దయచే దేవుఁడు మోక్ష । ప్రియసౌఖ్యము నొసఁగుఁ జూవె విజితారిగణా. 59
వ॥ మఱియు నొక విశేషంబు గలదు వినుము. 60
ఉ॥ ధ్యానము నాత్మశోధనయుఁ దప్పక పూజను వింట దేవునిన్
దీనత వేఁడుకొంటయును ధీరనుతా జపమంద్రు సజ్జనుల్
దానఫలంబు గల్గుటకుఁ దాము పరోపకారయింత లేక త
న్మానస వీధియందు నియమంబునఁ దజ్జపమొప్పఁ జేయఁగన్. 61
క॥ వినుమింక నొక్క ప్రొద్దను । ఘనపుణ్యం బెట్టిదనినఁ గడు కష్టములం
గన నంగము నమరించుట । యును శోషింపఁగ నొనర్చుటొప్పనయంబున్. 62
ఆ॥ అధిప భిక్ష మొసఁగునది యెట్టులన సన్య । జనుల కుపకృతిని నిజముగఁ జల్పు
టట్టి యుపకృతులు సయుఁబుశఁ బదునాల్గు । కార్యముల నణంగి క్రమతనుండు. 63
వ॥ * అవి యన్నియు సూఁచెఱిఁగించితి. 64
క॥ ఇల నన్యజనుల నేర । మ్ములఁ గొదపల నెఱుఁగనట్టి పురుషులకెల్లన్
తెలియఁగ వానిని నిరతము । తెంపోయఁగ వలదు సుమ్ము తత్త్వవినోదీ. 65
క॥ వారలొనర్చిన కొంచెపు । నేరమ్ముల నెంచవలదు నిరతము మనమీ
ధారుణి సర్వేశ్వరుని కు । మారులమని తలఁచి యన్యమనుజులమీఁదన్. 66
క॥ కరుణ దలంపఁగ వలయును । బరు లఘములఁ బడినఁ గోపభావమును గరం
బరుదును మది గాంచఁగవల । దరయ నదేమనిన దాని నాలింపు మికన్. 67
క॥ వరలోకంబున నుత్తమ । తరమై తగు సన్మనస్కుఁ డా పాపమునం
దురుగతిఁ బడఁగా నాలుగు । వరములు గలవాఁ డగుచు ధృవంబగురీతిన్. 68
సీ॥ సర్వేశ్వరుని విశేష ప్రసాదమ్ములఁ । గాంచిన వాఁడున్న మించినట్టి
యాదిపురుషుఁడు ఘోరాఘమ్ములను బడెఁ । జెంగు దురాశలచేత నిపుడు
నిండించఁబడి ధాత్రినుండు మర్త్యుండును । కల్మషంబునఁ బడుట కార్యమగునె
దురితంబులోఁ బడు నగునిప్పిఁ గరుణ పూ । ర్ణంబుగనుండ న్యాయంబు గలదు

58 అనిశము=ఎల్లప్పుడు ।

59. నయమలరఁగన్=న్యాయ మొప్పునట్లు । కొనలేక=తప్పక । చూవె=సుమా । విజిత అరిగణా । జయింపబడిన శత్రు సమూహములు గలవాఁడా ।

61. ధీరనుతా=జ్ఞానులచే పొగడబడినవాఁడా । తన్ మానస వీధియందు=తన హృదయమునందు ।

62. అంగము నమరించుట=శరీరమును ఉంచుట । శోషింపగన్=చిక్కిపోవునట్లు । అనయంబున్=ఎల్లప్పుడు।

63. ఉపకృతిని=ఉపకారమును ।

65. కొదవలను=కొఱతలను । నిరతము=సదా ।

66. కొంచెపు నేరమ్ములన్=చిన్న తప్పులను ।

67. కరంబరుదును=మిక్కిలి ఆశ్చర్యమును । అరయన్=విచారింపగా .

68. ఉత్తమతరమై=మిక్కిలి శ్రేష్ఠమై । పాపమునందు దురుగతి=పాపములో వేగముగ ।

69. ఆదిపురుషుఁడు=ఆదాము । కార్యమగునె=అతిశయమగునా । ఆదిజనుడు=ఆదాము । పొనొనర్చునః=

* ఈ పదునాలుగు కార్యములు ప్రథమాధ్యాయమున 129 వ పద్యమునుండి 134 పద్యములలో చెప్పబడినవి.

క॥ ప్రాయశ్చిత్తము సేయుట । న్యాయంబగుఁగాని వాని నామోదమునన్
వేయువిధంబులఁ జెప్పుట । నా యఘముల వినెదు వార లంహఃప్రతతిన్. 84

క॥ పడుటకుఁ గారణమగు టీ । పుడమిని న్యాయంబుగాదు భువనేశ్వరుపై
కడలేని భక్తి నుండుట । కడరు ఋణము గలిగియుండు నతని కనిశమున్. 85

క॥ అనుమానం బొనరింపుచు । నవని జనులు వందువలన నఖిలేశ్వరునిం
గవగొని నింద యొనర్పఁగ । నవు గారణమగుచు నుంట న్యాయంబగునే. 86

వ॥ కావున నన్య జనకృతాపరాధాన్వేషణంబు గావింపక సర్వేశ్వరునియం దంతరంగం బభంగంబుగా నిల్పిన క్రియానిపుణు లుత్తమంబగు కైవల్య సౌఖ్యంబనుభవింప నర్హు లదియునుంగాక దురితనికరమ్ములం బరిహరింప నుత్తమంబగు మనస్తాపంబునుం గలుగు స్తోత్రంబు లొనర్పవలయు నెట్లనిన. 87

సీ॥ మొదలుత్తమంబునఁ బొదలు మనస్తాప । మొనరించు నెట్లన జనకుఁడైన
భువనాధి భర్తకుఁ బొందని పాపంబు । లను జేసినందున మనమునందు
నరు మనస్తాపంబునొంది యా కిల్బిష । మ్ముల నిఁక మీఁదటఁ జలుపననుచు
నందుకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనరింతు । ననుచు నభిప్రాయమున వచించు
తే॥ నది యమోఘ మనస్తాప మనఁగనొప్పు । అర్చ్యశిష్ట యగు స్తిసీసను మహాత్ముఁ
డానతిచ్చిన యది కలుషాపహరణ । మునకుఁ జేయు మనస్తాపము మహియందు. 88

చ॥ వరమగునేని యా భువనవల్లభుఁడై తగు స్వామిచేత సు
స్థిరముగ నీయఁగాఁ జెలువు దీవనల న్వరపుత్రుతోడి చు
ట్టఱిక మొనర్చి నెయ్యెడ నొడంబడి మేలని మెచ్చి సత్కృపా
సరణి నలర్చు నా స్పిరితుసాంక్తువు మైత్రి రచించునట్లుగన్. 89

ఆ॥ సల్పుచుండు నెపుడు సన్మనస్కులసభ । యందుఁ బొందుపఱుచు నవని జనులఁ
గలుగఁజేయునట్టి ఘనుని వశంబున । నొప్పగించుఁ జుమి ఘృణోచితాత్మ. 90

క॥ దురితాంధకారమును భా । సురగతి నెడఁబాపునట్టి సుమనస్తాపో
ద్గరిమ నధిక ప్రకాశం । బరుదెంచుం దగ మనుష్యు నాత్మకు నెపుడున్. 91

---

84. ప్రాయశ్చిత్తము=చేసిన పాపములకొఱకు పరిహారము । ఆమోదమునన్=సంతోషముతో । వేయు విధంబులన్=అనేక రీతుల । ఆ అఘములన్=ఆ పాపములను । అంహఃప్రతతిన్=పాపసమూహములందు ।

85. భువనేశ్వరుపైన్=దేవునిపై । కడలేని=అంతులేని । అడరు ఋణము=అధికమగు అప్పు ।

86. అఖిలేశ్వరునిన్=సర్వేశ్వరుని । కవగొని=జతగూడి ।

87. అన్య జనకృతాపరాధ అన్వేషణంబు=ఇతరుల పాపములను వెదకుట । అంతరంగంబు అభంగంబుగా=మనసును నిలకడగా । కైవల్యసౌఖ్యము=మోక్షసుఖము । దురిత నికరమ్ములన్=పాపసమూహములను

88. పొదలు=వర్ధిల్లు । భువన అధి భర్తకు=లోకమునకు నాధుడయిన సర్వేశ్వరునకు । కిల్బిషమ్ములన్=పాపములను । అమోఘ మనస్తాపము=వ్యర్థముకాని మనస్తాపము । కలుషాపహరణమునకు=పాపమును పోగొట్టుటకు।

89. వరమగునేని=శ్రేష్ఠమైనదయినచో । భువనవల్లభుడు=లోకపాలకుడు । సుస్థిరముగ=శాశ్వతముగ । దీవనలన్=ఆశీర్వాదములను । వరపుత్రుతోడి చుట్టఱిక మొనర్చు=సుతుడైన సర్వేశ్వరునితో బాంధవ్యము గలిగించును । ఒడంబడి=ఒప్పుకొని । సత్కృపాసరణి నలర్చున్=దయగల మార్గమును ఏర్పాటు చేయును ।

90. పొందుపఱుచున్=కలుపును । ఘృణోచిత ఆత్మ=కరుణతోగూడిన మంచి మనసుగలవాడా ।

91. దురితఅంధకారమును=పాపము అనెడు చీకటిని । భాసురగతిన్=ప్రకాశముతో । ఎడబాపునట్టి=పోగొట్టునట్టి । సుమనస్తాపోద్గరిమ=మంచి మనస్తాపము అనెడి గొప్పభాగ్యముచే ।

క॥ కైవల్య కవాటంబును । దా వేగము తెఱచుఁ దగిన తాళపుఁ జెవిగా
నే వేగఁ గలుగునందున । నావిర్భవమగుచు సకలమైన ఫలంబుల్. 92

క॥ మును వానియందుఁ గలిగిన । ఘనమగు మేలును దాని గాను నెఱుఁగ నీ
వినతుల సదర్చ్యశిష్టా । ర్థ్యనరుం గావింతు దేవుని న్యాయముతోడన్. 93

క॥ అది వెల కిల వగదేరని । సదముల మాణిక్యమైన చందమున నగుల్
పదపడి చేసిన యఘముల । వదలఁగఁ గావించు నెంత బలవంతములన్. 94

ఆ॥ అవని నెవనియందు నట్టి మనస్తాప । మును బరాత్పరుండు గనెనొ వాని
పాపవితతి నోర్చి పరమ నిజప్రసా । దముల నిచ్చు మందుఁ గ్రమము దెలిసి. 95

క॥ భువి నెటువంటి మనస్తా । పము గలిగిన పంచజనుఁడు పదపడి యుత్త
మమైన స్థిరసౌఖ్యము । సమధిక మహిమలు సమస్తము చనవునఁ జెందున్. 96

ఆ॥ మరణకాలమునను దురిత సంకీర్తన । మునకు ముందు మనసు చక్కఁ జేసి ప్ర
శస్తమైన యీ మనస్తాప విధి గల్గు । నని యెఱుంగుము ముక్తి యందు నిజము. 97

సీ॥ అటులొనట మొదలు నానఁటిన కార్త్య । శిష్టవా రటువలెఁ జెలఁగుచున్న
ఘన మనస్తాపసంగతి గల్గునట్టి వి । శేషముల్ నెఱింగి స్థిరమనీష
నడుగడుగునకు యోగ్యమైనట్టి యీ మన । స్తాప మంత్రమును విచారరహిత
ముగఁ జెప్ప వచ్చు మేల్గు గని క్రీస్తువులకు । సద్బుద్ధి రాఁగల సరణి గాఁగ
తే॥ అలర నుదయమునందు మధ్యాహ్నమునను । రాత్రి సర్వేశ్వరునికిఁ బొందరాని కార్య
భరముఁ బూనుటచేఁ గను బ్రతిదినంబు । పరమనస్తాపమును నొందవలయు ననుచు. 98

తే॥ బుద్ధి చెప్పెదు రిటువలె భువనవిదిత । మగు మనస్తాపమును జేయఁ దగునటంచు
హృదయ వాక్క్రియలచేతఁ దుదనుగనని । మహిమ గలిగిన దేవుని కహితమైన. 99

తే॥ అఘముల ననేకములఁ జేసినందువలన । పరమనస్తాపమును గాంచవలయుఁ దాను
దురితములచేత నా పరాత్పరుని యిష్ట । మును నణంచితిననియు దుర్వినయమునను 100

క॥ ఘనముక్తిని బోఁ దఱిమితి । నని నరకంబునకుఁ బాత్రమైతి నటంచున్
మనమునఁ దలఁచి మనస్తా । పనియతి నొందంగవలయుఁ బ్రజ్ఞానిధీ. 101

---

92. కైవల్య కవాటంబును=మోక్షవాకిలిని । ఆవిర్భవమగుచు=పుట్టుచు ।

93. వినతులన్=ప్రార్థనలచే । సత్ అర్చ్యశిష్ట అర్థ్యనరున్=అర్చ్యశిష్టులకు తగిన మనుష్యునిగా ।

94. అది వెలకు ఇల వగదేరని=అది లోకమున వెల యింతయని నిర్ణయింపరాని । సదము=మంచి । పదపడి=పూర్వము । ఎంతబలవంతములన్=ఎంత గొప్పవైనను ।

95. అవనిన్=భూమియందు । పరాత్పరుడు=సర్వేశ్వరుడు । పాపవితతిన్=పాపసమూహమును ।

96. భువిన్=భూమియందు । పదపడి=అత్యంతము । సమధిక=మిక్కిలి యధికమైన । చనవునన్=కోరికతో ।

97. దురితసంకీర్తనము=పాపసంకీర్తనము । ప్రశస్తమైన=శ్రేష్ఠమయిన ।

98. ఘన మనస్తాపసంగతిన్=గొప్ప మనస్తాపమువలన । స్థిరమనీషన్=దృఢచిత్తముతో । విచారరహితముగ=వేరే ఆలోచనలు లేకుండ । సరణి గాఁగన్=విధముగా । కార్యభరము=కార్యభారము ।

99. చెలగుచున్న=ఎక్కువగుచున్న । భువనవిదితమగు=అందరికి తెలిసినదైన । తుదనుగనని=అంతులేని । అహితమైన=విరోధమైన ।

100. అణంచితిననియు=అణచి వేసితిననియు । దుర్వినయమునను=అహంకారముచేత ।

101. ఘనముక్తిని=ఘనమైన మోక్షమును । మనస్తాపనియతిన్=మనస్తాపము యొక్క నియమమును । ప్రజ్ఞాననిధీ=అధిక జ్ఞానము గలవాడా ।

వ॥ ఈ చందంబున నుత్తమంబైన మనస్తాపంబు నొందఁ గాలత్రయంబునకు మంత్రత్ర
యంబు సత్యనిగమంబునం గలిగియుండు నదియుఁ దేటఁగా వినిపించెద. 102

సీ॥ సంపూర్ణమగు మానసంబున నుండు నా । వలన స్నేహింపఁగఁబడినయట్టి
సర్వేశ నను దయాసహితచిత్తంబున । ననువందఁ గల్గించినట్టి స్వామి
దురితసంఘంబును దొలఁగించి నన్ను ర । క్షించిన కర్తవై మించు దేవ
బలవంతములగు మత్పాపముల్దేవర । వారి కసహ్యమై పరఁగుకతనఁ

తే॥ దన్నిమిత్తముగా మనస్తాపమధిక । ముగ వహించినవాఁడ నీ జగతియందుఁ
గలుగు వెతలన్ని నా యందుఁ గలిగెనేని । గాంచ నంత మనస్తాప గతిని మదిని. 103

ఆ॥ అన్ని వెతలకంటె నధికమై మీ కస । హ్యంబుగాఁగఁ జేసినట్టి పాప
ములకు నొందువాఁడ ఘన మనస్తాపంబు । మఱియు దిట్టమగుచు మట్టులేని 104

క॥ కరుణను నేఁ గావించిన । దురితమ్ముల నోర్చి యేలుదురనుచు మదిలోఁ
గరము దృఢమ్ముగ నమ్మితి । నరయఁగ నదిగాక మీ దయారస రీతిన్. 105

క॥ ఏకార్యంబరుదెంచిన । మీ కమరని కిల్బిషంబు మించుగఁ జేయన్
లోకంబున నిఁక ననుచును । భీకరప్రతినంబు సేతుఁ బ్రీతిగ నికన్ 106

వ॥ ఇదియునుంగాక. 107

ఆ॥ క్షమను నేను బాపసంకీర్తనముఁ జేసి । నా గురుఁడు నిబంధనంబు సల్పి
నట్టి నేరములను గట్టిగాఁ దీర్చెదు । నన్న మనసుతోడ నున్నవాఁడ. 108

క॥ దేవరవారికిఁ గొమరుం । డై వెలసిన జేసునాథు ననుపమరక్తం
బీవరకుఁ గరుణచేఁ గని । నావృజినౌఘముల నోర్చి నన్నిటమీఁదన్. 109

క॥ ఒకనాఁటికి నఘములఁ జే । యక నిల్వఁగఁ బుణ్యసంచయము నొనరింపన్.
సకలేశ్వర మీ భువన । ప్రకటానుగ్రహము నొసఁగి రక్షింపవలెన్. 110

సీ॥ సర్వాధిపతివైన సర్వేశ దేవర । వారి నారాధించి ప్రణుతిచేతు
దురితాత్ములందెల్ల నురుతర పాపాత్ముఁ । డన నుండు నే నెవ్వుడును గలిగిన
స్వాంతంబుచే మనస్తాపంబు నొంది స । త్కరుణారసమున మత్కర్తలగుచు
నుండు దేవరవారి కోపని పాపముల్ । వినయహీనతను గావించినాఁడ

102. కాలత్రయంబునకు=మూడు వేళలకు । సత్యనిగమంబునన్=సత్యవేదమునందు ।

103. దయాసహిత చిత్తంబునన్=దయగల బుద్ధితో । అసహ్యమై పరగుకతనన్=సహింపరానివై యున్నందువలన । తన్నిమిత్తంబుగా=దానికొఱకై ।

104. అన్ని వెతలకంటెన్=అన్ని కష్టములకంటెను । మట్టులేని=మితిలేని ।

105. కరము దృఢమ్ముగ నమ్మితి=మిక్కిలి గట్టిగా నమ్మితిని । అరయగన్=చూడగా

106. ఏకార్యంబు అరుదెంచినన్=ఏవిధమైన పని గలిగినను । మీకు అమరని=మీకు పొసఁగని । కిల్బిషము=పాపము । భీకర ప్రతినంబు సేతు=భయంకర ప్రతిజ్ఞ చేయుదును ।

108. క్షమను=భూమియందు । నిబంధనంబు సల్పినట్టి=ఏర్పాటు చేసినట్టి ।

109. అనుపమరక్తంబు=సాటిలేని రక్తము । నా వృజిన ఓఘములన్=నా పాపసమూహములను ।

110. అఘములన్=పాపములను । పుణ్య సంచయమున్=ధర్మములను । మీ భువన ప్రకట అనుగ్రహమున్=లోకమున వెల్లడియైన మీ దయను । ఒసగి=ఇచ్చి ।

111. ప్రణుతిచేతున్=సాష్టాంగముగ నమస్కరింతును । దురితాత్ములందెల్ల నురుతరపాపాత్ముడు=పాపాత్ములందఱిలో గొప్ప పాపాత్ముడు । వినయహీనతన్=అహంకారముచే । నా పాపములకుగాను ఉచితముగను=

తే॥ ననుచు మీ సన్నిధిని దెల్పుకొనెడువాఁడ। నట్టి యఘములచేగ నేనధికమైన 111
నరకమున కేగ నిరతంబు న్యాయమగుచు। నుండు నా పాపములకుఁ గానుచితముగను.

క॥ నేనుత్తరింప యోగ్యుఁడఁ। గాని మ్మహి జేసునాథు ఘనతిరురక్తం
బే ననుఁదరింపఁ జేయుఁగఁ। దానధిక బలంబు గలిగి తనరుచునుండన్. 112

క॥ గురు తిరురక్తంబును మీ। కరములరేను నత్కృపను గను నమ్మిక దే
వరవాడు నన్నుఁ గృపఁ గా। చి రయంబున నా యఘముల శిక్షించుటకై. 113

వ॥ శాంతియుక్తంబుగా మిమ్ము ననిశంబు నభినుతించుచున్నవాఁడ మీ కసహ్యంబగు కలుషమ్ములఁ జల్పియుండున కధిక మనస్తాపంబుగా మనస్తాపంబు నొందనందున దుఃఖించుచున్నాఁడ మీ కనర్హమ్ములగు వృజినమ్ముల నొనర్పఁగఁ బె నీ భువనంబునం గలిగియుండు బాధాదుఃఖమ్ములనుభవించు మనంబు ఘనంబగుచున్నయది యేతత్సమయంబు మొదలుగ నే నాగ్నేయంబు ప్రాప్తమైన మీ కారోగ్యమ్ములగు కల్మషమ్ముల నొనర్పనని ప్రతిజ్ఞ గావించుచున్నాఁడ నే ఘోరపంక వారంబునం బడక తరించునట్లు ప్రత్యహంబు ననుగ్రహంబు నొసంగవలయు. 114

క॥ కరుణ గలుగు మత్సర్వే। శ్వర నా కను లెపుడు బాష్పజలమూరుచు ని
బ్బరములగు చెలములవలెన్। బరఁగుచు నుండంగఁ జేయవలయుం బ్రీతిన్. 115

తే॥ పుడమి దేవరవారికిఁ బొందనట్టి। యఘముల నొనర్చితి ననవరతము
జాలిఁ బడవలె మఱియు నా స్వాంతమట్టి। ఘనమనస్తాపమున కరఁగంగవలయు. 116

క॥ ఇల నన్ను బ్రమానవలెనే। గలిగించితి గట్టి ప్రమాను ఘనతర పుణ్యం
బను పండ్లనిడఁగఁ జేసితి। రెలమి న్నే ముండ్లనిడితి నీ చందమునన్. 117

తే॥ అక్రమంబులు సల్పితి నధిక పాత। కముల భవదేకపుత్రుఁడై యమరినట్టి
జేసునాథుని స్లీవ నశేషరీతి। బాధపెట్టితిఁ గటువైన భావమునను. 118

క॥ సారెకు నా యెడ దేవర। వారికి నెడ మీక దురితవారంబునకున్
ఘోరపిశాచంబున కెడ। నా రూఢిగ నొసఁగినాఁడ నక్రమరీతిన్. 119

---

నా పాపములకై తగినట్లు।

112. నేను ఉత్తరింప యోగ్యుడన్ కాను ఇమ్మహిన్=లోకమున నేను ఉత్తరింప తగినవాడను కాను। తరింపగన్=మోక్షము పొందునట్లు।

113. గురుతిరురక్తంబును=జేసునాథుని దివ్యరక్తమును। మీ కరములరేను సత్కృపను=మీ యొక్క మిక్కిలి ఎక్కువగు దయను। రయంబునన్=వేగముగ। నా యఘముల శిక్షించుటకై=నా పాపముల నాశనము చేయుటకై।

114. శాంతియుక్తంబుగా=వినయముతో। అనిశంబు=సదా। అనర్హమ్ములగు=తగనివైన। వృజినమ్ములన్=పాపములను। ఏతత్సమయము=ఈ సమయము। మీకు అరోగ్యములు=మీకు పనికిరాని। ఘోర పంక వారమునన్=ఘోర పాపముల సమూహములందు। తరించునట్లు=దాటునట్లు। ప్రత్యహము=ప్రతిదినము।

115. బాష్పజలము=కన్నీరు। నిబ్బరములగు=అధికమయిన।

116. అనవరతము=ఎల్లప్పుడు। జాలిపడవలె=దుఃఖించవలయును। నా స్వాంతము=నా మనసు। ఘన మనస్తాపమునన్=మిక్కిలి పశ్చాత్తాపముచే।

117. ఎలమిన్=సంతోషముతో। ఈ చందమునన్=ఈ విధమున।

118. అక్రమంబులు=పాపములు। అధిక పాతకములన్=అధిక పాపములచే। భవత్ ఏకపుత్రుడై అమరునట్టి=మీ యేకపుత్రుడై ఒప్పినట్టి। అశేషరీతి=అధికముగా। కటువైన భావమునను=కఠిన మనస్సుతో।

119 నాయెడన్=నా హృదయమందు। ఎడము ఈక=స్థలమివ్వక। దురితవారంబునకున్=పాప సమూహమునకు। ఘోర పిశాచంబునకు ఎడన్=పిశాచమునకు స్థానమును। అక్రమరీతిన్=అన్యాయముగా।

క॥ అది గనుక యావసరమ్ముల । నదనుగ సద్భక్తితో మహాసత్త్వముతో
విదితముగ నర్చ్యశిష్టా । స్పదయై తగు దేవమాతఁ బ్రణుతింపఁదగున్. 127

ఆ॥ మహిమ నర్చ్యశిష్ట మాతృక తన తల్లి । యగుట నట్టి మరియమాంబ యెవరి
కొఱకు మనవిచేయు నగణ్యకృపారసమున । దాని నాలకించుఁ బూని యతఁడు 128

క॥ తన కూడికంబు సల్పెడి । జనులకుఁ బరిపూర్ణమైన సంభావన యి
చ్చును దుఃఖపడెడు భక్తుల । కనిశంబును దాని నుడిపి యాతి మోదము నిడున్. 129

క॥ వసుధ నుపద్రవసహితుల । కు సహాయంబును బిశాచకుల శోధనలం
దసమాన జయము నయముగ । నొసఁగుం దనపైని భక్తి నుండు నరులకున్. 130

క॥ నానా విధములఁ దగు వి । జ్ఞానామోదము నొసంగు సత్కరుణ మెయిన్
గాన వల మాతృకపయిం । బూనిన సద్భక్తి నుండి పుత్రుల రీతిన్. 131

ఆ॥ ఊడిగములు చేయుచుండు వారల భాగ్య । మంతు లెట్టులనిన పరకృపార
సాప్తి మిగులఁ దల్లియై దేవునికి మాత । యాట వారికొఱకు దీటులేని 132

క॥ మనవిని సర్వేశ్వరునితోఁ । బనఁ జేసి ధరిత్రి మనుజవితతుల కెల్లన్
ఘనదయఁ గని తా ననిశం । బును ఘన దేవప్రసాదములఁ గలిగించున్. 133

క॥ విను మామీఁదట నాక । మ్మున నుండఁగ నిత్యజీవమును గట్టడచే
యును మరియమాంబ కన్నను । జనులకు నుపకారగ మొకరు సల్పఁగఁ గలరే. 134

వ॥ అట్లగుటం జేసి యర్చ్యశిష్ట మరియమాంబ ప్రార్థనం బవశ్యంబుగ నీచందంబునఁ గావిం
పవలయు మఱియు సర్వేశ్వరు సన్నిధానంబున వసింప నర్హంబగు వగ దెలియందగు
నెట్లనిన. 135

సీ॥ అనిశంబు పాపసంహతి నొనర్పక యుండఁ । బలు తెఱంగుల దురాశల నణంప
భువనాంచితంబైన పుణ్యంబును గడింప । సర్వేశ్వరస్వామి సన్నిధాన
మున నుంటి ననుచు మమ్మున్ను వారు గనుఁగొందు । రని తలంచుట యోగ్యమగు నటంచు
విజ్ఞానవంతులై వెలయు మహాత్ములు । తెలుపుదు రందులో దేవునందు
తే॥ భక్తి గలిగిన వారు పాపములఁ ద్రోసి । యధిక పుణ్యప్రవర్తనుఁ డగుట కలరి 136
గుడిసి సల్పెడి తఱిఁ గాక గురుతరముగ । జపము సల్పెడు తఱిఁ గాక ననయుఁ డగుచు.

---

127. అది గనుక = అట్లు గావున । అదనుగ = సమయమునందు । మహా సత్త్వముతో = దృఢముగ । విదితముగ = స్పష్టముగ । అర్చ్యశిష్ట ఆస్పదయై = అర్చ్యశిష్టులకు ఆధారువై । ప్రణుతింపఁదగున్ = స్తోత్రము చేయఁదగును ।

128. అగణ్యకృపారసమున = గొప్ప దయతో ।

129 ఊడిగము = సేవ । సంభావన = సమ్మానము । దానిన్ ఉడిపి = దానిని పోగొట్టి ।

130. ఉపద్రవ సహితులకు = కష్టముతో కూడుకొన్న వారికి । అసమాన జయమును = సాటిలేని విజయమును

131. విజ్ఞాన ఆమోదమున్ = జ్ఞానసంతోషమును । సత్కరుణ మెయిన్ = మంచి దయతో । మాతృకపయిన్ = దేవమాతమీఁద ।

132. పరకృపారస ఆప్తి = మంచి దయారసము గల్గుటచే ।

133. మనుజవితతుల కెల్లన్ = మనుష్యుల సమూహమున కంతటికి । ఘనదయన్ కని = దయతో చూచి ।

134. వినుము ఆమీఁదట నాకమ్మునన్ = వినుము ఆ తర్వాత మోక్షములో ।

135. మరియాంబ ప్రార్థనము = ప్రియదత్త మంత్రము । వసింప నర్హంబగు వగ = ఉండఁదగిన విధము ।

136. అనిశంబు = ఎల్లప్పుడు । పాపసంహతిన్ = పాపసమూహములను । పలు తెఱంగుల = అనేక విధముల । భువన అంచితంబైన = లోకమున ప్రసిద్ధమైన । గడింప = సంపాదించుటకు । గురుతరముగ = ఎక్కువగ ।

క॥ పరధర్మకార్యములలో । స్థిరమగు సర్వేశు సన్నిధిని నున్నావం
చురుమతి నెప్పటికిని మది । నరయుచు భయపడఁగవలయు నా దేవునకున్. 137

తే॥ కొందఱు క్రియాగ్రహులిఁ బల్లెకూటములను । జదువు పిల్లలవలెనె చేయుదురదెట్లు 138
లన గురుని యభిముఖమునం దధిక వినయ । మునను వసియించి యాకూటమునుదొలంగి.

క॥ అలపిల్లలు నాలుగు ది । క్కుల కనుఁగొనుచు భయములేక కూఁతలిడుచు న
ట్టులు కొందఱు జపమునఁ దగ । నిలుచుతఱిఁ గుడిని గురునికటమునందున్. 139

క॥ నిలిచెడి తఱి నాచారము । సలిపి గుడిన్ బయలు వెడలి చయ్యనఁ దోడ్తోఁ
బలు విధముల నడుతురు స । త్ఫలవాంఛ నెసంగు జనుఁడు వారల రీతిన్. 140

క॥ చలువఁగవలవదు గుడిలో । వల జప మొనరించు వేళ భయమును గని యా
వల నెటకేగిన దేవ । స్థలమునఁ దానుంటిననుచుఁ దలఁచి యతనికిన్ 141

తే॥ వెఱచి యుండఁగవలయును విమలజపము । చేయు వేళలఁ దనకు వచ్చిన విశేష
ముగు విచారమ్ములను మానక పోనిచ్చి । నట్టి శపథమ్ములను దదనంతరమున. 142

క॥ వాసిగఁ జెల్లించియుఁ దాఁ । జేసిన కార్యము లఘములఁ జెందక యుండన్
శ్రీసర్వేశ్వరు నెప్పుడు । చెసరక మనమ్మునఁ దనర వేఁడుకొనఁదగున్. 143

సీ॥ ఉర్వీస్థలిని బాదుకొన్నట్టి మానస । మ్మును బరేశునిదండ నునుప నర్భ్య
శిష్ట యగుస్తిని సిష్టంబుగా నేర్పి । నట్టి జపమ్ము లర్హమ్ములగుచు
నలరు నా యా జపమ్ముల నుమఃకాల సం । జననంబులైన విచారములను
దలఁపఁ గాఁదగు నావిధమ్మున నవేళ । లను బరాత్పరు చిత్తమునఁ దలంచి

తే॥ తా నొనర్చిన కలుషబృందముల నొవ్వ । నతనిఁ బ్రార్థించి వానికి నమితమైన
పరమసన్తాపమును జెందవలయు నతఁడు । తనకుఁ జేసిన యుపకృతులను దలంచి. 144

వ॥ స్తవమ్మును గొన్ని సమయమ్ముల నొనర్పవలయు 145

సీ॥ బుద్ధి గల్గిన మనంబునఁ గొన్నిమార్లు స । ర్వేశ్వరుఁ దలఁచి యీ విశ్వధరణిఁ
దెలిసి యంతటికంటె దేవరవారిపై । భయభక్తులను నిల్పవలవదా య
టంచు దేవునిమీఁద నలరిన సద్భక్తి । స్థిరమగునట్లు వర్తింపవలయు
నిట్టి చందమునఁ బరేశుని సన్నిధి । నెడ తెగకుండు వాఁడెసఁగి నట్టి

137. ఉరుమతి=దొడ్డబుద్ధితో ।

138. అభిముఖమునందు=ఎదుట ।

139. గురుల నికటమునందున్=గురువులయెదుట ।

140. చయ్యనన్=త్వరితముగా । తోడ్తోన్=వెంటనే । సత్ఫలవాంఛన్ ఎసంగుజనుఁడు=మోక్షమందు ఆశతోనుండు మనుష్యుడు ।

141. ఆవలన్=పిమ్మట । ఎటకేగినన్=ఎచ్చటికి పోయినను ।

142. శపథమ్ములన్=ప్రతిజ్ఞలను । తదనంతరమున=తర్వాత ।

143. అఘములన్=పాపములను । చెసరక=విసుగు పొందక ।

144. పాదుకొన్నట్టి=నిలిచినట్టి । పరేశునిదండన్=దేవుని దగ్గర । ఉనుపన్=ఉంచుటకు । ఉమఃకాల సంజననంబులైన విచారములను=ఉదయమునకే కలిగిన విచారములను । ఉపకృతుల దలంచి=ఉపకారములను తలచి ।

145. స్తవము=ప్రార్థన ।

146. విశ్వధరణి=సమస్తలోకమును । జగత్ అధీశుని=లోకనాయకుని (దేవుని)। విజ్ఞానకౌతుకమున=

తే॥ జగదధీశుని యిష్టప్రసాదములను । బొంది యఘములఁ బోఁద్రోచి పుణ్యములను
గలసి వర్తించి విజ్ఞాన కౌతుకమును । ఘనముగఁ బరేశ్వరునిదండ ననుభవించు. 146

వ॥ మఱియు సత్క్రియా యోగ్యుండగు నరుం డహితరూపంబగు శరీరంబు నెఱింగి తదం
తస్థంబయిన యాత్మకు విజ్ఞానకారణంబగు కార్యంబు నవార్యంబుగా నభ్యాసం బొ
నర్పవలయు నెట్లనిన. 147

చ॥ ధరణి నిజాత్మ శాత్రవవితానము కంటెను శరీర మెన్నఁగాఁ
గర మెనలేని శత్రు వటుగావున నిత్యతపం బొనర్పికే
వెరవుగ నాజ్ఞ నిల్ప కవివేకము మించఁగ దానిఁ బెంచితే
ఇరవుగ హెచ్చి యానరు ననేక యఘమ్ములయందుఁ ద్రోసికే. 148

సీ॥ అదిగాక ధర్మకార్యములకు బహువిఘ్న । ములను నిర్మించుటవలనఁ గష్ట
పడి శరీర మదంబు నడఁపకుండిన । బలు పాపములయందుఁ బడుటగాక
వరపుణ్యములయందు వర్తింపఁగా నోఁప । డంగేచ్ఛలను ద్రోయునట్టి జనుని
కఘములు విదళింప నధిక పుణ్యంబును । గావింప సులభమౌ క్రమము గలుగు
ఆ॥ వెలయు ధర్మకార్యములు చేయఁ గఠినమౌ । నునికి దేహదుర్గుణోద్యమంబు
దాని నడఁచినపుడె తగు పుణ్యములను జే । యంగ బుద్ధి పుట్టు నతిరయమున. 149

తే॥ పుడమిఁ గొన్ని పదార్థము ల్చెడకయుండ । క్షారమున నుంచునటులు శరీరములును 150
గల్మషవ్రాత మెచ్చోటఁ గలుగకుండ । శ్రమము మది నోర్పు యొక్క ప్రొద్దు మొదలైన.

క॥ తపమనియెడు లవణంబిడి । జపమున నఘమునెడు చేటు సడలింపఁగ నౌ
నూప మెటులఁగ కూరకుండిన । విపరీతపు బురుగులనెడు వృజినము లొదవుఁ. 151

వ॥ శరీరసంబంధ దురిచ్ఛలుం గలుగుటకు సందేహంబు లేదట్లగుట సుకృతంబునం బ్రవ
ర్తింప మనంబు గలుగు నరుండు నిజాంగంబు నాప్తుని చందంబున వీక్షింపక యహితు
ని రీతిం జూచి తదర్హంబగు కార్యంబు నడిపింపవలయు. 152

తే॥ అటులఁగాదేని దుర్గుణుండైన భటుని । మాడ్కి వలసిన తగు భక్తిమాత్ర మొసఁగ 153
మఱియు దుర్వాంఛతతిని దుర్మత్సరమును । దఱిమి తద్దేహమును మించు తపమువలన

---

జ్ఞానసంతోషమును ।

147. అహిత రూపంబగు=శత్రురూపమైన । తత్ అంతస్థంబయిన=దానిలోపల నుండెడు । అవార్యంబుగా=నిరాటంకముగా ।

148 నిజ ఆత్మ శాత్రవవితానముకంటెన్=తన ఆత్మ శత్రుబృందమునకంటె । కరము ఎనలేని=మిక్కిలి సాటిలేని । వెరవుగ నాజ్ఞ నిల్పక=న్యాయముగ అదుపులేకుండ । అవివేకము=అజ్ఞానము । ఇరవుగ=స్థిరముగ ।

149. వర్తింపఁగాన్ ఓపడు=నడుపజాలడు । అంగ ఇచ్ఛలను=శరీరసంబంధమగు ఆశలను । అఘముల విదళింపన్=పాపములను త్రోసివేయుటకును । దేహదుర్గుణ ఉద్యమము=శరీర పాపముల ప్రయత్నము । కఠినమౌ ఉనికి=కష్టమైన స్థితియగును । దానిని అడచినపుడె=దానిని విడిచినపుడె ।

150. క్షారమునన్=ఉప్పునందు । కల్మషవ్రాతము=పాపసమూహము । ఎచ్చోటన్=ఎచ్చటనైనను ।

151. తపమనియెడు లవణంబిడి=తపస్సు అను ఉప్పువేసి । అఘము=పాపము । సడలింపగనౌ=వదలించదగు ; ఊపము=ఉపాయము । వృజినములు=పాపములు ।

152. దురిచ్ఛలు=చెడ్డతలంపులు । నిజ అంగంబును=తన శరీరమును । ఆప్తుని చందంబునన్=స్నేహితునివలె । వీక్షింపక=చూడక । అహితునిరీతిన్=విరోధునివలె । తత్ అర్హంబగు=దానికి తగినదైన ।

153. దుర్వాంఛతతిని=చెడ్డతలంపుల సమూహమును । దుర్మత్సరమును=చెడ్డ మాత్సర్యమును ।

ఘనగృహంబును గట్టఁగా మొదలెట్టి దా । ని ముగింపకుండినఁ గ్రమముతోడ
నందుకై పడినట్టి యాయాసమంతయు । విఫలమై చనునట్లు వేదశాస్త్ర
ఆ॥ ముల నుపక్రమించి యులరంగ నెఱవేర్ప । కుంట దాని కొక ప్రయోజనంబు
కలదె; కొందఱుగ్రకలుషమ్ములను వీడి । ధర్మమున గమింపఁ దలఁచి నిలిచి. 180

క॥ కొంచెముగ నడువ నారం । భించిన ధర్మంపుఁ బ్రోవ విడుచుదు రది మే
లంచు దలంచుదురే మా । పంచాస్య సమానశౌర్య ప్రథితౌదార్యా. 181

వ॥ అది యెట్లనిన. 182

తే॥ ఆత్మశత్రువైన యంగంబుపై బక్ష । ముంచు కొన్న ధర్మసంచయమును
వదల మూల మాత్మబ్రతుకు నపేక్షించు । వారు దేహపక్ష వర్జితులయి 183

సీ॥ క్షితి దేహపక్ష వర్జితులయి యాత్మ జీ । వనముఁ బక్షంబునునిచి న్యాయ
మున నుండు రిల రెండు మూఁడు దినంబులు । పుణ్యంబులోనుండు పురుషుఁడరయఁ
బుణ్యవంతుఁడుగాఁడు పుణ్యము నిల్పుచుక । మరణపర్యంతంబు జరుపునట్టి
యతిసదాచారులందఱు మోక్షభా । గ్యమ్మునొందనుచుఁ బ్రేమ నందు రట్టి
తే॥ ధీరుఁడే పుణ్యవంతుండు దృఢము లేని । యది కొదవ గలిగిన పుణ్యమగును దేహ
పతనపర్యంతమును నిల్పు పరమపుణ్య । మదియ సంపూర్ణ మనఁజెల్లు ననఘులీల 184

వ॥ ఇవ్విధంబునం బరఁగు పూర్వపుణ్యంబువలన ననసదృశంబగు మోక్షఫలంబు లభించు
వెండియు నగణ్యంబగు పుణ్యంబునం దతి దృఢమనంబు గలుగ సర్వేశ్వర ప్రార్థనం
బను జపంబు నొనర్పవలయు నెట్లనిన. 185

సీ॥ స్వామి సర్వేశ్వరా సకలధర్మముల నే । నారంభ మొనరించి యవల వాని
ని ముగింపకుండుట నిష్ప్రయోజనమగు । నదిగాన నధిక పుణ్యములయందు
గాఢమైనగు బుద్ధి గల్గఁగా నాకను । గ్రహమును జేయుఁడు క్రమముతోడ
బలవంతులగు శత్రువులతోడ బహుకాల । మెడలేని యుద్ధంబు వడి నొనర్చి
తే॥ తుదకు వేసారి యటనుండి తొలఁగి చనిన । నాదియందునఁ గావించినందువలన
నేమి పని గల్గుఁ గొంత దవ్వేగి యోడ । గట్టు దగ్గఱ మునిఁగినఁ గలదె ఫలము. 186

క॥ ఆరీతి నాత్మశాత్రవ । వారముతోఁ బోరి రచ్చవదలి యపజయం
బాగయఁ గొందిన మనుపటి । పోరునఁ బనియేమి గల్గు భువనాభరణా. 187

---

మై । ఉపక్రమించి=మొదలుపెట్టి । ఉగ్రకలుషమ్ములను=ఘనమైన పాపములను । ధర్మమున గమింప దలచి=పుణ్యములో నడవదలచి ।

181. పంచాస్యసమానశౌర్య=సింహముతో సమానమగు శౌర్యము గలవాడా । ప్రథిత ఔదార్యా=ప్రఖ్యాతికెక్కిన ధర్మాత్ముడా ।

183. పక్షముంచుట=ప్రేమయుంచుట । ధర్మసంచయమును వదల=పుణ్యముల ప్రోగును విడుచుటకు । మూలము=మొదటి కారణము । దేహపక్షవర్జితులయి=శరీరముమీద ప్రేమను విడచి ।

184. దేహపతనపర్యంతమును=మరణ పర్యంతమును । అనఘులీల=పాపరహితముగ ।

185. అసదృశంబగు=సాటిలేనిదైన । వెండియు=మఱియు । అగణ్యంబగు=లెక్కలేని ।

186. ఎడలేని=విరామములేని । వేసారి=విసుగుచెంది । ఏమి పనిగల్గు=ఏమి ప్రయోజనమగును । కొంత దవ్వు ఏగి=కొంచెము దూరము పోయి ।

187. ఆత్మశాత్రవ వారముతో=ఆత్మశత్రు సమూహముతో । రచ్చవదలి=కలహమును విడిచి । భువన ఆభరణా=లోకమునకు సొమ్మువంటివాడా ।

# తృతీయాశ్వాసము.

క॥ శ్రీ కథితగోపువంశ జ । లాకరకువలయసుహృన్మఱన్నావన సు
శ్లోక వహా భక్త చిత్తవ । శీకర చిదచిత్ప్రకాశ శ్రీ సర్వేశ్వరా. 1

ఆ॥ వినుము మరవపల్లె ననఘుఁడై విజ్ఞాన । లీల మెఱయుచుండు లింగ విభున
కానతిచ్చెఁ బ్రేమ నప్పాలి కథను సం । జీవనాథగురుఁడు భావమలర. 2

తే॥ మానస దరిద్రమును బూని మహి నటించు । పంచజనుఁడగుఁ గో భాగ్యవంతుఁ డధిప
యదియు నెట్టులని యడిగితివా మహాత్మ । తేటగా వింతువినుము నా తెలిసినంత. 3

సీ॥ సర్వేశ్వరునకుఁగా సకలమ్ము విడుచుట । సర్వసంగత్యాగ మూర్వినయ్యె
ధన్య మీ పుణ్యంబు సన్న్యాసులకుఁ దగు । సంసారులకు విను స్వాంతమునను
ద్రవ్యంబుపై వాంఛ దగులనీయక తన । సెలవు కవశ్యమౌ వలయు దాని
పూని యంతటికిని దాను బాత్రుఁడఁ గాన । టంచు నిజాత్మలో నెంచుకొనుచు
తే॥ విశ్వలోకేశు నేవేళ వినుతిచేసి । యతని కర్హములైన వస్తుతతులందుఁ
గొదవ లేకుండవలెనని మదిఁ దలంచి । వలయు సెలవును దగ్గింపవలయు ననఘ. 4

క॥ అగియోమానినను విను దె । ల్పెదవలయు సమస్త వస్తు బృందములెల్లన్
గొదవ పడకుండ జేసియు । సద దెలియుదు ఘనదరిద్రమను పుణ్యనిలన్. 5

ఆ॥ ఇట్టి చందమునను జేసునాథుఁడు మున్ను । మనకు బుద్ధిగలుగ మహినిఁ దనదు
సెలవులోన సారె నిలిచెను గొదవగాఁ । జెలఁగి రటులు వారి శిష్యులెల్ల. 6

చ॥ నిరశనరీతి వెన్నలను నిత్యము నిల్పి భుజించి మించి రా
నరణిఁ బ్రసిద్ధమౌ నిలుచు చంద మిల న్మనయుందుఁ దోఁచునే
కరమును మీరి వాంఛలను గాంచిన యట్లగుఁ గాక శిష్యులా
తిరుసభవారి యానతి ధృతి న్వహియింపఁగ నొప్పు నెట్లనన్. 7

వ॥ ప్రాణప్రయాణపర్యంతంబు మనంబున ఘనంబగు దరిద్రంబుఁ బూని యిహఫలాపేక్ష నుపేక్షించి యుండునంతకంటెన్ సర్వేశ్వరాధీనంబై మనుష్యులకు మేలు నొసంగున

1. శ్రీకథిత గోపువంశ=భాగ్యయుతమై చెప్పబడిన గోపువంశమను । జలాకర=సరస్సునకు । కువలయ సుహృత్=(కలువలకు మిత్రుఁడగు) చంద్రునివంటివాఁడగు । మఱన్న అవన=మఱన్నను రక్షించువాఁడా । సుశ్లోక వహా=మంచి కీర్తిగలవాఁడా । భక్తచిత్త వశీకరా=భక్తుల చిత్తములను వశము చేసికొన్నవాఁడా । చిత్ అచిత్ ప్రకాశ=జ్ఞానముచే ప్రకృతిని తెలియఁజేయువాఁడా ।

2. అనఘుఁడై విజ్ఞానలీల మెఱయుచుండు=పాపరహితుఁడై జ్ఞానముతో వెలుగుచుండు । లింగవిభునకు=లింగారెడ్డికి । భావము అలరన్=మనసున కానందము గా ।

3. మానసదరిద్రము=మనో దారిద్ర్యము । మహినటించు=భూమిని నడచునట్టి । నా తెలిసినంత=నే నెఱిఁగినంత ।

4. సర్వసంగత్యాగము=సర్వసంగపరిత్యాగము (అన్నిటిని విడుచుట) స్వాంతమునను=మనసునందు । విశ్వలోకేశు=సమస్తలోకములకు నాథుఁడైనవానిని (సర్వేశ్వరుని) వస్తుతతులందు=వస్తుసముదాయములందు ।

5. వలయు సమస్త వస్తుబృందములెల్లన్=కావలసిన సకల వస్తువులన్నియు

6. సెలవులోన=ఖర్చులో । సారె నిలిచెన=ఎల్లప్పుడు ఉండెను । కొదవగా=తక్కువగా

7. నిరశనరీతి=ఉపవాసములతో । అచందము=ఆ విధము ।

8. ప్రాణ ప్రయాణ పర్యంతంబు=చచ్చిపోవువరకు । ఇహఫలఅపేక్షన్ ఉపేక్షించి=లోకాశలను విడిచిపెట్టి ॥ అగణ్యంబుగ=ఎక్కువగ ॥ తత్ పుణ్యంబున్ అన్వేషింపన్=ఆ పుణ్యమును వెదకుటకు ॥ అసదు=స్వ